Recd. 26.4.59

# భారతి

సాహిత్య మాసపత్రిక

★

సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్




ఏప్రెల్ 1959


సంపుటము 36 : : సంచిక 4


విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఏప్రెల్ 1959



## మేనెల సంచికలో

| | |
|---|---|
| మాధవవర్మ - అతని సంతతి | శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ |
| మన వ్యవసాయ ప్రణాళికలు | శ్రీ బులుసు వేంకటసుబ్బారావు |
| 'వక్షో ముఖాంగేషు' చింత్యమా? | శ్రీ శ్రీనివాస సోదరులు |
| భీష్మునికి పెండ్లి అయినదా ? | శ్రీ నేలటూరి రామదాసయ్యంగారు |
| నన్నయభట్టు కావ్యసిద్ధాంతము | శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి |
| **హరివంశము** | శ్రీ మల్లంపల్లి శరభయ్య |

# సాహస్రమాన్మథము

శ్రీ సుప్రసన్న

క్రమలమ్ము, లశోకమ్ములు,
కుముదమ్ములు, చూతములును, కుందమ్ములు, పూ
లు — మృదువులు, భావనాపర
మములు, పరిమళావధులు అమాంతము తోచెన్.

పూవుల్ పూవులు విచ్చుకొన్నవి ధనుః పుష్పాగ్ర నారాచ లీ
లా వైచిత్ర్యము పాదుకొల్పిన దొరా! లావణ్య సౌందర్య వే
లా విద్యుల్లహరీ స్ఫురన్మధుర బాలా నీల నేత్రాంత శో
భా వీథిన్ దిగివచ్చినట్టి శిశువా! పాలింపు మీచైత్రమున్.

ఈ ఎడ ఎవరో పరిమళింపగ జేసిరి — పుష్పముల్ దివ్య
తోయతి సహ్యముల్ — గిరుల యందున, గ్రామములన్, పురంబులన్,
లోయలలోన, ఎల్లెడలలో ఒక పుష్పమె ఒక్క మన్మథుం
డై యతిలోక మోహన మహాద్భుత దర్శన మావహిల్లినన్.

వేలై మన్మథులాక్రమించిన దిశల్ వీణాక్వణత్క్రమ రో
దోలావణ్యము కూర్చుకో, దిశల దంతుల్ గున్నమామిళ్లగా
నాలో మన్మథ మన్మథమ్ములు చల న్నవ్యాంబుధార్ద్రింబులై
మాలా రమ్యములైన ఊహలు మృదూన్మాదక్రియా హేతువుల్.

చెరువున గండి పడ్డటుల, చేతమునందున కోర్కులేవొ ము
ప్పిరి గొనెన్; ఒక్క పెద్దడవి భీకరమైనది దావవహ్ని దు
ర్భరమయి కాల్చివేసినటు-పాల సముద్రమువోని శాంత సుం
దరమగు నామెదన్ అదుపు దాటిన కోర్కులు పెల్లురేగడిన్.

ప్రవరుండొక్కడు నేనుగా, సకల విశ్వంబందు నున్నట్టి మే
లి వరారోహలు కన్యకల్ మదన కేలీ దాహసంతప్తలై
ఎవరో ఒక్కరు కాక అందరొక సారే వచ్చి ప్రార్థించి పో
వ వలెన్, నేను తిరస్కరింపవలె, సర్వస్త్రీ సుధావీచులన్.

నగ్నములౌ ఒడల్లు, కనినంతనె పొంగులుపోవు యౌవనో
ద్విగ్నరసైకవాహములు, వ్రీడ ఎరుంగని సోగ కన్నులున్
అగ్నుల వోని కోరికల అంతరమందు జ్వలించు కామ సం
లగ్నలు మద్విమోగభర లక్ష్యము లచ్చర లెన్ని వందలో?

ఎదలో కామము కొల్చుకోదగినదా? ఈకత్తులౌ కన్నులున్,
తుదలన్ చక్రములట్లు వెల్గులను చిందుల్ ద్రొక్కు నేత్రంబులున్,
మద సంప్రసన్నయనంబులున్, భువన సామ్రాజ్ఞీత్వ దర్పాతుముల్,
ఉదిత స్వప్నము లంబకమ్ములు — నవర్తోన్మాదముల్ పెంచగా.

రాగమువోలె, తెల్లని పరాగము చల్లెడి గాలి వోలె, అం
తా గిలింగింతవెట్టు ఉది తారుణ కాంతుల వల్లి పోలికన్,
తూగుతరంగముల్ వలె, ఎదో ఒక పచ్చని చేనువోలె — ఈ
మాగిన పంచ భూతముల మైకము స్త్రీమయమై జ్వలించినన్.

ఈ ఉన్నదెల్లయు ఒక్క స్త్రీయయినచో,
అనుభవించెడి కోర్కె కదుపుకల్గు
నా? కనులందు సుధాక్రాంతి విభభూతి
అయిన ఆయమ చూచినంత బెదరి
పోవనా? గుండెలో పుట్టిన వాంఛల
ఊట తానయి యింకునో తెలియదు —
ఆయమ కావలెనన్న కోర్కియె కాని,
ఆనందభావ పర్యాప్తి లేద
ఈ ఎడద తాను కామేచ్ఛ ఏల సృష్టి
లోన లేనంత తనలోన రేపుకొనియె?
ఈ సహస్ర మన్మథభావ మెట్టులౌ దిగి
పోవునో! ఎదకాల్చియె పోవునేమొ!

పూవుం బూవున పొల్చు మన్మథుడు చంపు న్నన్ను ఈ విశ్వ రూ
పావిర్భావము పొల్చు మన్మథుడు నేనా? ఔను నేనే! అనం
తావేశంబున సర్వసృష్టి సొగసంతా దోచుకోనెంచినా
నీవేళన్ మృదువాయు వీచికలలో ఈ పూలలో తావిలో.

# ఇకో యణచి

శ్రీ శ్రీనివాస సోదరులు

యచ్ఛ్రీమత్తురగాస్య దివ్యకరుణా
ప్రాప్తం లవం వాధికం
తే నోద్యత్స్వదసద్వివేకపటునా
జ్ఞానేన సంశోధనా
ద్దృష్టోఽర్థః ప్రకటీకృతః; సువిబుధై
ర్విద్యావయః ప్రౌఢైః
సౌహార్దేన పరీక్ష్య కించిదపిచే
ద్గ్రాహ్యం ముదా గృహ్యతామ్.

"ఇకో యణచి" - (పాణి. 6-1-77) అనే సూత్రం వ్యాకరణ ప్రథమపాఠాలు నేర్చినవారికి కూడా సుపరిచితమైనదే. సవర్ణంకాని అచ్చు పరమైనప్పుడు ఇక్కు (ఇఉఋఌ) లకు - అనగా వాని స్థానంలో - యణ్ణు (యవరల) లు ఆదేశమవుతాయని సూత్రార్థం ప్రసిద్ధంగా చెప్పుకుంటున్నాము. దీనిచేత "సుధ్యుపాస్యః, మధ్వరిః, కర్త్రర్థః, లాకృతిః" ఇత్యాది ప్రయోగాలు సాధింపబడుతున్నాయి.

ఐతే సంస్కృత వాఙ్మయంలో ప్రాచీనకాలం నుంచీ "త్రియంబకం యజామహే, స్త్రియన్నపానాది విచిత్రభోగైః, త్రియహే పర్యవేతేఽథ, భూవాదయో ధాతవః, త్రియంబకం సంయమినం దదర్శ, వాయువంబరయో రివ, సుబాహ్వాదయః" ఇత్యాది ప్రయోగాలు చాలా ఉన్నాయి. వీటిలో ఇక్కులకు పరమందు యణ్ణులు ఆగమంగా వచ్చాయి. ఇవి "ఇకో యణచి" సూత్రంచేత సాధింపబడలేదు.

కాత్యాయనుడు "అచి శ్నుధాతు భ్రువాం య్వో రియ ఙువఙౌ" (పాణి. 6. 4. 77) అనే సూత్రం క్రింద "ఇయఙువఙ్ప్రకరణే తన్వాదీనాం ఛందసి బహుల ముపసంఖ్యానం కర్తవ్యం" అని వార్తికం పఠించాడు. అక్కడ భాష్యకారులు "తన్వం పుషేమ, తనువం పుషేమ. విష్వం పశ్య, విషువం పశ్య. స్వర్గం లోకం, సువర్గం లోకం. త్ర్యంబకం యజామహే, త్రియంబకం యజామహే" అనే ఉదాహరణ లిచ్చారు. అయితే ఈ వార్తికమూ ఉదాహరణలూ వైదిక ప్రయోగాలకే సీమితమైనాయి. ఉపనిషత్1, సూత్ర2, పురాణ3, కావ్యాలలో4 ఉన్న యిటువంటి ప్రయోగాలకు పాణినీయం సాధకం కాలేదు.

"త్రియంబకం సంయమినం దదర్శ" అనేచోట వ్యాఖ్యలో మల్లినాథుడు "త్ర్యంబక మిత్యుక్తే పాదపూరణవ్యత్యాసా త్త్రియంబక మితి పాదపూరణార్థోఽయ మియఙాదేశ శ్ఛాందసో మహాకవిప్రయోగా దభియుక్తై రంగీకృతః. కేచి త్సాహసికా స్త్రిలోచన మితి పేఠుః." అని వ్రాశాడు. మహాకవి కాళిదాసంతవాడికి పాదపూరణంకోసం ఇయఙాదేశంచేసి వైదిక శబ్దం ప్రయోగించుకోవలసి వచ్చిందట! పోనీలే, ఏదో పెద్దవాడు వ్రాశాడు అని అభియుక్తు లంగీకరించారట. కొంతమంది సాహసికులు "త్రిలోచనం" అని దిద్దను కూడా దిద్దారట. ఔను, వారికి తెలిసిన వ్యాకరణానికి అది లొంగకపోతే ఎటువంటి ప్రయోగమైనా దిద్దకుండా ఉంటే తమ దోషజ్ఞత్వానికి భంగం రాదూ మరి! ఇలాగేగా భారతం మొదలైన తెలుగు గ్రంథాలలో ప్రయోగాలు ముద్రణంలో తారుమారై పోయాయి!

పాణినీయంలోకూడా "భూవాదయో ధాతవః" (1. 3. 1) అనే సూత్రంలో "భూవాదయః" అనే ప్రయోగం ఉంది. భూ + ఆదయః = భూవాదయః.

---

1. "స్త్రియన్నపానాది విచిత్రభోగం" కైవల్య 1-12.

2. "త్రియహే పర్యవేతేఽథ." బోధాయన గృహ్యశేషం 5-2.

3. "యేన దేవ స్త్రియంబకః." శాంతిపర్వం. 99-33.

4. "త్రియంబకం సంయమినం దదర్శ." కుమారసంభవం 3-44.

ఇందులో ఊకారంకంటే పరమందు వకారం ఆగమంగా వచ్చింది. "ఇకో యణచి" సూత్రం ప్రకారంగా "భ్వాదయః" అని ఉండాలి. ఈ సూత్రం స్వరూపస్వభావాలనిబట్టి చూస్తే పాణిని తనకు పూర్వమున్న సూత్రాన్నే యథాతథంగా తీసుకున్నట్టనిపిస్తుంది. ఐతే పాణిని మహర్షి తన సూత్రానికి విరుద్ధమైన ప్రయోగం గల సూత్రం గ్రహించటం సంభవమా ? అనే ప్రశ్న వస్తుంది. కాని పలుచోట్ల అవిధంగా చేసినట్టు కనపడుతుంది. ఉదాహరణకి "కర్తరి చ" (పాణి. 2. 2. 16) అనే సూత్రంచేత కర్త్రర్థమందుండు తృచ్, అక ప్రత్యయాంతాలతో షష్ఠీసమాసం నిషేధించిన పాణినియే "జనికర్తుః ప్రకృతిః" (పాణి. 1. 4. 30), "తత్ప్రయోజకో హేతుశ్చ" (పాణి 1. 4. 55) అనే సూత్రాలలో అదే షష్ఠీసమాసాలు ప్రయోగించాడు. బహుశా ఇవికూడా తనకు ముందు ప్రచారంలో ఉన్న సూత్రాలనే క్రోడీకరించుకున్నవై యుండవచ్చు ననిపిస్తుంది.

త్రియంబకాది వైదికశబ్దసాధన కుపయోగించిన "ఇయఙువఙ్ప్రకరణే..." ఇత్యాది వార్తికం "భూవాదయః" అనే ప్రయోగం విషయంలో "ఛందోవత్సూత్రాణి భవంతి" అనే న్యాయంప్రకారం వర్తింపజెయ్యవచ్చు. కాని అప్పుడు "భూ + ఆదయః = భ్ + ఉవ్ + ఆదయః = భువాదయః" అనేరూపం వస్తుంది కాని "భూవాదయః" అనే రూపం సిద్ధించదు. భువాదయః అనే రూపం సుపద్మవ్యాకరణంలో కనిపిస్తున్నది; "భువాది సనాద్యంతా ధాతవః" 3-1-49.

భూవాదిరూపాన్ని అన్యథా సిద్ధింపజేయటానికి పతంజలి ప్రయత్నించాడు. మొట్టమొదట "కుతోఽయం వకారః ? యది తావత్సంహితయా నిర్దేశః క్రియతే భ్వాదయ ఇతి భవితవ్యం. అథాసంహితయా భూ అదయ ఇతి భవితవ్యం" అని శంకించి "భూవాదీనాం వకారోఽయం మంగలార్థః ప్రయుజ్యతే" అని వార్తికం పఠించి "మాంగలిక ఆచార్యః మహతః శాస్త్రౌఘస్య మంగలార్థం వకారమాగమం ప్రయుంక్తే. మంగలాదీని మంగలమధ్యాని మంగలాంతాని శాస్త్రాణి ప్రథంతే వీరపురుషాణి భవంతి ఆయుష్మత్పురుషాణిచ, అధ్యేతారశ్చ మంగలయుక్తా యథా స్యురితి" అని సమర్థించాడు. దీన్ని కైయటోపాధ్యాయుడు "నిపాతనాదాగమరూపోఽత్ర వకారః కృతః న చాయ మపార్థః. వైయాకరణనికాయే ప్రసిద్ధత్వాత్. తస్య చ మంగలం ప్రయోజన మిత్యనేన ప్రతిపాదితం భవతి. అపూర్వస్య హి లాభో దధ్యాదే శ్లోకే మంగలం సూచయతి. తథేహాప్యాగమో వకారో మంగలార్థః సంపద్యతే" అని బలపరచాడు.

ఐతే ఇక్కడ ఒక చిక్కుంది. "మంగలాదీని మంగలమధ్యాని మంగలాంతాని" అన్న పద్ధతిని బట్టి చూసినా ఈ సూత్రం గ్రంథమధ్యంలో లేదు, సరికి శత్తైకు దూరంలోకూడా లేదు. ఎనిమిది అధ్యాయాల గ్రంథంలో మొదటి అధ్యాయం మూడోపాదం మొదటి సూత్రమేనాయె. అప్పుడే మంగలానికి ప్రసక్తి యెక్కడిది ? కనుక ఈవాదం బలహీనం.

ఈ సందర్భంలో జైనేంద్ర వ్యాకరణ మహావృత్తిలో అభయనంది చెప్పినది గమనించదగి ఉంది. "యే తు వకారో మంగలార్థ ఇతి పఠంతి త ఇదం వాచ్యాః. య ద్యాధిక్యా ద్వకారో మంగలం, అతి ప్రసంగః స్యాత్. ఏతేన తన్ జ్ఞానం ప్రత్యుక్తం. మంగలాభిధేయశ్చ వకారో నామమాలాదిషు నపఠ్యతే" (జై. మహా. 1. 2. 1.)

భూవాది సూత్రంమీద భాష్యకారాభిప్రాయాలని క్రోడీకరించిన ఒక కారిక కాశికావృత్తిలో ఇలా ఉంది. "భూవాదీనాం వకారోఽయం, మంగలార్థం ప్రయుజ్యతే । భువో వార్థం వదంతీతి, భ్వర్థా వా వాదయః స్మృతాః." ఇందులో వకారం మంగలార్థమనే వాదం పైని పరిశీలించి ఉన్నాము.

ఇంక రెండవవాదం "భువో వార్థం వదన్తీతి" అనేది. భూధాతువునుండి 'భూ'ను క్విబంతంగా తీసుకొని "భువం = భవనం = క్రియాం వదన్తీతి భూవాదయః అని నిష్పత్తి చెప్పవంటే సరిపోతుం దని దీని భావం. కైయటోపాధ్యాయుడు "జాయమానమర్థం యేఽభిదధతి తే ధాతవః" అని ఈ భావం విపులీకరించాడు. భాష్యకారుడు "నేద మాద్గ్రహణమ్. వదే రయ మాణాదిక ఇఞ్ కర్తృసాధనః. భువం వదంతీతి భూ వాదయః" అని ప్రతిపాదించాడీ వాదాన్ని.

"వసి వపి యజి రాజి వ్రజి సది హని వాశి వాది వారిభ్య ఇఞ్" (ఉణాది 4-1-34) అనే సూత్రవ్యాఖ్యానంలో "ఇహ వాదీతి ణ్యంత నిర్దేశేఽపి బాహులకా దణ్యంతా దపి ఇఞ్. తథా చ భూవాది

సూత్రే వదంతీతి వాదయో వాచకా ఇతి న్యాసకారాదయః" అని సిద్ధాంత కౌముదీ తత్త్వబోధినిలో జ్ఞానేంద్ర సరస్వతి వ్రాశారు. అయితే బాహుళక మంటే లక్షణం లక్ష్యంపై ప్రవర్తించటం, ప్రవర్తించకపోవటం, విభాష కావటం, లక్షణోక్తమైనదానికంటె వేరు రూపం రావటం. "క్వచిత్ప్రవృత్తిః, క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా క్వచిదన్యదేవ। విధేర్విధానం బహుధా సమీక్ష్య, చతుర్విధం బాహుళకం వదంతి." (కాశికావృత్తి.) అంతేకాని అసలు లక్ష్యానికి మూలభూతమైన ధాతువే మారటం బాహుళకార్థం కాదు. అలా అయితే ఏధాతువుకైనా ఏ ప్రత్యయమైనా చేర్చి బాహుళక గ్రహణాన్ని అడ్డం పెట్టుకోవచ్చు కదా! అప్పుడు ఒక వ్యవస్థే ఉండదు. అది సమంజసం కాబోదుకదా! అందుచేతనే అభయనంది జైనేంద్ర మహావృత్తిలో "అస్మిన్ పక్షే శిష్ట ప్రయోగా దాణవయత్యాదీనాం క్షేపః" అని సమాధానం చెప్పాడు. ణ్యంతంకాని వద ధాతువుకు ఇఞ్ ప్రత్యయం చేర్చటం సూత్రాభిప్రాయం కాదు. శిష్ట ప్రయుక్తం కాదు. ఇది ఒప్పుకుంటే 'ఆణవయతి' మొదలైన అశిష్ట ప్రయోగాలను మాత్రం ఎందుకు ఒప్పుకో గూడదు? "శిష్టప్రయోగా దాణవయత్యాదీనాం నివృత్తిః"[5] అన్న కాత్యాయనోక్తి నిజానికి ఈ విషయంలో గూడా వర్తిస్తుంది కదా!

ఇంతే కాదు. "భువం వదంతీతి భూవాదయః" అన్నప్పుడు 'భవతి, పఠతి' ఇత్యాదులకు కూడా ధాతుత్వం సిద్ధిస్తుంది. కనుక వాదం సమంజసం కాదు.

ఇంక "భ్వర్థా వా వాదయః స్మృతాః" అనే సమర్థన ఒకటి మిగిలింది. దీని విషయం భాష్యంలో ఇలా ప్రతిపాదించ బడింది — "ప్రత్యేకం చాది శబ్దః సమాప్యతే. భ్వాదయ ఇతి చ, వాదయ ఇతి చ. తద్యదా తావత్ 'క్రియా వచనో ధాతుః' ఇత్యేష పక్షః తదా భూ ఇత్యత్ర య ఆది శబ్దః స వ్యవస్థాయాం వర్తతే, వా ఇత్యత్ర య ఆదిశబ్దః స ప్రకారే- భూ ఇత్యేవమాదయః వా ఇత్యేవం ప్రకారా ఇతి. యదా తు 'భావవచనో ధాతుః' ఇత్యేష పక్షః తదా వేత్యత్ర య ఆది శబ్దః స వ్యవస్థాయాం, భూ ఇత్యత్ర య ఆది శబ్దః స ప్రకారే ఇది." వా ఇత్యేవమాదయో భూ ఇత్యేవం ప్రకారా—ఇక్కడ ఇతి."

"భూ ఇత్యేవ మాదయః" అంటేనే ధాతుపాఠంలో మొదటి ధాతువు 'భూ' కనుక దానితో మొదలుపెట్టి ధాతు పాఠంలో పఠింపబడ్డ వన్నీ ధాతువులని తెలుస్తూంటే భ్వాదుల్లో వున్న మొదటి ధాతువును, అదాదుల్లో ఎక్కడో ఉన్న 'వా' ధాతువును ఎత్తుకోవటం అనవసరం. పైగా భ్వాదులూ అదాదులూ తప్ప మిగిలిన గణాల్లోవి ధాతువులా? కావా? అనే అనుమానానికి తావేర్పడుతుంది. ఇంక ధాతుపాఠంలో మొదటిది భూధాతువై యుండగా 'వా'తో మొదలుపెట్టి 'భూ' మాదిరిగా ఉండేవి ధాతువులని చెప్పటం అసలే సమంజసం కాదు. కనుక "భూ ఇత్యేవమాదయః వా ఇత్యేవంప్రకారాః" అనే పక్షంగాని, "వా ఇత్యేవమాదయః భూ ఇత్యేవం ప్రకారాః" అనే పక్షంగాని సమర్థనీయాలు కావు.

అసలు "క్రియావచనో ధాతుః" అనిగాని, "భావవచనో ధాతుః" అనిగాని లేక రెంటినీ కలిపి "క్రియా, భావ వచనో ధాతుః" అనిగాని చెప్పదలచుకుంటే అలా చక్కని సూటైన నిర్వచనం చెప్పటానికి పాణినికి అభ్యంతరం ఏముంది? అలా చెప్పక "భూవాదయః" అనటంలోనే పాణిని 'భూ' ఆదిగా గల ధాతుపాఠాన్ని దృష్టిలో పెట్టుకున్నాడనేది స్పష్టం. లేకపోతే "ఏధాదయః" అనికాని, "వదాదయః" అనికాని ఏదో యథాలాభంగా స్ఫురించిన ధాతువును ఎత్తుకొని ఉండేవాడు. ఈ క్రింది ఉద్ధారాలు చూస్తే ఇప్పుడు చెప్పిన రెండు పక్షాలుగా సూత్రాలు చెప్పిన శబ్దానుశాసకులు కనిపిస్తారు.

"క్రియాభావో ధాతుః". కాతంత్రం 3. 1. 9.
"క్రియార్థో ధాతుః" శాకటాయన 1. 1. 22.
"క్రియార్థో ధాతుః" హైమశబ్దానుశాసనం 333.
"ఏధాదయో ధాతవః స్యుః" ప్రయోగరత్నమాల 1. 170.

మరి "ఇకో యణచి" సూత్రం ప్రకారం 'భ్వాదయః' అనీ లేదు; పోనీ భాష్యకారులు సాధించబూనిన ఇతరపద్ధతులూ కుదరలేదు. ఇం కెలాగు?

---

5. శిష్టప్రయోగాత్ అన్నదానికి "ప్రయుక్తానా మిద మన్వాఖ్యానం న చాణవయత్యాదయః శిష్టైః ప్రయుజ్యంతే ఇతి నాస్తి తేషాం శాస్త్రేణాను విధాన మితి భావః" అని కైయటుని వివరణం.

అంటే దానికి పురుషోత్తమదేవుడు పాణినీయంమీద వ్రాసిన భాషావృత్తిలోను, అభయనంది జైనేంద్ర మహావృత్తిలోను, పాల్యకీర్తి శాకటాయన వ్యాకరణం మీద వ్రాసిన అమోఘావృత్తిలోను, అదే వ్యాకరణం మీద యక్షవర్మ వ్రాసిన చింతామణివృత్తిలోను, హేమచంద్రుడు తనశబ్దానుశాసనంమీద వ్రాసిన బృహద్వృత్తిలోను సమాధానం దొరుకుతుంది.

"ఇకాం యణ్భి ర్వ్యవధానం వ్యాడిగాలవయో రితి వక్తవ్యం." (భాషావృత్తిలో 6. 1. 77. 'ఇకో యణచి' సూత్రందగ్గర పఠించిన వార్తికం.)

"భూవాదీనాం వకారోఽయం
లక్షణార్థః ప్రయుజ్యతే
ఇకో యణ్భి ర్వ్యవధాన
మేకేషా మితి సంగ్రహః" (జై. నే. మ. వృత్తి. 1. 2. 1.)

"తేన 'త్రియంబకం యజామహే,' 'వాయు వంబరయో రివ' ఇత్యాది సిద్ధం." (జై. నే. మ. వృత్తి 1. 2. 1.)

"ఇకో యణ్భి ర్వ్యవధాన మిత్యేకే. తేషాం ఇక ఇతి పంచమీ. దధియత్ర, మధువత్ర తిరియఙ్, భువాదయః" (శాకటాయనవ్యాకరణం 1. 1. 73. "అస్వే" అనే సూత్రంపై చింతామణివృత్తి.)

"కేచి త్త్వివర్ణాదిభ్యః పరాన్ యవరలా నిచ్ఛంతి. దధియత్ర, తిరియఙ్, మధువత్ర, భూవాదయః. తన్మతసంగ్రహార్థ మివర్ణాదే రితి పంచమీ వ్యాఖ్యేయా." (హైమశబ్దానుశాసనం బృహద్వృత్తి "ఇవర్ణాదే రస్వే స్వరే యవరలమ్" 1. 2. 21 సూత్రం.)

పై ఉద్ధారాలన్నీ 'ఇ ఉ ఋ ఌ ల స్థానంలో 'య వ ర ల' లు ఆదేశమౌతా యనే విధికి — 'ఇ ఉ ఋ ఌ' లకు పరమందు 'య వ ర ల' లు ఆగమమౌతా యనే అపవాదాన్ని తెలుపుతున్నాయి. ఇందు మూలంగా "త్రియంబకం సంయమినం దదర్శ", "వాయువంబరయో రివ", "భూవాదయో ధాతవః" ఇత్యాది ప్రయోగాలు సాధించబడుతున్నాయి.

ద్వ్యాశ్రయ మహాకావ్యంలో హేమచంద్రుడు "రజతం చారు ఈక్షిత్వా, హరి అత్ర చ కాంచనం। దధి యేత న్మధు వెల, కుమారీ యేవ మూహతే" అని తన సూత్రానికి ఉదాహరణ మిచ్చాడు. "జ్ఞాతై ర్మృగాపుత్ర సుబాహువాదిభిః" అని సిద్ధాంత స్తవంలో ప్రయోగించబడింది.

ఐతే ఇలా యణాగమం చెయ్యటానికి భాష్యకారుడు ఒప్పుకోలేదు. ఆయన "సర్వాదీని సర్వనామాని" (పాణి. 1. 1. 27) అనే సూత్రచర్చలో ప్రసంగవశాత్తు "ఇకో యణచి ఇతి వచనాద్యణ్ స్యాత్ యథాప్రాప్తశ్చేక్ శ్రూయేత" అని ప్రతిపక్షిచేత చెప్పించి "నైష దోషః అ స్త్యత్ర విశేషః. షష్ఠ్యత్ర నిర్దేశః క్రియతే. షష్ఠీచపునః స్థానినం నివర్తయతి" అని సిద్ధాంతం చెప్పాడు. అంటే "ఇకో యణచి" అన్నప్పుడు విధించినందువల్ల యణ్ వస్తుంది, యథాప్రాప్తమైన ఇక్కూ ఉంటుంది. అని పూర్వపక్షివాదం. కాదు. 'ఇకః' అన్న చోట షష్ఠీవిభక్తి చెప్పుకోవాలి. ఆ షష్ఠీవిభక్తిస్థాని అయిన ఇక్కును నివర్తింప జేస్తుంది. అందువల్ల యథాప్రాప్తమైన ఇక్కు ఉండదు. దాని స్థానంలోనే యణ్ ఆదేశమౌతుంది. అని సిద్ధాంతం చేశాడు భాష్యకారుడు. ఇది భాషా పరిణామక్రమానికి కొంతవరకు విరుద్ధం.

"ఇకో యణచి" సూత్రంలోకూడా 'ఇకః' అనేచోట షష్ఠితోపాటు పర్యాయంగా పంచమికూడా చెప్పుకుంటే యణాదేశం, యణాగమంకూడా సిద్ధిస్తాయి. కాని మేమెఱిగినంతవఱకు పాణినీయవ్యాఖ్యాతల్లో పురుషోత్తమదేవుడుతప్ప ఇతరు లీవైపు దృష్టి పెట్టలేదు. అందుకనే కొన్నిచోట్ల సూత్రాభిమతం కాకపోయినా 'ఇయఙువఙాదేశాలు' చెప్పుకోటం, 'భూవాదయః' అనే సౌత్రప్రయోగాన్ని అన్యథా సాధించడానికి తికమకలుపడటం సంభవించింది.

భాషా స్వభావాన్నిబట్టి చూస్తే ఇక్కులకు పరమందు యణాగమం సహజమే ననిపిస్తుంది. వేదాల్లో, ఉపనిషత్తుల్లో త్రియంబకాది యణాగమయుక్త ప్రయోగాలు కోకొల్లలుగా కనిపిస్తాయి. కాబట్టి ఇక్కులకు అసవర్ణస్వరాలు పరమైనప్పుడు యణాగమమే మొదటినుండి ఉన్న సంధిపద్ధతి అనీ, తరువాత క్రమంగా ఈ ఆగమం ఆదేశంగా పరిణమించిం దనీ స్పష్టమౌతున్నది.

పాణినీయంలో "న య్వాభ్యాం పదాంతాభ్యాం పూర్వౌ తు తాభ్యా మైచ్" (7-3-3) అనే సూత్ర ముంది. వ్యాకరణం, స్వశ్వః అనే పదాలున్నా

యనుకోండి. వి+అకరణం = వ్యాకరణం, సు+అశ్వః = స్వశ్వః. ('ఇకో యణచి' సూత్రంప్రకారం.) వీటికి తద్ధితార్థకమైన అణ్ ప్రత్యయం పరమైనప్పుడు అది ణకారానుబంధక ప్రత్యయం కావటంచేత [6]ఆదిస్వరానికి వృద్ధి రావలసివుంది. వ్యాకరణ+అణ్; స్వశ్వ+అణ్. ఇక్కడ ఉన్నదున్నట్టుగా తీసుకుంటే 'వ్యా'లో 'ఆ'కునూ, 'స్వ'లో 'అ'కునూ వృద్ధి రావలసివుంది. ఇటువంటి పరిస్థితిలో "న య్వాభ్యాం" అనే సూత్రం అమల్లోకి వస్తుంది. దీని ప్రకారం పదాంతమందున్న యకార వకారాలకు సంబంధించిన అచ్చులకు వృద్ధి రాకుండా, ఆ యకార వకారాలకు ముందు 'ఐఔ'లు యథాసంఖ్యంగా ఆగమవుతాయి. అంటే 'వ్యా'లోని 'ఆ'కు వృద్ధి రాదు. అసలుఅదే వృద్ధాక్షరం. 'స్వ'లోని 'అ'కు వృద్ధిరాదు. ఇంక యకార వకారాలకు ముందు 'ఐఔ'లు ఆగమవుతాయి: కాగా "వ్+ఐ+యాకరణ = వైయాకరణ, స్+ఔ+వశ్వ = సౌవశ్వ" అనే రూపాలు ఏర్పడుతాయి. ఇక్కడ ఆగమంగా వచ్చిన 'ఐ,ఔ'లు 'ఇ,ఉ'లకు వృద్ధిరూపాలు. అంటే ఈ 'ఐ ఔ'లు ఆగమమైనచోట్ల 'ఇఉ'లు ఉండివుండాలి. వ్+ఇ+యాకరణ = వియాకరణ. స్+ఉ+వశ్వ = సువశ్వ అనేవి అసలు రూపాలైవుండాలనేది తెల్లమౌతున్నది గదా! అంటే "వి+అకరణం, సు+అశ్వః" అనేచోట్ల "ఇకో యణచి" సూత్రంప్రకారం వ్యాకరణం, స్వశ్వః అనే రూపాలే కాకుండా "ఇకో యణ్భిర్వ్యవధానం" అనే సూత్రంప్రకారం వియాకరణం, సువశ్వః అనే రూపాలుకూడా ఏర్పడటం భాషాపరిణామదృష్ట్యా సమంజసమని విదితమౌతున్నది. ఐతే పాణినీయ వ్యాకరణప్రవర్తకులలో భాషావృత్తికారుడైన పురుషోత్తమదేవుడు తప్ప ఇతరులెవరూ - మాకు తెలిసినంతవరకు - ఈ యణ్వ్యవధానం సంగతి చెప్పినట్లు లేదు. పాణినీయానుసారులై అందులోని దోషాలను తొలగించి పరిష్కరించిన చాంద్ర, సరస్వతీకంఠాభరణకారులు కూడా దీన్ని గమనించలేదు. ఐతే జైనేంద్ర, శాకటాయన, హైమశబ్దానుశాసనాలు భాషాపరిణామయాథార్థ్యాన్ని దృష్టిలో ఉంచుకొని యణాగమం (యణ్వ్యవధానం) స్పష్టంగా చెప్పి ఉన్నవి.

సారస్వతవ్యాకరణంలో 'ఇఉఋఌ'లకు 'యవరల'ల ఆదేశమే చెప్పినారు. కాని అందులో "న సంధియోర్వ్యస్యాట్ చ" (తద్ధిత. 806 సూ.) అనే సూత్రం ఉంది. ఇది పాణినీయంలోని "న య్వాభ్యాం" అనే సూత్రం లాంటిదే. అయితే ఇందులో భాషాపరిణామక్రమం చక్కగా సూచించబడింది. ఈ సూత్రానికి చంద్రకీర్తిసూరి వ్యాఖ్య యిలా వుంది — "వ్యాకరణ, స్వశ్వ — ఏక ప్రాగ్వ్యయన జ్ఞానార్థే అణ్. అవ్యత్ర వేదే త్యర్థే అణ్. ణకారో వృద్ధ్యర్థః...సంధిజాతయో ర్యకార వకారయోః సంబంధినః స్వరస్య వృద్ధిర్న భవతి. అత్ర 'వ్యా' ఇత్యత్ర 'వి+అణ్' ఉపసర్గయో ర్యోగే సంధిజో యకారః. తత్సంబంధీ స్వర ఆకారః. స చ వృద్ధిరూప ఏవ. అతో న తస్య వృద్ధికార్యం. సు+అశ్వః ఇత్యత్ర ఉకారాకారయో ర్యోగే సంధిజో వకారః. తత్సంబంధీ స్వర అకారః. స చ న వృద్ధిరూపః. ఏతస్య ణిత్వా ద్వృద్ధిసంభవే ప్రస్తుతసూత్రేణ వృద్ధినిషేధః. తతః కింతు యకార వకారయో ర్యడాగమో భవతి. యుడాగమ ఇతి కోఽర్థః?......ఇట్ ఉట్ ఇత్యేతా వాగమౌ. నను సంశ్లిష్టస్యయకారస్య వకారస్యచ ఇట్ ఉట్ ఆగమౌ కథం భవత ఇత్యాహ - వర్ణవిశ్లేష మితి. (మూలే - వర్ణవిశ్లేషం కృత్వా యకారా త్పూర్వ ఇకారః, వకారాత్పూర్వ ఉకారః. పశ్చాత్ ఆదిస్వరస్య ఞ్ణితి వృద్ధిః) "వ్+య్+అ; స్+వ్+అ" ఇతి వర్ణవిశ్లేషం వియోజన మసంశ్లేషే ణోచ్చారణం కృత్వా యకారా త్పూర్వ మికారః కర్తవ్యః. వకారాత్పూర్వ ముకారః కర్తవ్యః. స్వరహీనం పరేణ సంయోజ్య మితి సూత్రేణ 'వియా' 'సువ' ఇతి జాతం. పశ్చాత్ ఆదిస్వరస్య వృద్ధిః. 'వైయా' 'సౌవ' ... వైయాకరణః, సౌవశ్వః."

ఇక్కడ 'ఐఔ'లు ఆగమమౌతా యన్న పాణినీయసూత్ర వ్యవస్థకంటే 'ఇ,ఉ'లు ఆగమమౌతాయని ప్రాథమిక సత్యస్వరూపం చూపించి తరువాత ణిత్త్వసంబంధియైన వృద్ధికార్యం విధించడం భాషాపరిణామతత్త్వానుసారమూ, అత్యంత సమంజసమూను. 'ఇఉ'లు ఆగమమౌతాయని వియాకరణ, సువశ్వ రూపాలు సాధించటమంటే యణాగమం అంగీకరించటమే కాని వేఱు కాదుగదా!

---

6. అంగస్య. పా. 6-4-1. మృజేర్వృద్ధిః. పా. 7-2-114. అచోఞ్ణితి. పా 7-2-115.

ఫలితాంశ మేమంటే — 'ఇఉఋఌలకు అసవర్ణస్వరం పరమైనప్పుడు— (1) 'ఇఉఋఌ' లకంటె పరమందు 'యవరల' ఆగమమౌతాయి. ఉదా: దధియత్ర, సుధీయుపాస్యః, మధువత్ర, భూవాదయః, ధాతృరంశః, ఌలాకృతిః. (2) 'ఇఉఋఌల స్థానంలో 'యవరల' ఆదేశమౌతాయి. ఉదా: దధ్యత్ర, సుధ్యుపాస్యః, మధ్వత్ర, భ్వాదయః, ధాత్రంశః, లాకృతిః.

"ఇకో యణచి" సూత్రానికి 'ఇకః' అనేచోట షష్ఠీమాత్రమే కాకుండా పంచమికూడా చెప్పటంటే యణాదేశమూ యణాగమమూ సిద్ధించి సనాతన సంస్కృత ప్రయోగాలకు సాధక మేర్పడుతుంది. ఇది భాషాపరిణామం దృష్ట్యా సముచితం, ఆదరణీయమూ కూడాను.

భట్టోజిదీక్షితులు చెప్పినట్టు మునిత్రయోక్తమే ప్రమాణం, అందులోనూ మళ్లీ ఉత్తరోత్తరమునికంటె పూర్వపూర్వముని చెప్పింది ప్రమాణం అనే వాదం కేవలం అనుచితం. భాష ప్రవాహినిగా ఉంటేగా ఒక్కొక్క భాషావేత్త తననాటికి అమలులో ఉన్న భాషకు అనుశాసనం చేస్తాడు. ఉత్తరోత్తరవ్యాకర్తలు తమతమ కాలాల్లో అమల్లోకి వచ్చే అభినవ ప్రయోగాలకు సాధన చూపిస్తారు. కనుక బహువ్యాకరణశాస్త్ర పరిశ్రమచేత గాని సమగ్రభాషాతత్త్వం అవగాహన కాదు. విశ్వవిద్యాలయాల్లో వ్యాకరణ పరీక్షలకు పాణినీయంతప్ప ఇతరవ్యాకరణాలు శిరోమణి పరీక్షకైనా, శాస్త్రి, ఆచార్య పరీక్షలకైనా పాఠ్యాలుగా నిర్ణయించకపోవటం దురదృష్టం. పూర్వం ఈపద్ధతి అమల్లో ఉన్న కాశీ మొదలైనచోట్లకూడా సంకుచితదృష్టి ఏర్పడి కేవలం పాణినీయానికే తమ పాఠ్యక్రమాన్ని సీమితంచెయ్యటం శోచనీయం. భాషాశాస్త్రసిద్ధాంతాలు విపులప్రచారం పొందిన ఈరోజుల్లో విశ్వవిద్యాలయాలు భట్టోజిదీక్షితులవాటి సంకుచితదృష్టికి స్వస్తిచెప్పి ఇంకనైనా వ్యాకరణశాస్త్రాభ్యాసం విపులంచేసి పాణినీయేతర వ్యాకరణాల అభ్యాసానికి తగిన దోహదం చేసి వైయాకరణులకు విశాల దృష్టి కలిగించే ప్రయత్నం చెయ్యటం ఎంతో అవసరం.

# నా ర ద ప రి మ ళ ము

శ్రీ సి. నారాయణ రెడ్డి

ఇపుడిపుడే యేదో నా
ద పరిమళ కిశోరమ్ము
నా మనస్సు లో లోపలి
నందనమున కా ల్మోపెను.

పలుమారులు రమణుల చె
క్కిళులపైన జారిపడ్డ
నా చూపులు నేటికి అం
తర కాంతివ్రతము లయ్యె.

ఇంకా శమియింపవేమి
ఈ పంచేంద్రియ బంభర
ముహుర్ముఖర ఝంకార
మ్ములు విషయ వికారమ్ములు?

క్రొత్త క్రొత్త విరుల పెదవి
కొనల రుచుల మరగినట్టి
మత్త మధు లిహములపుడే
మౌన స్థగితము లగునా?

మల్లడిగొను ఈ బాహిర
కల్లోల మ్మణగి నపుడె
అనుభావ్య మ్మగును నిర్గ
ణాంతర్నాద రసాకృతి.

కన్నులెదుట కిమ్మీరిత
కాంతా కింజల్కమ్ములు
చెల్లాడగ మనసులోని
చిరవాసన లారుటెట్లు?

క్షణకాలావధిక మన
స్తర్పణ నిఘ్నమ్ములైన
ఈ వాసన లెచట? శశ్వ
దీశ్వర పరిమళ మ్మెచట?

ప్రణవాక్షర పద్మ ముఖ
ప్రసర న్మృదు పరిమళమ్ము
నాతనువున కమృతచేత
నస్థితి కలిగించుగాక!

బహు స్పృహా సంక్షోభ
స్ఫాటితమా అస్మదంత
రాళమ్మున ఆనంద మ
రాళము రమియించుగాక!

# లక్షణసార సంగ్రహము

## శ్రీ బులుసు వేంకటరమణయ్య

ఆంధ్రమున గల లక్షణగ్రంథములలో 'లక్షణ సార సంగ్రహ' మొకటి. దీని రచయిత చిత్ర కవి - పెద్దన. దీనిని 1940 లో 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు' వారు శ్రీ వంపరాల - సూర్యనారాయణ శాస్త్రిగారి 'టీక' తోను, శ్రీ నిడుదవోలు - వేంకటరావుగారి 'ఉపోద్ఘాతము'తోను బ్రకటించియున్నారు. అంతకుబూర్వ మీ గ్రంథమును గూర్చి యెఱిగినవారు చాల కొలది. అప్పకవి లక్షణ సార సంగ్రహమును పేర్కొనుటయే గాక, యిందలి దేశీయ పదికి సంబంధించిన పద్యమును తన 'దేశ్యనిత్య సమాస విశ్రాంతి' వివరణ సందర్భమున నిచ్చియున్నాడు. దీనినిబట్టి యీ పెద్దన అప్పకవికంటె బ్రాచీనుడగుట నిశ్చయము. మరియు నీతడు సుప్రసిద్ధ వైష్ణవ మతగురువగు కందాళై - అన్నగారి శిష్యుడు. ఆయన పదునాఱవ శతాబ్దిలోని ప్రారంభమున నుండినట్లు తిరుపతి దేవస్థానమునందలి యొక శాసనమునుబట్టి తెలియుచున్నది. దీనింబట్టి యతని శిష్యుడగు నీ పెద్దన క్రీ. శ. 1550 ప్రాంతమున నుండియుండునని యూహింపవచ్చును. క్రీ. శ. 1570 ప్రాంతమున నున్న లింగముకుంట - తిమ్మకవి - సులక్షణ సారకర్త - చిత్రకవి పెద్దనను పేర్కొనియున్నాడు.

ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు ప్రకటించిన ఈ 'లక్షణ సార సంగ్రహము' మూడాశ్వాసముల గ్రంథము. ఇందలి లక్ష్య, లక్షణములు, వివరణ— అన్నియును పద్యరూపముననే కలవు. కీ. శే. శ్రీ మానవల్లి - రామకృష్ణ కవిగారు కుమారసంభవ, క్రీడాభిరామముల పీఠికలలో వ్రాసిన యంశములనుబట్టి పెద్దకవి గ్రంథ మసమము ఆఱాశ్వాసముల గ్రంథమై యుండినట్లును, అందలి లక్షణములకును, విషయములకును వివిధగ్రంథములనుండి యుదాహరణములు గ్రహింపబడినట్లును తెలియుచున్నది. దీనింబట్టి చిత్రకవి పెద్దన కవికృత లక్షణ సార సంగ్రహములు— విభిన్న స్వరూపములు రెండున్నట్లు తెలియుచున్నది. శ్రీ రామకృష్ణకవిగా రుదాహరించిన గ్రంథ మింతవఱకు నలభ్యము. అయ్యది లభ్యమైననేగాని, వీనిలో నేది పెద్దనకృతమో, ఏదికాదో— ఆలోచించుటకైన నవకాశము లేదు.

ఒక్క గ్రంథము విభిన్న రీతులలో ఏకకర్తృకముగా నుండుట కొంత విచిత్రమే! ఇట్టి సమస్యయే గౌరనకవి రచించిన లక్షణదీపిక యెడను నుద్భవించుచున్నది. ఆ లక్షణగ్రంథమునకు రెండు విభిన్న ప్రతులున్నవి. అందేది కవికృతమో, నిర్ణయించుట కష్టము. తమ గ్రంథమునకు సుప్రతిష్ఠితనాముని కర్తృత్వము నారోపించినయెడల, దానికి మంచి ప్రచారము లభింపవచ్చునను నాశయమున గొందఱు కృతికర్త లిట్టి పద్ధతి నవలంబించి యుండవచ్చును!

ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించిన లక్షణ సార సంగ్రహములోని పద్యము నప్పకవి యుదాహరించుటచే నీ ప్రతియే పెద్దనకవి కృతమని ప్రకృతమునకు నిర్ణయింపవచ్చును. గ్రంథములోని విషయమును పరిశీలించుటయే వ్యాసముయొక్క యుద్దేశమగుటచే గర్త యెవ్వరైననుసరే—అతనిని గూర్చిన చర్చ యప్రస్తుతము.

సంస్కృత లక్షణ గ్రంథములకంటె నాంధ్ర లక్షణ గ్రంథములు చాల విలక్షణములైనవి. ఛందో గ్రంథములందు వ్యాకరణాలంకార విషయములుండవు. అట్లే మిగిలిన లక్షణ గ్రంథములందును విషయాంతరముల సాంకీర్యము మృగ్యము. ఆంధ్రభాష యందలి లక్షణ గ్రంథము లట్లుండవు. ఛందోగ్రంథములందు వ్యాకరణాలంకార విషయములు, వ్యాకరణములందు ఛందః ప్రశంస, అలంకార గ్రంథములందు దక్కిన వాని ప్రసక్తి గానవచ్చుచున్నవి. అలంకార లక్షణమగు కావ్యాలంకార చూడామణిలో ఛందోవ్యాకరణముల వివరణ కొంతకలదు. కవిజనాశ్రయము, ఛందోదర్ప

రెండు మూడు తాటిచెట్లు లోతు కలవని, క్రూర జంతువులు నివసిస్తున్నాయని బస్సులోవున్న ప్రయాణికులు వర్ణించారు. దారిమధ్య కండక్టరు రోడ్డు వారగా వున్న ఓ రాతి విగ్రహానికి కొబ్బరికాయకొట్టి చెంపలు వాయించుకున్నాడు. దారిలో ఎలాంటి ప్రమాదమూ కలుగకుండా వుండటానికి ప్రార్థన—

డిస్పెన్సరీ చాలా చిన్నది.

కావలసినమందులు చాలావరకు లేనే లేవు. ఓ ముసిలి కంపౌండరుమాత్రం వున్నాడు. అతనిపేరు శ్రీధరన్ నాయర్. ఆ చుట్టుపక్కలవున్న గ్రామాలకు కూడా ఇదే డిస్పెన్సరీకావటంమూలాన సైకిలుమీద నేనే వూళ్ళన్నీ తిరిగిరావాలి. ప్రజలు గౌరవ మర్యాదలతో ప్రవర్తించి నా బాగోగులు, జీవితక్రమం తెలుసుకోటానికి ఎలాంటి ప్రయత్నమూ చెయ్యలేదు. శ్రీధరన్ ఒంటరిగాడు. అతనికీ, భార్యకూ మధ్య మనస్పర్థలు ఏర్పడి ఇద్దరూ విడిపోయారు. ఆమె ఆచార ప్రకారం మరోవ్యక్తిని పెళ్ళిచేసుకుని సుఖంగావుంది. శ్రీధరన్ అప్పుడప్పుడు తను చేసిన పనికి పశ్చాత్తాపపడినా అది ఎంతోకాలం నిలిచేదికాదు. 'అహం' దాన్ని తుడిచివేసేది. అందుచేత ఇద్దరం కలిసి డిస్పెన్సరీ వెనకవున్న ఓ చిన్నగదిలో వండుకు తినేవాళ్ళం. ఇలా రెండు వారాలు గడిచాయి.

ఉన్నట్టుండి అతను రాజీనామాచేసి ఎక్కడికో వెళ్ళిపోయాడు. ఊళ్లోవున్న వ్యక్తుల్నిగురించి అతనొక్కడే నాకు వివరించి చెప్పేవాడు. ఇప్పుడు ఆ లోటు భయంకరంగా విజృంభించింది. జీవితమంటే వెగటు కలిగింది. స్టీవెన్సన్ అన్నట్టు ఏదో అనుకోని, వూహించని సంఘటన జరక్కపోతే కొందరికి జీవితం కరక్కాయ నములుతున్నట్టుంటుంది. మా నాన్నగారి రక్తం నాలో ప్రవహిస్తూంది కనక నా విషయంకూడా అంతేననిపించింది. మెడికల్ ఆఫీసరుమీద అంతులేని కోపం వచ్చింది. నన్ను మరెక్కడికైనా ట్రాన్స్ఫర్ చేయమనికోరుతూ పెద్ద వుత్తరం రాశాను. కొత్త వ్యక్తులు - కొత్త వాతావరణం - ఎందుకొచ్చిన అర్థంలేనిమాటలు - సాయంత్రం బయలుదేరి వడిస్తే వరిపొలాలు- తాటిచెట్లు-విచిత్రంగా చూసే మనుష్యులు- చివరిక్కలిగేది ముళ్ళమీద నడుస్తున్న బాధ-అనుభవం.

మానసిక సంఘర్షణ - తిండి సరిగ్గాలేకపోవటం- ఆకాశపుటంచులవరకూ ఎగిసే అసంతృప్తి-మనిషిని జీవచ్ఛవంగా మార్చి మంచానవేయటానికి ఇంతకంటే ఏంకావాలి? వచ్చిన మూడువారాలలో జ్వరంతో బాధపడ్డాను.

ఓనాడు మధ్యాహ్నం రెండుగంటలు-

కొత్త కంపౌండరు రెండు మూడు సార్లు వచ్చి ఏదో విజిట్కి వెళ్లాలని జ్ఞాపకంచేశాడు. అతన్ని కసిరి పొమ్మన్నాను. మళ్ళీ తలుపుతీసుకుని ఎవరోవచ్చారు. నాకు తెలుసు. ఆ కంపౌండరే అయ్యుంటాడు. అటు తిరిగిచూడకుండా 'ఎన్నిసార్లు చెప్పాలి? నీకు బుద్ధిలేదూ? జ్వరంగావుందని, లేవలేనని చెప్పేది నీక్కాదూ?' అనరిచాను.

'అందుకే, సంగతేమిటో కనుక్కుందామని వచ్చాను.'

ఆ కంఠస్వరం కంకరరాయిని చేలమీద గీసినట్టుంది. వచ్చింది కంపౌండరుకాదని అర్థంకాగానే వెనక్కి తిరిగిచూశాను. ఆయనకూ నాకూ పరిచయం లేకపోయినా తెలుసు. శ్రీధరన్ అయిదారుసార్లు ఆయన్నిగురించి నాకు చెప్పాడు. వూళ్లో వున్న స్థితిమంతుల్లో స్థితిమంతుడు. వందఎకరాల భూమి-బోలెడంత ఆస్తివుంది. లేచికూర్చుని నమస్కరించాను. నల్లటి పెదవులమీద చెదరిపడివున్న నవ్వును ఒక మూలకు కేంద్రీకరింపజేస్తూ నా దగ్గరకు వచ్చి కూర్చున్నారు.

'నా రాకమీకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. రెండు మూడు రోజులుగా వద్దామనుకుంటున్నా. తీరుబడి కలిగిందికాదు. మీకు వంట్లో బాగాలేదని, వండుకోటం అదీ, కుదరటంలేదని విని బాధపడ్డాను. ఇప్పుడెలావుంది?' ఆశ్చర్యంలోంచి తేరుకోటానికి కొంతసేపు పట్టింది.

'కొంచెం నయం. నా గురించి ఇంత శ్రద్ధతీసుకున్నందుకు కృతజ్ఞత' అన్నాను.

కళ్ళల్లోవున్న గంభీరత పెదవులు కదిపింది.

'అలాకాదు. మాకోసం మీరు చాలాదూరం నుండి వచ్చి కష్టపడుతున్నారు. మీగురించి ఎవరూ శ్రద్ధతీసుకోటంలేదు. అంటే నిర్లక్ష్యంతోకాదు. ఎలా సత్కరించాలో తెలియని అమాయకులు. ఆ లోపాన్ని భర్తీచేసేందుకే నేను వచ్చాను.'

సంభాషణ అలా సాగిపోయింది. చివరకాయన వ్యక్తంచేసిన సంగతి నన్ను దిగ్భ్రాంతిలో ముంచింది.

ఆయనింట్లో నాకోసం ఓ గది ఏర్పాటు చేశారుట— తిండి సంగతి తను చూస్తానని, వెంటనే మకాం మార్చమని చెప్పారు. ఆయన పేరు రామయ్యరుగారు. ఆయన అభిమానానికి కారణం ఊహిస్తూ ఊహాపథంలో దారి తప్పి ఎక్కడికో వెళ్ళిపోయాను. వసంతఋతువు రాగానే బాహ్యంలో మేలుకుంటున్న ప్రకృతి పులకరింతలతో పరుగులు వేసినట్లు ఈ అనునయ వాక్యాలలో మనసు అడవిపూవుల పరిమళాన్ని వాసన చూసింది. ఇంకా కొంతకాలం అక్కడే వుంటానని మెడికల్ ఆఫీసరుకు రాశాను. ఆయన నా నిర్ణయానికి నవ్వుకుంటాడని తెలుసు.

నాలుగు రోజుల తరువాత ఆయనింటికి బయలుదేరాను. సామాను ముందే వెళ్ళింది. సూట్‌కేస్ మాత్రం చేతిలో వుంది. పొట్టిగా, లావుగావున్న రామయ్యరుగారు ముందు నడుస్తుంటే ఏదో గొప్పశక్తి నన్ను సర్వోదయం వైపు తీసుకు వెడుతున్నట్టనిపించింది. ఊరి చివర ఆయన యిల్లు-మెయిన్ గేటు దాటి లోపల అడుగు పెట్టగానే గులాబి, చేమంతి, నిద్రగన్నేరు పువ్వులు కలుక్కుమని నవ్వాయి.

'ఇదెవరూ? కొత్త డాక్టరుగారా? ఆయన కూడా జ్వరం వచ్చిందట.' ఈ మాటలు నా దృష్టిని మరో దిక్కుకు మరలించాయి. సుమారు పది పన్నెండేళ్ళుంటాయి. నలుపూ-తెలుపూకాని రంగు. చెవులకు నేనెప్పుడూ చూడని ఇక్ష్వాకుల కాలంలో ప్రసిద్ధిలో వున్న చిత్రవిచిత్రమైన ఆభరణాలు-ముక్కుపుడకల్లో వున్న రాళ్లు దగ్గరగా మెరుస్తూ 'మేం వున్నాం' అన్నాయి. మెడనిండా మోయలేనన్ని గొలుసులు-నగలు-కాసులమాల-పచ్చ పరికిణీ-ఎరుపు రవిక-పొట్టి జెడ-కాళ్లకు పట్టాలు-వేళ్లకు పాలిపోతూన్న గోరింటాకు రంగు-ఛాందసత్వం మూర్తీభవించి కనిపించింది.

'మా అమ్మాయి-అలమేలు, అన్నాడాయన. గుర్తుకొచ్చింది. ఎవరికో కళ్లు కలిగాయని మందుకోసం వచ్చింది ఈ అమ్మాయే! వంట్లో బాగాలేదని, మర్నాడు రమ్మని కసిరికొట్టాను.

గదిలో సామానంతా సర్దాను. నాలుగుగోడలకూ పటాలు - న్యూటన్--ఆర్కిమెడిస్-లూయీపాశ్చర్-షేక్స్పియర్. గోడమీద అలమేలు ఫోటో వుంటే బాగుండుననిపించింది. ఆమెతో నాకు సాన్నిహిత్యం లేదు. అలాంటప్పుడు ఈ అనురాగం ఎందుకేర్పడిందో అర్థం కాలేదు. కొందరు వ్యక్తుల్ని చూసీచూడటంతో ప్రేమిస్తాం. వారిలో యిమిడివున్న ఆకర్షణశక్తి లోపాల్ని కప్పిపుచ్చుతుంది. కొన్ని సంవత్సరాలపాటు పరిస్థితుల ఒత్తిడిమూలంగా కలిసివున్నా, ఒకరి మనస్తత్వం మరొకరికి అర్థమైనా, ఎందుకో కొందర్ని ప్రేమించలేం. పైకినవ్వుతూ తియ్యగా మాట్లాడినా లోపల ఎక్కడో ఓమూలవున్న అసహ్యం పైకి రాలేక గిజగిజతన్నులాడుకుంటుంది. మెడికల్ జర్నల్ మీద కళ్ళుమాత్రం కేంద్రీకృతమైవున్నా మెదడులో పరుగెత్తే ఆలోచనలు ఇవి. కిటికీ తలుపులు రెండుసార్లు దబదబా బాదుకున్నాయి.

గాలి వీచటం లేదు_బాహ్యశక్తిలేనిదే ఏ వస్తువూ కదలదని న్యూటన్ మొదటి సిద్ధాంతం ప్రతిపాదిస్తూంది. కనక ఆశ్చర్యంతో తలెత్తిచూశాను. కిటికీలోంచి అలమేలు చూస్తోంది. ఆమె చాలా సేపట్నుంచి అక్కడ నిలబడివుందని, నా దృష్టిని తనవైపు తిప్పుకోటానికి ప్రయత్నించి ఓడిపోయి తలుపు రెక్కల రెక్కలు విరిచిందని ఆమె కళ్లు వివరించాయి. పుస్తకం మూసేసి బయటకు వచ్చాను.

'ఏం కావాలి అలమేలూ?' అనడిగాను.

'నాకేం కావాలి? జ్వరం వచ్చిన వాళ్ళు మీ దగ్గరకు రావాలికాని_నాకెప్పుడూ సుస్తీ చెయ్యదు. తెలుసా?...అది సరేకాని మీరిక్కడే వుంటారా?' ఆ ప్రశ్న 'వెంటనే దయచెయ్యండి' అన్నట్టువున్నా అలా అనుకునేందుకు ఆధారాలు లేవు,

'అవును. ఇలా లోపలకురా_మంచి మంచి పుస్తకాలుచూపిస్తాను'అన్నాను. పరికిణీ కుచ్చెళ్లు ఎత్తిపట్టుకుని పొట్టిజెడవుందో, వూడిందోనని వెనక్కి తిరిగి చూసుకుంటూ లోపలకువచ్చి పెట్టెమీద కూర్చుంది. లాంగ్‌మన్స్ వారి కొన్ని బొమ్మల పుస్తకాలు ఆమె ముందు పడేశాను. 'మీకిలాంటి పటాలే నచ్చుతాయా? వీళ్లంతా దెయ్యాల్లా అలావున్నారేమిటి? దేవుడి పటాలు పెట్టుకూడదూ?'అని కొంచెం చనువూ, కోపం చూపిస్తూ అడిగింది.

కనిపించని దేవుణ్ని ఆరాధించి చివరకు మోక్షం పొందే దానికన్న, వీళ్లను స్మరించుకోటం మేలు-నరకబాధలనుభవిస్తున్న మానవుల కష్టాలు గట్టెక్కించటానికి వీళ్లంతా త్యాగం చేశారు. చీకటిలో మగ్గి, 'భూమి బల్లపరుపుగా వుంది.' మొదలైన సిద్ధాంతా

లను నమ్మి మూఢనమ్మకాల పిడిలో చిక్కుకుని వెలుతురు వుందని మర్చిపోయిన మనుష్యులకు వెలుగుమార్గం చూపించారని ఆమెకు వుపన్యసిద్దామనుకున్నాను. అంతేకాదు. ఈ శాస్త్రజ్ఞులు ఏయే రంగాల్లో కృషి చేసి ఎలా ఎలా అభ్యుదయానికి మెట్లు కట్టారో వివరిద్దామనుకున్నా-సరైన మాటలు వుద్రేకంలో కొట్టుకుపోయాయి. ఆమెకు అర్థంకాదుకూడా. మరుక్షణం నవ్వుకున్నా, 'అలమేలూ! నీకు జ్వరం వచ్చిందనుకో!' అని మొదలు పెట్టాను. 'ముందే చెప్పాను. నాకెప్పుడూ జ్వరంరాదని.' అంది కోపంలో.

'పోనీ- నాకే జ్వరం వచ్చిందనుకో- దేవుడికి దండంపెడితే తగ్గుతుందా? డాక్టరు రావాలి-ఏదైనా మందివ్వాలి- అవునా? అందుచేత డాక్టరు గొప్పవాడు. అతనిచ్చే మందులు కనిపెట్టింది వీరేకనక వీరందరూ గొప్పవారు.' అన్నాను పటాలకేసి చూపిస్తూ. అలమేలు నా మాటల్ని జీర్ణం చేసుకుంటుందనికాదు. అంతచిన్న అమ్మాయి ముందు ఓడిపోకూడదని.

'కాని ఆ గొప్పవాళ్ళంతా దేవుడి దయవలనే జన్మించారు. ఇదంతా కనిపెట్టేందుకు కావలసిన మేధాశక్తిని ఆయనే ప్రసాదించాడు. సృష్టికంతా మూలకారణం 'ఓం' అన్న శబ్దం- అందులోంచి అందరూ జన్మించారు. అదీ భగవంతుడి స్వరూపం!'

ఆశ్చర్యంలో ఐక్యమై పోయాను.

'అలమేలూ? ఇదంతా ఎక్కడ నేర్చావు?'

'మా అమ్మాయిసంగతి మీకు బాగా తెలియదుగామోలు. సంస్కృతం చదువుకుంది. సంగీతం నేర్చుకుంది. మొన్న మొన్నటిదాకా ఒకాయన నేర్పేందుకు వచ్చేవాడు. భగవద్గీతలో శ్లోకాలు చాలావరకూ కంఠస్థం ... అలమేలూ! అప్పుడే సాధింపు మొదలెట్టావా?' అని రామయ్యరుగారనేసరికి ఆమెసిగ్గుపడుతూ వెళ్ళిపోయింది. ఆయన నా యోగక్షేమాలు కనుక్కుని, భోజనాదుల విషయంలో ఏర్పాట్లు గురించి వివరించారు. మనసులో నమస్కరించాను.

ఆ మర్నాడు వుదయం—

తోటనిండా రకరకాల పువ్వులు మేలుకున్నాయి; ఆకర్షణ పత్రాలను విదల్చి ముసిముసిగా నవ్వాయి. ఆశదాగిందికాదు. ఓ రోజాపువ్వు కోశాను. చేమంతిపువ్వు దగ్గరకు చెయ్యి వెళ్ళేసరికి వెనకనుండి హుంకరింపు వినిపించింది. అలమేలు కాళికామ్మవారిలా నిలబడివుంది.

'మీరు పొద్దున్నే స్నానం చెయ్యకుండా పువ్వులెందుకు కోస్తున్నారు? అదీకాక అవన్నీ దేవుడికి. మీరు వాసనచూసి పారేసేందుకుకాదు.' అంది.

ఊరుకోక ఆమెకోపాన్ని రెట్టించాను.

'ఏం? కోస్తే మీ దేవుడు ఏంచేస్తాడు?'

'శుద్ధిగా చేయటంలేదు కనక తిన్నగా నరకానికి పంపిస్తాడు.'

'నాకు నరకమంటే భయంలేదు- అదో అభూత కల్పన-'

ఈ మాటు ఆశ్చర్యపడటం ఆమెవంతు.

'భయంలేదూ? అక్కడ 'ఏం జరుగుతుందో తెలిస్తే మీరూ జడుసుకుంటారు. అక్కడకు వెళ్ళిన వాళ్ళందర్నీ సలసల మరిగే నూనెలో పడేస్తారు. రంపంతో కోస్తారు. శూలాలలో పొడుస్తారు. తల్లకిందులుగా నిలబెట్టి నోట్లో నిప్పులుపోస్తారు. అవన్నీ అనుభవించాలని వుందా?'

అలమేలు స్నానంచేసింది - తడిగావున్న జుట్టంతా విరియబోసుకుంది. ఓడిపోయినట్టు ఒప్పుకుని గదికివచ్చాను.

రెండువారాలు గడిచాయి.

నిరాశ ఆవరించినా, ఏమాత్రం వెలుగు కనిపించినా తిరిగి ఆశ మొలకెత్తుకుంది. ఆశ అనేది జనిస్తూ, పెరుగుతూ, మరణిస్తూవుంటుంది. జాగ్రదవస్థలోవున్న వ్యక్తుల్ని అలమేలులాంటి మనస్తత్వం మేల్కొలుపుతుంది. నిజానికి ఆమెకూ, నాకూవున్న అనుబంధం ఎలాంటిదో తెలియదు. ఆ పల్లెటూళ్ళో వున్నందున నా భవిష్యత్తును చేతులారా సమాధిచేసుకుంటున్నాను. అయినా ఆత్మజ్ఞానం కలుగలేదు. పూర్వజన్మలో ఆమె నాకేదో అయుండాలి. ఏదోవిధమైన ఋణానుబంధంవుంటుంది. అందుకే మళ్ళీ ఓచోట కలిశాం – ఆమెనుచూడాలని, ఏదో అర్థంలేని, అంతులేని కబుర్లుచెప్పాలని వుంటుంది. ఇలా వేదాంతం యిచ్చే తృప్తి తాత్కాలికమైనా దాన్నుండి తప్పించుకోలేం. అలమేలు ఏదోవిధంగా నన్ను సాధించటానికి ప్రయత్నించటం-చివరకు ఓడిపోయి వుడుకుమోత్తనంతో వెళ్ళిపోవటం పరిపాటైపోయింది. 'చెట్టిచ్చి' కాయలు తీసుకొచ్చి నాముందుపడేసి తినమనేది. నాకిష్టంలేదని ఎంతచెప్పినా వినదు. ఉదయంలేచి అరఫర్లాంగుదూరంలోవున్న ఎలిమెంటరీస్కూలుకు

వెళ్ళి ముళ్ళకంచెలమీదకొచ్చే ఆ కాయలు కోసుకు రావటం ఆమె దైనందిన కార్యక్రమాలలో ఒకటి. వగరుగా పుల్లగావుండే ఆ కాయల్లో దాగివున్న అమృతత్వం ఏవిటోమరి?

ఆవేళ ఆదివారం.

సాయంత్రం ఎక్కడికీ వెళ్ళేఅవసరం లేదు. సూర్యాస్తమయంకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను.

'త్వరగా బయలుదేరండి.' అంది అలమేలు. పట్టుపరికిణీ-జాకెట్టు-మొదటిరోజుచూసిన దానికంటె ఎక్కువ నగలున్నాయి. చేతిలో వెండిపళ్ళెం. దాంట్లో హారతి కర్పూరంముద్ద - పెద్దపువ్వులదండ - ఓ చిన్న వెండిగిన్నెలో నూనె-అంతా పవిత్రమయం.

'అలమేలు! నీ కెన్నోసార్లు చెప్పాను. దేవుడి మీద నాకు నమ్మకంలేదు-గౌరవభక్తులు అసలులేవు. ఎందుచేతనంటే నేనెప్పుడూ ఆయన్ని చూడలేదు.' అన్నాను కదలకుండా.

'అదంతా' నాకుతెలిసిందే-ఇవేళ ఏకాదశి-దేవుణ్ణిచూపిస్తాను. పదండి.' అంది మందలింపుగా. అందులో ఎలాంటి ఆకర్షణ వుందోకాని ఆమెవెంట బయలుదేరాను.

ఊళ్ళోంచి వెళ్ళకుండా డొంకతిరుగుడుగా వున్న దోవంటవెడుతున్నది. ఎందుకో నాకు తెలియదు. పదినిమిషాలు నడిచాక ఓ 'ఇట్లి' గుండా వెడుతున్నాం. (రెండువైపుల ముళ్ళకంచెలోవున్న చిన్న సందుకు మలయాళంలో 'ఇట్లి' అంటారు.) హఠాత్తుగా ఓ యింటిముందు ఆగింది. మట్టిలో కలిసిపోయి ఇద్దరు కుర్రాళ్ళు ఆడుకుంటున్నారు.

'మీయమ్మను పిలు.' అంది. ఇద్దరూ లోపలకు పరుగెత్తారు. మరో రెండునిమిషాల్లో ఓ ముసిలావిడ బయటకువచ్చింది. ఆమె వేషాన్నిబట్టి వెంటనే గ్రహించాను. ఆమె 'ఈయవన్' అనేజాతికి చెందుతుంది. పొలాల్లో పనిచేసేది వీళ్ళే. ఆనాడు బ్రాహ్మణులకు వీరికీ బద్ధవైరంవుండేది. 'ఈయవన్' జాతి నీచజాతి - వాళ్ళకు పదిగజాల దూరంలో వుండాలి. ఏ మాత్రం దగ్గరకు వెళ్ళినా మైల పడతారు. సాన్నం చెయ్యాలి. ముట్టుకుంటే మహాపాపం. వీళ్ళు గ్రామంలో ప్రవేశించేటప్పుడు 'ఓ' అంటూ ధ్వనిచేస్తూ రావాలి. ఆ ధ్వని వినగానే వారి రాక తెలుసుకుని ముందు జాగ్రత్తపడమని అర్థం-హెచ్చరిక—అంతకంటె అధమమైన జాతి 'నాయాడి'జాతి. ఈ జాతివారిని ముట్టుకుంటే నూటెనిమిదిసార్లు నీటిలో మునగాలట. అయిదారేళ్ల క్రితం ఓ చిన్నకుర్రాడు పొరపాటున ఓ 'నాయాడి'ని ముట్టుకున్నాడని, ఛాందసుడైన అతని తండ్రి నూటెనిమిదిసార్లు నీటిలో ముంచేస్తానని, తత్క్షణంగా ఆ కుర్రాడు వాతంకమ్మి చనిపోయాడని శ్రీధరన్ ఇదివరకు నాకు చెప్పాడు. ఈ ఆచార వ్యవహారాలు ఘోరంగా వితండనృత్యం చేసినా, దాని బాగోగులు పరిశీలించి నిర్మూలించేశక్తి, మనస్థైర్యం ఎవరికీ లేకపోయాయి. చిన్నతువ్వాలు చుట్టుకుని, మరో చిన్నతువ్వాలుతో గుండె కప్పుకున్న ఆమెను చూడగానే ఈ విషయాలన్నీ జ్ఞప్తికి వచ్చాయి.

'ఏమండి! బుల్లమ్మాయిగారూ?' అంది తమలపాకులు నములుతున్న నోటితో ముసలావిడ.

'కంకు ఇంట్లోలేడూ?'

ఆ ముసలావిడ ముఖంలో రకరకాల భావాలు కనిపించి మాయమయ్యాయి. భయం—విచారం—సందేహం-తత్తరపాటు అన్నీ—

'లేదండమ్మాయిగోరు!' అంది వణుకుతున్న కంఠంతో-స్ఖలితనంవలన కావచ్చు—

'ఎప్పుడు వస్తాడు?'

'ఏమోనండి. చావలేక యిలావున్నాను.' అనేసి గబగబ వెళ్ళిపోయింది. నాలుగడుగులు ముందుకు వేశాక 'కంకుఎవరు?' అనడిగాను- కొంతసేపటివరకు సమాధానం రాలేదు.

'మా పొలంలో పనిచేసేవాడు. నాన్నగారు వద్దని పంపించేశారు.'

ఆవేళ ఏకాదశి కావటంమూలాన దేవాలయంలో జనం కిటకిటలాడారు. దివ్యమంగళాకారుడు చిరునవ్వులు వెదజల్లుతూ మానవుల మూఢత్వాన్ని ఛేదించి విజ్ఞానదీపాన్ని వెలిగించటానికి కాంతులు, కిరణాలు వెదజల్లుతున్నాడు.

'ఇప్పుడు చెప్పండి- దేవుడు వున్నాడాలేడా?' అనడిగింది అలమేలు. వుందో లేదో తెలియదు. నలుపో, తెలుపో అర్థంకాదు- శాంతిప్రియత్వం ఎంతవరకూ వ్యాపించినది బోధపడదు. అలాంటి వస్తువుకు నామరూపాలు సృష్టించి దాని వునికిని నిర్ణయించ

టానికి ప్రయత్నించటం అవివేకం- మాట్లాడక ఊరు కున్నా-

ఆ మర్నాడు వుదయం హాల్లోకి రమ్మని రామయ్యరుగారు కబురంపారు. వెళ్ళేసరికి ఓ కొత్త వ్యక్తి కనిపించాడు.

'రండి! మీ కోసమే ఎదురుచూస్తున్నా. ఈయన ఇన్స్పెక్టర్ సింగారవేలు- మీరు వినేవుంటారు కనీసం పేపర్లో చదివివుంటారు.'

'రెండూలేదు' అందా మనుకున్నాను. కాని ఆయన బాధపడతాడేమోనని అంగీకార సూచకంగా తలవూపాను. సింగారవేలు నల్లగా నిగనిగ లాడుతూ రాయిలావున్నాడు. కోరమీసాలతో వందమంది దొంగల్ని కట్టివేసేవాడిలా కనిపించాడు. పదునెక్కినకళ్లు- ప్రతివ్యక్తిని, వస్తువును అనుమానంతో చూసే మనస్తత్వం అతనిది. 'వేలు ఎందుకువచ్చారని ఆశ్చర్య పోతున్నారుకదూ ? ఏడాదికితం నా దగ్గర కంను అనే అతను పనిచేసేవాడు. ఎంతో విశ్వాసంతో, వినయంతో ప్రవర్తించేవాడు. కాని కొంపమీద ఆపలేనివాడెవడు? ఉన్నట్టుండి ఓ చిన్న దొంగతనంచేసి పట్టుబడి పోయాడు. ఆనాటినుంచి గజదొంగై పోయి నామీద కక్షకట్టాడు. ముందుజాగ్రత్తకోసం వేలుగార్ని రప్పించాను. ఆయన్ని నాకు బాగా తెలుసు.'

కంను గజదొంగ-అలమేలు చెప్పినకంను, ఇతనూ ఒక్కరేనా ? అలాగైతే అలమేలుకు అతని సంగతెందుకు ? మనసులోవున్న అభిప్రాయాల పరావర్తన మొహంమీద కనిపించిందిగామోలు-వేలు నన్ను అనుమానంగా, పరీక్షగా చూశాడు.

'ఇదంతా మీకు చెప్పట మెందుకంటే మీరు చాలా వూళ్లు తిరుగుతూంటారు. అతని ఆచూకీ తెలిస్తే వెంటనే తెలియజేయాలి.' అన్నాడు వేలు. 'తప్పకుండా-అరాజకాన్ని అరికట్టటం ప్రతివాడి విద్యుక్త ధర్మం-కాని ఓ చిక్కువుంది. అతనిముఖం నేనెప్పుడూ చూడలేదు. ఒకవేళ అతనే నా కెదురుగా వచ్చినా- అతనికి నేను చికిత్సచేసినా, గుర్తుపట్టటం సులభం కాదు.' ఇద్దరూ నవ్వుకున్నాము - అవును మరి కంను ఫోటో లేదుగా!

ఆ సాయంత్రం-

రాత్రంతా ఆలోచనలమధ్యపడి నలగటం మూలాన నిద్రలేదు. చల్లగాలి జో కొడుతూండగా నిద్రపోతున్నా, ఎవరో తలుపు దబదబ బాదుతుంటే అదిరిపడిలేచి కూర్చున్నా. శ్రీధరన్ లోపలకు వచ్చి నమస్కరించి కూర్చున్నాడు.

'ఏమోయ్! కులాసా?' అనడిగాను. గడ్డం బాగా పెరిగిపోయింది. కళ్ళు రెండూ ఎర్రగా భయంకరంగా వున్నాయి. ముఖంమీద యిదివరకున్న ముసలితనం శాఖోపశాఖలు వేసింది.

'మీ దగ్గర్నుండి వెళ్లాక తిండితిప్పలు సరిగ్గా లేకుండా చాలా బాధపడ్డాను. ఎక్కడా సరైన నౌఖరీ దొరకలేదు. అనుకున్నపని జరగలేదు. మీరే దయతల్చి నన్ను మళ్ళీ కంపౌండరుగా చేర్చుకోవాలి.'

ఆ కోర్కె అసందర్భమైందని అతనికీ తెలుసు.

'నీకు తెలియనిదేముంది శ్రీధరన్? కొత్త కంపౌండరు పర్మనెంటయ్యాడు. ఏ తప్పూ లేనప్పుడు ఎలా డిస్మిస్ చెయ్యటం? అయినా అధైర్యపడకు- మెద్రాసులో మా మెడికల్ ఆఫీసరున్నాడు. ఆయనకో వుత్తరం రాసిస్తాను-నీఅదృష్టాన్ని పరీక్షించుకో.'

శ్రీధరన్ నవ్వటానికి పెదవులు కదల్చబోయి అశక్తతతో వూరుకున్నాడు.

అతనితో నాకున్న పరిచయం స్వల్పమైనదైనా అతన్నో ప్రియమిత్రుడిగా భావించాను. నన్ను వేధించుకుతింటున్న కంను విషయం అతనితో ప్రస్తావించాను. అతను స్పష్టీకరించిన విషయాలు నెత్తిమీద పిడుగులవాన కురిపించాయి. కంను అందరికంటె విశ్వాసపాత్రుడు-రోజుకు పదహారు గంటలు పనిచేసేవాడు. మంచికీ, చెడ్డకీ మధ్య తేడా తెల్లగోడవుందనికూడా తెలియదు. ఉన్నట్టుండి రామయ్యరుగారింటోంచి చిన్న చిన్న వస్తువులు మాయం కాసాగాయి. ఎవరిమీద అనుమానపడటమో కూడా తెలిసిందికాదు. ఓనాడు అలమేలు మెడలో వుండే పదహారు కాసుల గొలుసు కంనుదగ్గర దొరికింది. ఆ సమయంలో ఆ యింట్లో పనిచేసే 'నాక్కన్' తప్పించి మరెవరూ లేరు. రామయ్యరుగారి యింటి వెనకాలవుండే పెద్ద తోటపనంతా అతనే చేసేవాడు. ఆయన ముక్కోపి- పరిస్థితులు అర్థం చేసుకునే ఓపికలేదు. కంనుని దొంగగా నిర్ణయించి స్తంభానికి కట్టి చావగొట్టారు. శ్రీధరన్ చెప్పిన మరో విషయం నన్ను ఆశ్చర్యంతో ముడివేసింది. ఆ దొంగతనం చేసింది నాక్కన్. అతడి కుటుంబం చాలా పెద్దది. దాన్ని సరైన మార్గంలో

పోషించలేక ఈ వూబిలోకి దిగాడు. తప్పని తెలిసినా జాలిపడి కంకు అతనికి సాయంచేశాడు. దెబ్బలన్నీ తిన్నాడుకాని నిజం చెప్పలేదు. అప్పట్నుంచీ గ్రామంలో అందరూ అతన్ని దొంగగా నిర్ణయించి వేధించుకుతిన్నారు. బహిష్కరించారు. అందరూ కలిసి 'నువ్వు దొంగతనంచేసి బతకాలి-మరెందుకూ పనికి రావు' అని శాసించారు. కంకు గత్యంతరంలేక ఆ మార్గాన్ని ప్రేమించటం నేర్చుకున్నాడు. అతని పేరు పోలీసు రిజిస్టరులో స్థానం సంపాదించుకుంది.

'అదేమిటి శ్రీధరన్! ఇంతమంది పోలీసులు-ఆఫీసర్లు-సి. ఐ. డి. లు ఒక్క దొంగను పట్టలేరూ?'

'మీకు తెలియదండి. శ్రీచూర్ దగ్గరవున్న కుదరాంకున్నులోనే అతని మకాం. ఆ లోయలోకి వెళ్ళటానికి ఎవరికీ ధైర్యం వుంటుందికనక'-శ్రీధరన్ వెళ్లిపోయాడు. మరి కొంతసేపటికి అలమేలు వచ్చింది.

'ఇందాకా పోలీసతను మీతో చెప్పినదంతా విన్నాను!' అంది చేతులు వెనక్కి కట్టుకుని తలనిలువునా ఆడిస్తూ- సమాధానం రాకపోవటంమూలాన తనే చెప్పుకుపోయింది.

'జాగ్రత్త! కంకు చాలా చెడ్డవాడు. కత్తితో పొడిచేసి చంపేస్తాడు. కాళ్ళూ చేతులూ విరగ్గొడతాడు. అతని జోలికిమాత్రం వెళ్ళకండి.' నాకు నవ్వాగిందికాదు.

'నా దగ్గర తుపాకీవుంది- కాల్చేస్తాను.'అన్నాను దాబుగా.

కళ్ళల్లో అసహాయత అటునుంచి యిటుకదిలింది.

'అది సరేకాని అతన్నిగురించి నీకింత శ్రద్ధ ఎందుకు ?'

తన నీడను చూసి జడుసుకున్న వ్యక్తిలా త్రుళ్ళిపడింది. ఆ చిన్నగుండెలో జరుగుతూన్న మథనం నా కర్థంకాదు.

'చిన్నప్పట్నుండి అతను నన్ను ఎత్తుకుని పెంచాడు. ఎప్పుడూ అతనిదగ్గరేవుంటూ ఆడుకుంటూ వుండేదాన్ని. అతనికూతురు, నేను కలిసి ఆడుకునే వాళ్ళం- అమ్మ నాన్న వీలైనంతవరకూ వారించారు. చివరికి చేసేదిలేక వూరుకున్నారు. ఓనాడు ఆ అమ్మాయి నన్ను మేడ మెట్లమీదనుండి కిందకు తోసేసింది. రెండుమూడు మెట్లుదొర్లుతూ వచ్చేసరికి నాన్నగారు పట్టుకున్నారు. ఆయన కోపంవస్తే వళ్లు తెలియదు. కంకుకూతుర్ని చింతబరికెపుచ్చుకుని బాదారు. పదిరోజులు జ్వరంతో బాధపడి ఆమె చచ్చిపోయింది. అప్పట్నించీ కంకు నన్ను ముద్దుగా ఎత్తుకుని తిరిగేవాడు. నాన్నగారు ఏమీ అనేవారుకారు. ఇదంతా మా యింట్లోనే- బయటకు ఏ వార్తా పొక్కదికాదు. తెలిస్తే నలుగురూ మమ్మల్ని వెలివేస్తారుకూడా. అతను కనిపించకపోతే ఎలాగోవుంటుంది. అందుకే నేను గుళ్ళోకి వెళుతుంటే అతన్నిగురించి అడిగాను. నన్నెవరూ అనుమానించరు- పాపం! వెర్రివాడుకంకు!'

ఆమె కళ్ళు నీటికుంటలయ్యాయి.

ఆమె చిన్నహృదయంలో ఒత్తిడిచేత పగలటానికి సిద్ధంగావున్న లక్షున్నర భావాల్లో ఇవికూడా కలిసివుంటాయి. ప్రేమ, అనురాగం- ఈ రెండూ అయస్కాంతాల్లాంటివి. ఒకసారి ఆకర్షించటం మొదలుపెడితే దానిశక్తిని ఎదుర్కోటం, నిర్లక్ష్యపరచటం సాధ్యంకాదు. అలమేలు మనస్తత్వం నాకు అద్దంలో ప్రతిబింబంలా బాగా అర్థమైంది. సహజత్వానికి ఓ మెట్టుపైన—

రాత్రి పన్నెండైంది.

దూరంగా రకరకాల అరుపులు వినిపిస్తున్నాయి. కొన్ని మనుష్యుల ఆర్తనాదాల్లా ప్రతిధ్వనించాయి. రాత్రిపూట దెయ్యాలు వూరి పొలిమేరవరకూ ఒక్కొక్కప్పుడు వూళ్ళోకి- వస్తాయని, రాత్రి తొమ్మిది గంటలుదాటితే ఎవరూ ఒంటరిగా బయటకు వెళ్ళరని అలమేలు చాలాసార్లు చెప్పింది. నిశిరాత్రి ఒంటరిగా బయలుదేరివెళ్ళి ఈ మాటల్లో దాక్కున్న నిజానిజాన్ని రుజువుచేయాలని వెళుతున్నప్పుడు అనుకున్నా, చీకటి ఒంటరితనం బంధించేసరికి ఆ పక్షకాలన్నీ గజగజ వణుకుతూ పడుకునేవి. దెయ్యాలు కేవలం మానవసృష్టని వాదించినా, అర్థంకాని అస్పష్టధ్వనులు ఎందుకిలా వస్తున్నాయన్న ప్రశ్నకు సమాధానం లభించక పోయేసరికి అక్షణంలో దెయ్యాలున్నాయని నమ్మాను. నెమ్మదిగా కిటికీ దగ్గరకు వచ్చాను. ప్రకృతి చీకటి గర్భంలో దాక్కుంది. ఏమీ కనిపించటంలేదు. కేరళ దేశంలో ప్రతి ఇంటి వెనక ఓ చిన్నతోట వుండి తీరుతుంది. రామయ్యరుగారు స్థితిమంతులుకనక ఫర్లాంగు పొడవున్న తోటవుంది. ఎడారిలో ఎండమావుల్లా మిణుగురుపురుగుల వెలుతురు తప్పించి మరేమీలేదు. ఆ నిశీథినిలో

చలిగాలిలో ఏ సత్యాన్వేషణ చేద్దామనుకున్నానో గాని తలుపు దగ్గరగావేసి తోటలోకి వచ్చాను. చంద్రకాంతం పువ్వులు విచ్చి సొగసుగా వూగిసలాడుతున్నాయి. కీచురాళ్ల ధ్వని గగనంలోకి దూసుకుపోతోంది. మంచు కురుస్తున్నా లెక్కచేయకుండా వర్డ్స్ వర్త్ వర్ణించిన 'డాఫడిల్స్' పద్యాలను గుర్తుకు తెచ్చుకుంటూ అలాగే నిలబడ్డాను. నాచుట్టూ వెయ్యి నాగుపాములు బుసకొట్టినా తెలియదు. అంతటి తన్మయత్వం.

రెండే క్షణాలు!

ఎవరో మెడ గట్టిగా పట్టుకున్నారు. దృష్టిని వెనక్కి తిప్పటానికి వీల్లేదు. అసలే దయ్యాన్ని గురించి ఆలోచించానేమో, భయంతో నిర్జీవ ప్రతిమనై పోయాను.

'ఎవరు నువ్వు?' అన్న మొరటు కంఠం వినిపించింది స్వచ్ఛమైన మలయాళంలో.

'అయ్యన్నేం చెయ్యకు-వదిలేయి.'

అది అలమేలు కంఠధ్వని-మెడమీది చెయ్యి సడలింది. వెనక్కి తిరిగి చూశాను. చెవులకున్న దుద్దులు-ముక్కుపుడక తళుక్కు తళుక్కుమన్నాయి.

'ఏమి టిదంతా అలమేలూ?' అనడిగాను.

'ఓస్! ఈ మాత్రానికే భయపడుతున్నారా? ఇత నేకండు.'

గుండె జల్లుమంది. హఠాత్తుగా అసాధారణ పరిస్థితులమధ్య చిక్కుకున్నప్పుడు ఎలా ప్రవర్తించాలో తెలియదు. ఎలాంటి ఆలోచనలూ మెదడులో ప్రవహించవు. ఓ పెద్దదొంగముందు నేను నిలబడివున్నాను. అతనెందుకు వచ్చాడు? ఎలా వచ్చాడు? అతని రాక అలమేలుకు ఎలా తెలిసింది? సర్వసాధారణంగా వుదయించే ఈ ప్రశ్నల నుత్తరాలుకూడా కనిపించలేదు. అలమేలు నన్ను 'మంచివాడి'గా పరిచయంచేసింది. సింగారవేలు కోర్కె జ్ఞప్తికొచ్చింది. ఈ క్షణంలో అతన్ని పట్టివ్వగలిగితే నా పేరు చిరస్థాయిగా నిలబడుతుంది. ప్రభుత్వం ఏదైనా పతకమిచ్చి గౌరవిస్తుంది.

'మీ గదిలోకి వెళ్లి పొండి.' అన్నాడు కండు. ఆ చీకట్లో ఏదో తళుక్కున మెరిసింది. అది పదునైన కత్తి అనుకున్నాను. మరు మాట్లాడకుండా గదిలోకి వచ్చిపడుకున్నాను. అలమేలు నాతో చనువుగా మాట్లాడినందున అతను వూరుకున్నాడుకాని, లేకపోతే అక్కడే సమాధి కట్టేవాడు.

నిద్రపట్టలేదు. శరీరంలో ప్రతి అణువూ రెండుగా చీలిపోయి ద్వంద్వయుద్ధం ప్రారంభించాయి. కర్తవ్యానికీ, అనురాగానికీ మధ్య సంఘర్షణ. అడుగుజారిందేమోననుకుంటే – వయసు పదిపన్నెండు సంవత్సరాలు-ఆమె హృదయం నిర్మలమైన సరస్సులాంటిది. అందులో ఇలాంటి నీచభావాలకు స్థానం వుందని ఒక్కసారైనా వూహించుకున్నందుకు సిగ్గుపడ్డాను. కండు ముఖం ఆ చీకట్లో సరిగ్గా కనిపించలేదు.

నా కర్తవ్యాన్ని మూటగట్టి వుంచినందుకు అంతరాత్మ ఎత్తిపొడిచింది. గతాగతాలు ఎలావున్నా దొంగతనం ధర్మసూత్రానికి కట్టుబడింది కానప్పుడు దాన్ని ప్రతిఘటించటం నా విధి. ఏదో శక్తి నన్ను వశం చేసుకుంది. గబగబలేచి చప్పుడు కాకుండా రామయ్యరుగారు పడుకునే గదిదగ్గరకు వచ్చాను. ఆయన అరుగుమీద మంచం వేసుకుని గురకపెట్టి నిద్రపోతున్నారు. నెమ్మదిగా లేపాను. కొందరు ఎంతటి గాఢనిద్రలో పెనవేచుకుపోయినా సూది కిందపడ్డ చప్పుడుకాగానే మేలుకుంటారు.

'కండు తోటలో వున్నాడు' అన్నాను. అలమేలు కూడా వుందని అనబోయి నాలిక్కరుచుకున్నాను. దానివలన కలిగే అనర్థాలు నన్ను హెచ్చరించాయి.

'ఎవరు? కండు? అతనిని మీకెలా తెలుసు?' అంటూ రామయ్యరుగారు మంచంకింద వుంచిన పెద్ద కర్ర తీసుకున్నారు.

'ఎవరో దొంగ-అతనే అయుంటాడనుకున్నా-' అన్నాను కల్పిస్తూ.

'పదండి. మీరు భయంగావుంటే మాత్రం రాకండి' అన్నారు.

ఆ చీకట్లో పళ్లు కనిపించాయి. ఆ మాటల్లో హేళన వుందిగామోలు-చిక్కు వచ్చిపడింది. ఆలోచించేందుకు అవకాశం లేదు. నన్ను చూడగానే అలమేలు అంతా పసిగడుతుంది. ఇంక నాకు 'చెట్టిచ్చి' కాయలు ఇచ్చేవారెవరూ వుండరు. ఆయన్ని వెంబడించాను. తోటంతా టార్చిలైటువేసి చూశారు. ఎవరూ కనపడలేదు.

'ఎవడో మామూలు దొంగ అయుంటాడు. తోటలో నాలుగు అరటిగెలలు ముదిరి సిద్ధంగా వున్నాయి. ఎత్తుకుపోవటానికి వచ్చివుంటాడు. పోనిద్దురూ! వాళ్లనికూడా తిననీయండి. నేనే మర్యాదగా పిలిచి యిస్తే వూళ్ళో పెద్దలు నలుగురూ యీసడిస్తారు. ఈ రాక్షసులతోనూ—జిత్తులమారి నక్కలతోనూ పోట్లాడే దానికంటె చాటుగా వూరుకోవటమే మంచిది. వెళ్ళి పడుకోండి. గడితలుపులు వేయటం మర్చిపోవద్దు.' అనేసి పెద్దగా ఆవులించి వెళ్ళిపోయారు. రామయ్యరుగారన్న చివరి మాటలు నన్ను ఆలోచనలోకి విసిరివేశాయి. నిజంగా ఆయనకు కంకుమీద కోపం, పగతీర్చుకోవాలన్న అభిప్రాయం వున్నట్టు కనపడలేదు. ఆయనమనసు సముద్రమైతే అందులో అభిప్రాయాలు రత్నాలు, మొసళ్లు-

మర్నాడు వుదయం ముఖంమీద అయిదారు నీటిచుక్కలుపడి నిద్రలోవున్న నన్ను మేల్కొలిపాయి.

'అటుచూడండి- అటు-'అంది కళ్లు తెరిచేలోగా అలమేలు- ఎదురుగా కృష్ణుడిపటం వుంది. వద్దన్నా వినకుండా పదిరోజులక్రితం గోడకు తగిలించింది.

'ముందుగా ఆ పటాన్ని ఎందుకు చూడమంటావ్ ?'

అలమేలుకళ్ళు పెద్దవిచేసి సుంద్రంగా తిప్పుతూ 'ముందుగా దేవుణ్ని చూస్తే ఎలాంటికష్టాలూ ఎదురోక్కవు. ఈ రోజు ఏలాంటి నిందలూ మీదపడవు. ఈ చరాచరాలకు ఆయనే కర్తకనక ముందుగానే ఆశీర్వాదం పొందటం అవసరం-' అంది.

లేచి కూర్చునేసరికి అలమేలు నా ముందు ఓఅట్టపెట్టె వుంచింది.

'ఏమి టిదంతా ?' అనడిగాను.

'అలాచెప్తే ఇంకేముంది ? తెరచి చూడండి— పాములున్నట్టు భయపడతారే ?'

పెట్టె తెరిచాను. రకరకాల ఆటవస్తువులు పలకరించాయి. ఆపుకోలేక పెద్దగా నవ్వేశాను. అది ప్రమాదించింది.

'ఎందుకేలా నవ్వుతారు ? ఇలాంటివి మీ రెప్పుడైనా చూసివుంటేగా?' అని ఒక్కొక్కటే తీసి బయట వుంచింది. కీయివ్వగానే పరుగెత్తేరైలు. అందుకొవలసిన పట్టాలు - చిన్నకారు-నృత్యంచేసే కోతిబొమ్మ-తల అటూ యిటూ వూగిస్తూ ఏదో గానాలాపన చేస్తున్నట్టు కళ్లు సుంద్రంగా సొగసుగా కదిపే రబ్బరు దొరసానిబొమ్మ-ఇంకా ఏన్నో-నాకూడా ముచ్చటవేసింది.

'ఇవన్నీ మీ నాన్నగారు ఎప్పుడు కొనిచ్చారు?'

'మా నాన్నగారు కొనివ్వలేదు.'

'మరి?' టార్చిలైటులో సెల్సు బయటికితీస్తూ అడిగాను.

'నిన్న రాత్రి వచ్చాడే కంకు-అతనే కొనుక్కొచ్చాడు. అందుకే వచ్చాడు. బాగున్నాయా ?'

చేతిలోవున్న సెల్సుకాళ్ళమీద పడ్డాయి. బాధతో మూలుగుతూ వెనక్కి తిరిగాను. ఏదో అనటానికి పెదవులు కదిలాయి. అలమేలు ముఖంలో చెదరిపడివున్న ఆనందం కళ్లల్లో చేరుకుని వుండేందుకు చోటుచాలక బయటకు వురకటానికి యత్నించింది.

'మరి మీ నాన్నగారుచూస్తే ఏమీ అనరూ ?'

'ఆయనకు చూపించను - అమ్మకు తెలిసినా ఫరవాలేదు.'

'అంతేలే! మరేం భయపడకు - ఒకవేళ మీ నాన్నగారు చూసినా ఏదో అబద్ధంచెప్పి తప్పించుకోవచ్చు.'

'ఏమిటి ? అబద్ధమా ? నా నాలిక కోసేసినా అబద్ధం చెప్పను-దేవుడు శిక్షిస్తాడు. వెనక వోమారు తప్పుచేసినవాళ్లందర్నీ నరకానికి పంపిస్తాడని చెప్పాను. జ్ఞాపకం వుందా ? మళ్ళీ వంద జన్మలు ఎత్తినా ఆ పాపంపోదు. ఇంత పెద్దవారు మీరుకూడా అబద్ధం చెప్పమంటున్నారా ?' అనరిచింది.

ఈ నమ్మకాలన్నీ ఆమెలో వేళ్లు పాతుకుపోయుండాలి. దీనికంతకూ తలిదండ్రులే కారణం అయుండాలి. ఆమెకంటె ఎక్కువ చదువుకున్న నాకు ఓ అబద్ధం (అవసరంవస్తే ఎక్కువ) చెప్పటంలో తప్పేమీ కనిపించలేదు. ముక్కుకు సూటిగా, నీతినియమాలతో బతికితే ఈ లోకంలో కాలుమోపేటందుకూడా చోటు దొరకదని, ఏ రొండకొగొడు గొత్తినవాడికే జయం లభిస్తుందని ఆమెకు వివరిద్దామనుకున్నాను. కాని కూలంకషంగా అర్థం చేసుకునే

# తీరని సమస్య

దు. పరిసరాలు, వాతావరణం అందు కను ...వు. ఓ ఆంగ్ల రచయిత 'సీక్షిప్తమైతే బుర ఈదులాడు-ఇతరుల్ని అందులో దించకు'

...గాని అలమేలు! మానప్రాణ రక్షణలకోసం ...డవచ్చని మనశాస్త్రాలు చెబుతున్నాయిగా!' ...కావచ్చు-కాని ఆ రెండూ పోయేటంత ఆపద ...రాలేదు' అని నవ్వేసింది.

కాని మనం అనుకున్నట్టు అన్నీ జరిగితే సమ ...ఆశాభంగం, గుండెలు బాదుకోటం-ఇలాంటివి ...నే ఉండవు. రామయ్యరుగారు గదిలో అడుగు ...రు. ఆశ్చర్యాన్ని, తత్తరపాటును దాచుకో ...యత్నిస్తూ ఆయన మా సంభాషణంతా విన్నట్టు ...దినా రుజువు దొరుకుతుందేమోనని ముఖం వంక ...శాను.

'సాయంత్రం ఓమాటు మంగలానికివెళ్ళండి- ...డ పిచ్చయ్యరుకు వారంరోజులుగా జ్వరమట- ...రంపాడు. అరె!! ఇదంతా ఏవిటి? డాక్టరు ...గా! తీరిక వేళలో మీరు చిన్నపిల్లలా ఆడుకుంటు ...న్నారా?' అనడిగి ఒక్కొక్కటే పరిశీలించారు. ...యానికితగ్గ ఆలోచన ఏదీ తట్టలేదు.

'కాదు- అవన్నీ నావి.' అంది అలమేలు తడు ...కోకుండా.

'ఎవరు కొనిచ్చారు?'

సమాధానం లేదు. అ బొమ్మలన్నీ జాగ్రత్తగా పెట్టెలోవుంచి 'పద' అన్నారు. అలమేలు మౌనంగా అడుగులు వేసింది. పర్యవసానంకోసం ఎదురు చూస్తున్నా- అయిదు నిమిషాల్లో ఏడుపులు, పెడ బొబ్బలు వినిపించాయి. రామయ్యరుగారి భార్య మధ్య మధ్య ఏదో అరుస్తూంది. అలమేలు నిజం చెప్పి వుంటుంది. దేహశుద్ధి అవుతోంది. ఈ ఆలోచన ఎందుకో తృప్తినివ్వలేదు. నెమ్మదిగావెళ్ళి కిటికీలోంచి దృక్కులు ప్రసారించాను. ఆయనచింతబరికె పుచ్చుకుని బాదుతున్నారు. ఉద్రేకంతోవెళ్ళి చెయ్యి పట్టుకున్నాను.

'క్షమించండి. ఆమె నెందుకలా బాదుతుంటారు?'

'మీకు తెలియదు. ఇది వంశగౌరవానికి సంబం... ...ల్లి చెయ్య

వలసింది. మరీ చిన్నపిల్లని పూరుకున్నాను. ఈ బొమ్మలు ఎవరు కొనిచ్చారని అడిగితే జవాబుచెప్పదు. నిజం తెలిసేవరకు నేను వూరుకోను. నాకోపం అలాంటిది. వదలండి. మీపని మీరు చూసుకోండి' అన్నారు కర్కశంగా.

అలమేలు ఎటూ చెప్పకుండా గోడమీది పిల్లి వాటంగా వూరుకుని తన సత్యసంధతను నిలుపుకుందన్నమాట.

'చంపారు. ఇక ఆపండి-నేనే కొనిచ్చాను. మీ రేమనుకుంటారోనని చెప్పలేదు. పర్యవసానం ఇంత ఘోరంగా వుంటుందనుకోలేదు.'

రామయ్యరుగారు చింతబరికె దూరంగా విసిరి వేసి 'పాపిష్టిచేతులు' అన్నారు. వంశగౌరవం - కర్తవ్యం - పితృప్రేమ - చిత్రమైన అర్థంలేనిమాటలు.

ఆ సాయంత్రం.

'ఒక్కసారి అబద్ధం చెబితేచాలు-చిత్రగుప్తుడు మీ పేరు రాసుకుంటాడు. యమధర్మరాజు శిక్షిస్తాడు.' అంది చెట్టిచ్చికాయలు పళ్లెంలోపోస్తూ - 'అసలు కండు ఇచ్చాడని చెబుదామనుకున్నాను.'

ఏదో అనటానికి కనురెప్పలు కదిలాయి - పెదిమలు విడివడ్డాయి-సింగారవేలు లోపలకు వచ్చాడు.

'కండు ఎప్పుడు వచ్చాడు? ఏం తీసుకొచ్చాడు?' అని నవ్వుతూ అడిగి పెట్టెమీద కూర్చున్నాడు.

'అబ్బే! నేను ఏవో ఆటవస్తువులు కొనిచ్చాను. ఎవరైనా అడిగితే కండుకొనిచ్చాడని చెప్పమంటున్నా.'

అబద్ధం చెప్పినా నేర్పుగా చెప్పాలి. కాగితంలో చిన్న చిరుగువుంటే కనిపించినట్టు ఏమాత్రం లోపం వున్నా దాని అసలు రంగు బయటపడుతుంది. నేను చెప్పిన సమాధానం సముద్రానికి వంతెన క... ...నట్టు ధ్వనించి వుంటుంది. సింగారవేలు నమ్మటం ...మన్నట్టు తలవూపాడు.

'అవును - రామయ్యరుగారే చెప్పారు - రాత్రి మీరూ, కండు కలుసుకున్నారని. మీ... నేనువుంటే అక్కడే హతమార్చేవాణ్ణి. జారిపోయింది.'

అలమేలు జల్లుపోయింది.

'రామయ్యరుగారు నమ్మటంలేదుకాని మీరు కండును చూశారని నాకు బాగా తెలుసు. అతనిమీద మీరు కనికరం చూపటం ఎంతమాత్రం న్యాయం కాదు. చట్టానికి విరుద్ధంగా ప్రవర్తిస్తే మీరూ జైలుకు వెళ్లవలసి వస్తుంది. మీకు మంచి భవిష్యత్తువుంది. దాన్ని చేతులారా నాశనం చేసుకోవద్దు.' అనేసి జవాబుకోసం ఆగకుండా వెళ్లిపోయాడు. నాక్కలిగిన కోపంలో దవడలు రెండూ సాఫుచేద్దామనుకున్నాను. ఒక విధంగా అతను చెప్పిన సంగతులు సత్యదూరం కాకపోయినా నిజాన్ని ఒప్పుకోకూడదు. మనసులో వుండే అభిప్రాయాల్ని తెలుసుకునే యంత్రంవుంటే నాలాంటివారి పరిస్థితి ఎలా వుంటుందో - సింగారవేలు ఇదంతా ఎలా పసిగట్టాడన్న సందేహం నన్ను ఆవరించింది.

ఓనాడు సాయంత్రం రామయ్యరుగారు నన్ను ఇంటోకి రమ్మని కబురుపంపారు. వెళ్లేసరికి చాలా మంది కొత్త వ్యక్తులు కనిపించారు.

'ఈయనే మన డాక్టరుగారు, మ నిం ట్లో నే వుంటున్నారు. చాలా మంచివారు' అని పరిచయం చేశారు. నాకు నవ్వొచ్చింది. ఓ మనిషిని పరిచయం చేసేటప్పుడు 'బుద్ధిమంతుడు', 'ధనవంతుడు', 'బాగా చదువుకున్నవాడు', 'వుత్సాహి' అనేదానికంటే, 'మంచివాడు' అనటంలో ఏదో ఔన్నత్యం వుంది. ఆ మాటలో ప్రత్యేకమైన విలువ యిమిడివుంది. మనిషిక్కావలసింది మంచితనమేగామోలు-ఎలాంటి మంచితనం కావాలి? సిసలైన మంచితనం కావాలా? లేక నలుగురిలోనూ నవ్వుతూ మంచిగా నటిస్తే చాలా? ముక్కుకు సూటిగా, మనస్సాక్షి చూపిన దోవంట కాకుండా సంఘాన్ని మెప్పిస్తూ అందరూ నడుస్తున్నతోవంటనడిచే మంచితనమా? ఏది మంచిది? ఏమో! ఎవర్నడిగి తెలుసుకోవాలి?...

'వీళ్ళంతా అమ్మాయిని చూసుకోటానికి వచ్చారు. ఈ మకరమాసంలో పెళ్లిచేద్దామని అనుకుంటున్నా. ఇప్పటికే ఆలస్యమైంది. ఈయనే మన అదృష్టం బాగుంటే కాబోయే అల్లుడుగారు.' అంటూ [illegible] ఆలోచనలకు కళ్లెంవేశారు.

అతనివంక చూశాను - నల్లగావున్నాడు. అచార కారం చిన్న పిలకవుంది. చేతివేళ్లనిండా రక[illegible]ల వుంగరాలు-పట్టుపంచె - అంగవస్త్రం - నలభై ఏళ్లు దాటేవుంటాయి. ముఖంనిండా మచ్చలు - కంకరరాళ్లలాంటికళ్లు - చూడ్డా[illegible] కరంగా వున్నాడు. విషాదం-కోపం - జ[illegible] నాలో వుదయించి మాయమయ్యాయి. [illegible] అసాధారణ వ్యక్తి. ఆమె అభిప్రాయాలు - [illegible] అన్నీ గట్టిపునాదిమీద సుందరాతి సు[illegible] నిర్మింపబడిన హర్మ్యంలాంటిది. ఆమె ఒ[illegible] నవ్వును-అతన్ని - త్రాసులోవుంచి తూచి[illegible] ఆకాశంలో - మరోపళ్లెం పాతాళంలో వు[illegible] చీకటికి వెలుగుకు పెళ్లట-మరుక్షణం నన్ను [illegible] దిద్దుకున్నాను. మనిషిక్కావలసింది కేవలం [illegible] కాదు. బాహ్యస్వరూపం గుణాశ్రితం కావచ్చు[illegible] దాని విపర్యయం మాత్రం నిజంకాదు. అయి[illegible] విషయంలో నా కెలాంటి అధికారమూలేదు. కాసేపటికి "సర్వాలంకార భూషితయై" అలమేలు[illegible] అతనికి నమస్కరించింది. ఓముసలావిడ మూడునా[illegible] గజాల దారాన్ని నేలమీదపరచి దానిమీదుగా [illegible] మంది. అంగవైకల్యంలేదని నిర్ణయించుకునే[illegible] ఇదో పరీక్ష-సంస్కృత శ్లోకాలు చదవమ[illegible] అన్నీ పూర్తయ్యాయి. వచ్చిన అతిథులందరూ సా[illegible]త్రానికి వెళ్లిపోయారు.

ఆ మర్నాడు ఆ పెళ్లికొడుకును గురించి వి[illegible]లన్నీ సేకరించగలిగాను. అతనిదికి రెండో పెళ్ళి. అ[illegible] విషయంలో రామయ్యరుగారికంటె అతనిదే పైచెయి[illegible] ఆ వూరికంతా సర్వాధికారైనా దురభ్యాస[illegible] చాలా వున్నాయి. రామయ్యగారు ఈ పెళ్ళికి ఎ[illegible] వొప్పుకున్నారో నాకర్థం కాలేదు. అప్పట్లో వధు[illegible]వరులు ఒకర్నొకరు చూసుకొని, పరస్పరం యిష్టప[illegible]తేనే పెళ్లిచేసుకోవాలన్న సిద్ధాంతం కొత్తగా బయలు[illegible]దేరింది - అంతేకాని దాన్ని ఆచరణలోపెట్టేవారు వేలలో ఒకరు.

'అలమేలు! ఈ పెళ్లికి నువ్వు ఒప్పుకున్నట్టేనా? మీ నాన్నగారు బీదవారుకారు. వెతికి వెతికి ఈ రెండో పెళ్ళేవిటి? అదీకాక అతనికీ నీకూ [illegible] కుదరదు. అతన్ని పెళ్లిచేసుకోనని మీ నాన్నగారితో కచ్చితంగా చెప్పేయ్. తరువాత పశ్చాత్తాపపడతావు.' అన్నాను సాయంత్రం. ఆమెకూ నా మాటల్లోవున్న విలువను గ్రహించే శక్తిలేదని నాకు తెలుసు.

'మీరనేది చిత్రంగా వుంది. నాన్నగారికి ఎదురు చెప్పటమే! [illegible]

# తీరని సమస్య

ను. నా కేంచేసినా మనమంచికోసమే. వూరేగ ఎవరైతే నేం!' అనేసి వెళ్ళిపోయింది. అది యకత్వమో-గడుసుతనమో' నిర్లక్ష్యమో_ఇతమిత్థ తెలియదు. 'కుదరాంకున్న' లోయలోవున్న రజంతువుల్ని రోడ్డుమీద నిలబడి చూడలేనట్టు, మానంలో నిలబడి భవిష్యత్తులోకి తొంగిచూడ అలమేలు. నాలుగైదు రోజుల తరువాత ప్రధానం ంది. ఇంక పెళ్లికి ఒక్క నెలే వుంది.

* * *

ప్రశాంతమైన నీటిని ఎవరో కెలికివేశారు. భవిష్యత్తును తల్చుకుని భయపడే దానికంటే, ధైర్యంగా ఎదుర్కోటం మంచిదనుకున్నాను. సింగారవేలు న్ను నీడలా అనుసరిస్తున్నాడని పసిగట్టటానికి ఎంతోకాలం పట్టలేదు. అనంతాకాశంలో తుఫాను గాలికి దోమూలగా విసిరివేయబడ్డ ఒంటిమేఘంలా ఫీలయ్యాను. దీనికంతకూ కారణం పిడుగులా ఎగిరివచ్చి పడ్డవార్త-అలమేలుకు నిశ్చయించిన పెళ్లికొడుకును ఎవరో హత్యచేశారు. వేలు చెప్పిన దాన్నిబట్టి కందు ఆ పని చేసివుంటాడు. ఎందుకు చేశాడన్నది తనకు తెలిసినా బయటపెట్టటం వుచితం కాదన్నాడు. తనకు వూహించే శక్తిలేదని డొంక తిరుగుడుగా చెప్పటం కావచ్చు. అలమేలును అడిగి చూశాను. ఆశ్చర్యంతో నాలుగుసార్లు కనురెప్పలు కదిపింది. చివరకు నాకునేనే కొన్ని నిర్ణయాలు చేసుకున్నాను. రుజువుచేయలేను కనక అవి సరైనవి కాకపోవచ్చు. అయినా నాకుమాత్రం పూర్వ విశ్వాసం వుంది. అలమేలు ప్రధానం జరిగిన విషయం కందుతో చెప్పివుంటుంది. అతను అసంతృప్తిలో, కోపంతో యీ పనిచేసివుంటాడు. అందుకు అలమేలు ప్రేరేపణ వుందంటేమాత్రం నేను వొప్పుకోను.

ఆ సాయంత్రం అలమేలు ఓ విషయం తన మనసువిప్పి రామయ్యరుగారు వూళ్ళోలేరు. కందు వూళ్ళోనే-తనయింట్లోనే వున్నాడట-జ్వరంతో బాధపడుతున్నాడు. కనక నేను వెళ్ళి మందివ్వాలిట-పగలువెడితే ప్రయత్నపూర్వకంగా పర్వతంమీదనుండి వురకట మవుతుంది. అందుకని రాత్రి వెళ్ళమని కోరింది. మొదట్లో వొప్పుకోకపోయినా తరువాత సరేనన్నాను.

చీకటిని మధ్య మధ్య టార్చిలైటు వెలుతురు జడిపించి పారద్రోలుతోంది. టార్చి కన్నుమూయగానే అంధకార పరిష్వంగం తప్పేదికాదు. చప్పుడవుతుందని జోళ్ళుకూడా వేసుకోలేదు. కాలికి ముళ్ళు, రాళ్ళు గుచ్చుకుంటున్నాయి. ఆ చీకట్లో నన్నెవరూ వెంబడించరని, చూడరని తెలుసు. అందుకే ధైర్యంగా బయలుదేరాను.

అతని గుడిసె చేరుకునేసరికి గుమ్మందగ్గర నిలబడివున్న ముసిల్ది నన్ను ఆనవాలుపట్టి లోపలకు తీసికెళ్ళింది. భయంకరమైన నిశ్శబ్దం. మిణుకు మిణుకుమంటున్న చిన్నదీపం - మంచంమీద కందు పడుకుని వున్నాడు. ఆ గుడ్డివెలుతురులో అతని దృఢకాయం నన్ను భయపెట్టింది. మాసిపోయిన గెడ్డం-రక్తంతో పెరిగిన మీసాలు-వంకరగా తిరిగిపోతున్నాయి. ముఖంమీద అయిదారుచోట్ల ఏనాడో కలిగిన గాయాల తాలూకు చిహ్నాలు. గదంతా చూశాను-పది పన్నెండు సీమ వెండిగిన్నెలు-మట్టిమూకుడులు తప్పించి మరేమీ లేవు. అయిదారుగురు పిల్లలుమాత్రం దిసమొలలతో మంచంచుట్టూ నిలబడివున్నారు-ముసిలితల్లి ఏడుస్తూ ఏదో గొణుగుతోంది. కందు దొంగతనాలుచేశాడా? తనకుటుంబాన్ని ఇలాంటి దరిద్రస్థితిలో వుంచాడా? నా కళ్ళను నమ్మలేకపోయాను. జ్వరంసంగతి కనుక్కుని ఇంజక్షనిచ్చాను.

'కందూ! ఈదొంగతనం మానేసి మంచిగా బతిక్కూడదూ?' అనడిగాను. అతను నవ్వాడు. భయంకరంగా పళ్ళన్నీ తాళంవేశాయి.

'నేనూ అలాగే అనుకున్నానండి-కాని ఈవూరి సన్యాసులు నన్ను వాళ్ళలో చేర్చుకోరు-దుర్మార్గులు. అందర్నీ కట్టగట్టి నరికేస్తాను-జ్వరం తగ్గనివ్వండి.'

'రామయ్యరుగార్నికూడానా?' అనగాలనే అడిగాను.

'తప్పు.ఆయన దేవుడిలాంటివాడు - న్యాయాన పోతున్నాడు-ఆయన వుప్పు చాలాకాలం తిన్నాను.'

'అలమేలుకు నీమీద ఇంత అభిమానమెందుకు?'

'ఆమె చెప్పలేదూ?'

'చెప్పింది. నీ కూతురు చనిపోయిందని- ఆమె నే నీకూతురుగా భావించుకుని ప్రేమిస్తున్నానని.'

నా వాక్యం ఇంకా పూర్తికాలేదు. కందు వికటంగా నవ్వాడు.

దగ్గతెర అడ్డుపడేవరకూ - దాని కంతు కనపలేదు.

'అలమేలు తెలివైంది. అసలుసంగతి చెప్పకుండా దాచివుంచింది. చాలా కథవుంది.'

'ఏమిటది?'

'ఇప్పుడుకాదు- రేపుచెప్తాను. ఇవేళ ఆయాసంగావుంది. మాట్లాడలేను.' విశ్రాంతి తీసుకోమని సలహాయివ్వటంమాని ఎక్కువగా మాట్లాడించినందుకు నేనే సిగ్గుపడి మర్నాడు మందుకురమ్మని బయటకు వచ్చాను. నెత్తిమీదనుండి ఓపెద్దబరువు దిగినట్లయింది. కంసు ఏదో కొత్తవిషయం చెబుతాడు. దాన్నుండి నా వూహాలు, మన స్తత్వపు సిద్ధాంతాలు ఎంతవరకూ సరైనవని తెలుసుకోగలను. పదిగజాలు వచ్చేసరికి ఎవరో బుజంమీద చెయ్యివేసి గట్టిగా నొక్కారు.

'హల్లో డాక్టర్! అర్ధరాత్రి ఇలా బయలుదేరా రేమిటి?'

ఆ కంఠధ్వని సింగారవేలుది. సదిసముద్రంలో పడ్డాను. ఈత చేతకాదు. కనుచూపుమేర దూరంలో నావలేమీ కనపడలేదు.

'నాకు తెలుసు-కంసు ఇంటినుంచి వస్తున్నారు. అవునా?'

'అవును- అతనితల్లికి జ్వరంగావుంది. వెళ్ళాను' అన్నాను ధైర్యంగా. అతను వికటంగా నవ్వాడు.

'డాక్టరుగారూ! అబద్ధంచెప్పినా నేర్పుగా చెప్పాలి. అరగంటక్రితమే ఆయింటికి వెళ్ళాను. ముసిల్ది దుక్కలావుంది. కంసు వచ్చాడని నాకు తెలుసు. ఇల్లంతా పరిశోధించాను. అతనిజాడ కనపడలేదు. దీన్నిబట్టి అతన్ని దాచివుంచటానికి ఏదో గుప్తమైన చోటు వుందన్నమాట. అది కనుక్కోటం కొంచెం శ్రమతోకూడిన పనైనా అసాధ్యంకాదు. కాని వృధా శ్రమ ఎందుకు? మీరు నాకు అండగా వున్నారుగా! పదండి. మీరువెడితే తలుపుతీస్తారు. లోపలకు రానిస్తారు. అనుమానపడరు.'

అలమేలుముఖం కనిపించి మాయమైంది. ఆమె కళ్ళు ఏదో పెద్దకథను విపులీకరిస్తున్నాయి. కాని అర్థం చేసుకునేశక్తి లేదునాకు.

'క్షమించండి- ఈ విషయంలో మీకు సాయం చేయలేను- అది నా అంతరాత్మ బోధనకు విరుద్ధం.'

'అలాగా! దొంగతనాన్ని, దొంగల్ని, ఖూనీను బలపర్చమని మీ అంతరాత్మ బోధిస్తే అది నిజమైన ఆత్మకాదు- నకిలీ ఆత్మ- దానిమాట వినకండి- ముందే చెప్పాను. కంసు దొరక్కపోతే మి[illegible] తీసుకువెడతాను. మీ భావి జీవితానికి నిప్పు [illegible] కండి- మీమీద చిత్ర విచిత్రమైన ప్రాసిక్యూ[illegible] నడపగలను.' సింగారవేలు నన్ను ఆలోచిం[illegible] మన్నట్టు రెండునిమిషాలు వూరుకున్నాడు- స్వల్పకాలంలో నేను ఏ నిర్ణయానికీ రా[illegible] వేలు అన్నట్టు ఎవరికోసమో నా జీవితాన్ని [illegible] చీకట్లో ముంచుకోవాలి? అలమేలుకూ నాకూ [illegible] అనుబంధం? స్వార్థం నామీద పూర్తిగా చెల[illegible] చింది. తిరిగి కంసు యింటికి బయలుదేరాను. [illegible] కారం, బలం, ధనం, ప్రభుత్వసహకారం, న్యాయ[illegible] అన్నీ అతని పక్షంలోవున్నాయి. ఎగిరిపడుతూ [illegible] ళించడానికి సిద్ధమవుతూన్న సముద్రపుటలలతో పోరాడే దానికన్న తలవంచి ఆ కెరటాలవేగానికి అడ్డు రాకుండా వుండటమే మంచిది. తలుపుతట్టాను. నా కంఠస్వరం విన్నాక తలుపుతీసింది ముసిల్ది. కంసు అనుమానంతో చూశాడు.

'ఏమైంది?' అనడిగాడు.

'మరేంలేదు. మరో ఇంజక్షనుకూడా యిస్తే నీకు జ్వరం త్వరగా నయమవుతుందని వెనక్కితిరిగి వచ్చాను...అది సరేకాని అలమేలుకు నువ్వంటే ఎందుకింత అభిమానం? ఇప్పుడే చెప్పకూడదూ?'

'చెబుతాను వినండి.' అంటూ కంసు లేచి గోడ కానుకుని కూర్చున్నాడు. ఆతురతతో చెవులు నిక్కబొడుచుకుని వినటానికి సిద్ధపడ్డాను. ఎలాంటి కారణాలు వివరిస్తాడో మరి!

టకటకమని బూట్లచప్పుడు-సింగారవేలు నలుగురైదుగురు పోలీసులతోవచ్చి కంసుని బంధించాడు.

కంసు నాకేసిచూసి పళ్ళు పటపటకొరికాడు- ఈ మోసానికి నేను కారకుణ్ణని అతనికి తెలుసు.

* * *

అలమేలు ఎన్నడూ ముక్కు చీది ఎరగదు. కాని కంసుదొరికిపోయాక ఓ నాడు మేడమీదినుండి కాలుజారి కిందకు దొర్లిపోయింది. అప్పట్నుంచి సరిగ్గా మాట్లాడేదికాదు. ఏమైనా మాటలు బయటకు జారిపడ్డా అసందర్భంగా వుండేవి. ఎన్నోమందులు, ఇంజక్షనులు వాడిచూశాను.—ప్రయోజనం లేకపోయింది. జీవితం నరకతుల్యంగా మారింది. రోజుకు

ఒక్కసారైనా నేను చేసిన పొరపాటు గురించి మౌనంగా కంటనీరు పెట్టుకునే వాణ్ణి. చివరకు అలమేలును మద్రాసు తీసుకు పొమ్మన్నాను.

కొన్ని చిక్కులు వాటంతట అవే విడివడతాయి. రంగూన్‌లో క్వాలిఫైడ్ డాక్టర్లు కావాలని, నన్ను పంపటానికి నిశ్చయించానని మెడికల్ ఆఫీసరు రాశాడు. ఇంక అక్కణ్ణుంచి వెళ్లిపోవటం సమంజసంగా కనిపించింది. రామయ్యరుగారికి కన్నీటితో కృతజ్ఞత చెప్పుకున్నాను. అలమేలు నడవలేకపోయినా వెళ్ళి శెట్టిచ్చికాయలు తీసుకు వచ్చింది. కనుచూపు మేర దూరంవరకూ వీడ్కోలిచ్చింది.

బస్సు స్టాండుకు మైలు దూరం నడవాలి. రామయ్యరుగారి పనిమనిషి సామానుతో ముందునడుస్తున్నాడు. మనసంతా అపూర్వ అనుభవాలలో, నక్షత్రాల మూగవెలుతురులో నిండిపోయింది. ఒక్క విడాదిలో అలమేలు మనస్తత్వం నా హృదయంలో రోజా పువ్వులా వికసించి విశ్వమంతటా వ్యాపించింది.

ఎత్తైన కొబ్బరిచెట్లు-భయంకరంగా వురుముతూ చూస్తున్న పచ్చటి కనుమలు - గుట్టలు - వరిపొలాలు- అన్నీ నన్ను చూసి నవ్వుతున్నాయి. దూరంగా గుడిగంటలు వినిపించాయి. అలమేలు నా హృదయంలో ఆస్తికత్వాన్ని స్థిరం చేయటానికి ప్రయత్నించిన విధానాలన్నీ తళుక్కున మెరసి మాయమయ్యాయి. కంకు గుడి పెకువళ్లే 'ఇట్లీ' వంకరగా సాగిపోయింది. పింగారవేలు వంకర మూతితో నవ్వాడు. రామయ్యరుగారు చీకట్లో నిలబడి శూన్యంలోకి చూస్తూ 'అలమేలు ఏది?' అనడుగుతున్నారు. ఆ ప్రశ్నకు నేనే సమాధానం చెప్పాలి. అసంతృప్తి-స్వార్థం-అహంకారం - జవాబులేని ప్రశ్నలు-ఇవన్నీ నాలో వున్న ప్రశాంతతను కదిల్చివేశాయి. వెనక్కి పరుగెత్తి అలమేలు దగ్గర వాలిపోదామనిపించింది. ఛీ! ఏమిటీ అసందర్భపు టాలోచనలు! ఓ పదిపన్నెండేళ్ల అమ్మాయికోసం నా నిండు జీవితాన్నీ చీకట్లో ముంచటమా? ... కారుహారన్ వినపడింది. వర్తమానం, కర్తవ్యం గతాన్ని మరపింపజేశాయి.

అయిదారేళ్లలో ఆమెను మర్చిపోవటానికి ప్రయత్నించి కొంతవరకూ విజయం పొందాను. రంగూన్‌నుంచి తిరిగి వచ్చాక మద్రాసులో సర్జన్‌గా చేరాను. ఓనాడు శ్రీధరన్ కడుపులో నొప్పని వచ్చాడు. పరీక్షించి ఆపరేషన్ చెయ్యాలని నిశ్చయించాను.

ఆపరేషన్ పూర్తయ్యాక శ్రీధరన్ కోలుకుంటున్నాడు. ఓనాడు అలమేలువిషయం ప్రస్తావించాను.

'ఆమెకూ, కంకుకూ ఏమిటి సంబంధం?' అనడిగాను.

'అదా? అదో పెద్దకథ- ఎప్పటికప్పుడు మీకు చెబుదామనుకోటం మర్చిపోవటం జరిగింది - వినండి.' అన్నాడు. ఆశగా చూశాను. శ్రీధరన్ కథ మొదలుపెట్టేలోగా ఆపరేషన్ చేయబడినచోట విపరీతమైన బాధ మొదలైనది. డాక్టర్లు, నర్సులు వచ్చారు. ఛీఫ్ సర్జన్ వచ్చిచూసి పెదవి విరిచాడు. శ్రీధరన్ ఆఖరు ఘడియల్లో వున్నాడని నాకు తెలుసు.

'శ్రీధరన్! ఆకథ చెప్పావుకాదు.' అన్నాను స్వార్థంతో.

'చెప్తాను. అంతకంటె ముఖ్యమైన మరోసంగతి చెప్పటం మరిచాను- అలమేలు ఓనాడు కొలనులో కాలు జారిపడి చనిపోయింది.'

అంతే. అతను చివరిసారిగా కన్నుమూశాడు- నా ప్రశ్నలు అలాగే వుండిపోయాయి. కంకుకు వురిశిక్ష పడిందని తెలిసింది. అలమేలు ప్రతిరోజూ వుదయం కేరళదేశపు అలవాటు ప్రకారం స్నానానికి వెళ్ళేది. ఆమెకు ఈత బాగా చేతనవును. మరి ఎలా చనిపోయింది?...ఒకవేళ ఆత్మహత్య చేసుకుందా? ...అన్నీ తలా తోకాలేని ప్రశ్నలు- ఒక్కోసారి నిజమనిపిస్తాయి. మరోమారు మిథ్యాబింబాలనిపిస్తాయి.

* * * *

ఇదీకథ—

అంతా చదివారుకనక నా తీరని ప్రశ్నలకు జవాబుచెప్తారనే ఆశతో మీజాబుకోసం ఎదురు చూస్తున్నా.

మీ ప్రియమైన,
అప్పు.

ఉత్తరం పూర్తయింది. గట్టిగా నిట్టూర్చటం తప్పించి మరేంచేయలేకపోయాను. ఎంతగానో ఆలోచించాను. కాని అతని ప్రశ్నలకు సరైన సమాధానం దొరకలేదు. అదో తీరనిసమస్యగా వుంటుందేమోనన్న భయంతో ఈ కథంతా మీకు చెబుతున్నా—మీరు తప్పకుండా సమాధానం చెప్తారన్న ఆశమాత్రం నాకుంది.

బాధ్యత పోలీసుది మాత్రమేనని గట్టి నమ్మకం. తమను, తమ ఆస్తిని రక్షించుకొనే హక్కు తమ కెంతవరకున్నదో తెలిసికోనేవారుకారు. ఒకరినొకరు కొట్టుకొని ఇద్దరూ కోర్టులలో అభియోగాలు తెచ్చి, ఇద్దరూ శిక్షలనుభవించిన విషయాలు ఆదొంగ సమత్తుంలో గుర్తుకువచ్చి, కోర్టంటే భయపడేవాళ్లు. పోలీసంటే హడలు. అతడు రక్షక భటుడన్న చైతన్యం వీళ్ళకానా వుండేదికాదు. ఇదీ అప్పటి స్థితి.

స్వరాజ్యావతరణానంతరం పైనచెప్పిన దురాశాపరుల్ని - సుమారుగా అందర్ని - పంపించేశారు. ఉద్యోగుల్ని క్రొత్తచైతన్యం పొందవలసిందిగా అభ్యుదయవాదులూ, నాయకులూ కోరారు. కవులు రావుబహదూర్లను పొగడటానికి బదులు, రాష్ట్రగీతాలు పాడసాగారు. ఐతే, ప్రజలు మనసుల్లో 'మన ప్రభుత్వం' అని పైకి అనుకొంటూనే వెనకటి (విషయాలు) అలవాటుగా రానిచ్చారు. దేశానికి అన్నాళ్లనుంచీ వస్తున్న దిగుమతులు తగ్గింపబడటంచేత ప్రజలకు ఉత్పత్తి ఎక్కువచెయ్యవలసిన అవసరంవచ్చింది. రేషనింగ్ కూడ అవసరమయింది. మధ్యతరగతి ప్రజలు మహాఅవస్థపడ్డారు. కొందరు దొరకని వస్తువులు దొరికినప్పుడల్లా అవసరంలేకపోయినా కొని స్టాకుచేసేవాళ్లు. నల్లకొట్టులో కొన్ని, అరుగుమీద కొన్ని. వాళ్లు, వీళ్లు అందరూకూడ మనసులో "మన ప్రభుత్వం" అనుకొంటూనే పైకిమాత్రం ప్రభుత్వాన్ని తిట్టేవాళ్లు. వెనకటి పరాధీన మనఃప్రవృత్తి ప్రజలనుంచి పూర్తిగా వదిలిందికాదు. ఇలావుండగా......

భారతరాజ్యాంగాన్ని తయారుచెయ్యటానికి ప్రవీణులసభ ఏర్పాటుచేశారు. వారు పైస్థితినంతా పర్యవేక్షించి సంవిధానంలో "ప్రాథమిక స్వత్వాలు" అనే శీర్షిక క్రింద ప్రాథమిక స్వత్వాలేమిటో నిర్దేశించారు. ఇవి యిలా ఇతరరాజ్యాల సంవిధానాల్లో చెప్పబడకపోయినా అక్కడ పాటింపబడుతూనే వున్నాయి. కాని మన సంవిధానంలో ప్రత్యేకంగా చెప్పవలసిన కారణం మూడువందలేండ్ల బానిసత్వంలో ప్రజలు తమ ప్రాథమిక స్వత్వాల్ని మర్చిపోవటమే—కనుక ఆ స్వత్వాలను (హక్కులను) పునశ్చరణ చేయవలసినస్థితి ఏర్పడింది.

ఇంతకూ, ఈ హక్కు లేమిటి? బాధ్యతలేమిటి? అధికారాలేమిటి అనేవి ప్రతివారునికీ తెలుసుకోవలసిన అవసరముంది. వీటినిగురించీ తెలుసుకోవలెనంటే వీటిని తత్వశల్య పరీక్షకు గురిచెయ్యటం ప్రథమ కర్తవ్యం......

హక్కులంటే? ఈ హక్కు ఎలా పుట్టిందో ఆలోచిస్తే యేమైనా తెలుస్తుందేమో! శ్రీమన్నారాయణమూర్తి ఒక్కడూ వటపత్రశాయియై పాలకడలిలో ప్రశాంతంగా యోగనిద్రపోతున్నప్పుడు హక్కులూ బాధ్యతలూ అసల్లేనేలేవు. బొడ్డులోనుంచి తామరపువ్వు పుట్టి మింటికంట ప్రాకి విఱ్ఱవీగింది. అందులో బ్రహ్మదేవుడు తనెలాపుట్టాడో తెలీకుండా పుట్టేశాడు. ఏంచెయ్యాలో యేమీ తెలీక నానా అవస్థలూపడి బ్రహ్మాండమైన తపస్సుచేశాడు. తన మనస్సు వికసించినట్లయింది. తీరికే సంకల్పించటం మొదలుపెట్టాడు. బహుశః తనలాటివాళ్ళు ఎలా వుండాలో సంకల్పించాడు. తనలాటి బ్రహ్మమానసపుత్రులు పుట్టేశారు. వారంతా తమశక్తికొలదీ సృష్టి చేశారు. ఈ సృష్టిఅంతా ప్రకృతిఅయింది.

ఈ సృష్టించిన ప్రకృతికి చైతన్యం కలుగుతున్నది. ఈ చైతన్యశక్తి యెలా పుట్టిందో బ్రహ్మకులకు తెలీలేదు. వాళ్లనుకున్నారు 'ఈ శక్తియేదో వాళ్లకంటే గొప్పదీ' అని. మరి యీ శక్తికి, తమకూ సంబంధమెంతవరకో అర్థంకాలేదు ... ఒక్కసారిగా ఈ శక్తి విజృంభించి, గాలిరూపంగావచ్చి తమని సముద్రంలో విసిరివేస్తే? ఒక్కసారిగా యీ సముద్రంలోని బడబాగ్ని సముద్రాన్ని ఇగరజేసి పారేస్తే? శబ్దాలు ప్రయాణంచేయటానికనువైన ఈథరు తనపనీ చేయటంమానేస్తే? తమకు లభ్యమయ్యే ఫలాలు తమను సంతోషపెట్టటం మానేస్తే? — ఇట్లా తలుచుకొని బ్రహ్మమానసపుత్రులు గజగజలాడిపోయారు ... తిరిగి ఆలోచించారు. ఈ శబ్ద స్పర్శ రూప రస గంధాలు తామనుభవించటం తప్పదని, అవి అలా అనుభవించేందుకే యీ చైతన్యశక్తినికూడ తనుస్థాయిలో నిల్పగలిగే భగవంతుడొకడెవడో వున్నాడని తెలుసుకున్నారు. ఈ దేవుడు చేసేదేమిటో అర్థంచేసుకుంటే చరాచరాలకు చైతన్యశక్తి దానిని సుఖాలాల మధ్య వడిపే భగవత్స్వరూపానికిగల సంబంధ బాంధవ్యం అర్థంచేసుకొంటే భగవంతుడంటే లీలగా తెల్సుకోవచ్చునుకొన్నారు.

అప్పటినుంచి తమయెదుట ఏమేం జరుగుతున్నాయో, ఎలా జరుగుతున్నాయో చూసి చూసి

భగవంతుడిలా జరగాలని సంకల్పించాడు కనక అలా జరిగింపజేయటమూ, అందుకు భిన్నంగా తామేదీ జరపకుండా చూడటమూ తమవిధి అనుకున్నారు. అంటే: తమకొక బాధ్యత వచ్చిపడ్డది; తమ అందరికీవచ్చిపడ్డది. అందరిలో ఏ ఒక్కరన్నా ఈ బాధ్యతను నిర్వర్తించకపోతె ఇతరులు అతడ్ని సరిదిద్దేవారు. ఒకరినొకరు సరిదిద్దటం ఒకరిమీద యింకొకరికిగల హక్కయిపోయింది. కాని వీరి ఆశయం కేవలం ప్రకృతిలో సహజమైనస్థితిని చెడకుండాచూడటమే. కనుక సర్వజంతుజాలాల సామరస్యంచూసేవాళ్లు. 'సర్వేజనాస్సుఖినో భవంతు' అనుకొనేవాళ్లు. తత్ఫలితంకోసం తత్సుఖంకోసం, తచ్ఛాంతికోసం, తత్సౌందర్యంకోసం, తత్సత్యంకోసం తదర్థమైన సాధనచేసేవారు. కొన్ని వట్టిగొఱ్ఱెలుంటే, వాటికోసం కుక్కల్ని కాపలాపెట్టినట్లు కొన్ని విధుల్ని తయారుచేశారు.

ఏ విధులుచేసినా "సర్వే జనాః సుఖినో భవంతు"ను సాధించటానికే. ఆ సమయానికి ఆ ప్రకృతి సిద్ధమైన విధులే అప్పటి ధర్మశాస్త్రమయింది. అందులో వ్యవహారశాస్త్రంకూడ ఇమిడి కొంత భాగమయింది. ఈ వ్యవహారశాస్త్రం ఇప్పటికి ఎంతగా పెరిగి పెద్దదయిందంటే మనదేశంలో రాష్ట్రం ఒక్కంటికి రెండు శాసనసభల చొప్పున, ఒక్కొక్క సభలో కొన్నివందల సభ్యులచొప్పున అనేకమంది శాసనసభ్యులు శాసనాలు తయారుచేయవలసిన అవసరంపట్టినంత. వారు శిరంపరగా చేసిన యీ శాసనాలన్నీ వ్యవహార శాస్త్రమై చనున్...సుమా !!

మరి యిప్పుడు హక్కులంటే యేమిటి ? బాధ్యతలంటే యేమిటి?-అనే విషయం ఈ శాసనసభలు చేసిపెట్టిన వ్యవహారశాస్త్ర దృష్ట్యా తెలుసుకోవాలి. వెనకటివలె "సర్వేజనాః సుఖినోభవంతు" అనే ఒక్క సూత్రం యిప్పుడు చాలదు. అప్పుడు మానవ సృష్టి అంతా ఒక్క రాజ్యము కావటంమూలాన ఆ సూత్రం సరిపోయింది. ఇప్పుడట్లా యెట్లా కుదురుతుంది ? అనేక రాజ్యాలున్నయి. ఏ రాజ్యంవాళ్ళు ఆరాజ్యంలోని మంచిచెడ్డల్ని చూసుకోవాలి. "అస్మదీయ రాజ్యస్థజనాః సుఖినో భవంతు" అనుకోవద్దా మరి ? ఈ సుఖం కొన్నాళ్లనుభవించేటప్పటికి దుష్ట శక్తులు కూడ సుశక్తులతోపాటు పెరగవచ్చు. అప్పుడు "శిష్ట జనాః అధిక సుఖినో భవంతు" అని అనవలసి వస్తుందనుకొంటాను. మొత్తంమీద వ్యవహారశాస్త్రం తయారు చేయటానికిగల ఆశయం మారుతూవచ్చింది. ఇప్పుడు ప్రతి శాసనానికీ ముందు పీఠికలో తామెందుకు శాసనంచెయ్యాల్లో వ్రాస్తున్నారు శాసనకర్తలు.

ఇప్పుడు మరోచిక్కుంది. హక్కులవంగానే అనేక విధాల హక్కులు జ్ఞాపకానికి వస్తయి. కొన్ని భగవంతుడికి సంబంధించినవి; ఆత్మకు సంబంధించినవి. అవి మతపుహక్కులు. మరికొన్ని సమాజానికి సంబంధించినవి.అవి సామాజికమైన హక్కులు. వీటివిషయం ఇప్పుడు చర్చించవద్దు. మన మిప్పుడు తెలుసుకోవలసినవి "వ్యవహారిక స్వత్వాలు (Legal Rights) అనగానేమి? అని.

## వ్యవహారపు హక్కులు

ప్రపంచంలో ఒకజీవికి మరొక జీవికిగల సంబంధం ఏమిటి ? ఒకడు ఇంకొకడినుంచి తనకుకలిగే సంతోషం వాంఛించటం. ఈ వాంఛయే అన్నిటికీ మూలకారణం. ఈ వాంఛ కేంద్రీకృతమైనపుడు అపేక్ష పుడుతుంది. భార్య భర్తను ప్రేమించినా, తండ్రి కొడుకును ప్రేమించినాకూడ యీ అపేక్షే కారణం. "నవా అరె పుత్రస్య కామాయ పుత్రః ప్రియోభవతి. నవివా అరె అత్మనస్తు కామాయ పుత్రః ప్రియోభవతి" (కొడుకును తండ్రివట్టినే ప్రేమించటలేదు. తనను తను ప్రేమించుకొంటున్నాడు. కనకనే కొడుకును తండ్రి ప్రేమిస్తున్నాడు) అని తైత్తరీయోపనిషత్తు చెప్తున్నది. అందుచేత ఈ "అపేక్ష" పర్యాంగాలు సాకల్యంగా పరిశీలించట మవసరం.

ఈ అపేక్ష అనేకవిధాలు. ఒకప్పుడది ఊహామాత్రమే కావచ్చు. ఉదాహరణకు ఒకడు చెప్పిన కవిత్వం ఇంకొకడికి నచ్చినట్లయితె ఈ యింకొకడికి ఆ కవిత్వమందు అపేక్షవుంటుంది. కాని యిది ఊహామాత్రమే; భౌతికమైనదికాదు. ఒకవేళ అది తన కవిత్వమే అయితే, అప్పుడుకూడ అపేక్షవుంటుంది. ఐతె అది ఊహామాత్రం కాదు.తనకు,ఆ కవిత్వమునకు కొంత భౌతికమైన సంబంధంవుంటుంది. ఆ కవిత్వమునుయితరులు మెచ్చుకొన్నప్పుడు తనకు ఇతరులకంటె విశిష్టమైన గౌరవము కలదు. దాని నచ్చువేసినప్పుడు తనకు ధనరూపకమైన లాభము రావచ్చును; నష్టమూ రావచ్చును. ఇదీ అందులోని విశేషము. కనుక ఇది వట్టి ఊహామాత్రమైన"అపేక్ష"కాదు. భౌతికమైన అపేక్ష;

"ఫలాపేక్ష" అనవచ్చును. ఈ ఫలాపేక్ష జనసామాన్యమైనది. జనసామాన్యమైన ఫలాపేక్షలను సంరక్షించి పురోగమింపజేయుటే, సమాజముయొక్క ప్రయోజనం. వాటినట్లా సంరక్షించటానికి సమాజము అందుగల వ్యక్తులచేత కొన్ని నిర్దిష్టమైన పనులు చేయించటం, కొన్ని నిర్దిష్టమైన పనులు చేయకుండ చూడటం జరుగుతున్నది. ఏవి చెయ్యాలో, ఏవి చేయగూడదో చెప్పే ఆ సూత్రాలే విధులు. ఒకడొక పని చెయ్యాలంటే ఆ పని చెయ్యవలసిన విధి (duty) అతనిమీద వుందంటాము. ఒకడొక పని చెయ్యకూడకపోతే, ఆ పని చేయకుండ వుండవలసిన విధి అతనిమీద వుందంటాము. ఒకడు చేయవలసిన విధి నతడు చేయకపోతే న్యాయస్థానాలద్వారా సమాజము ఆ పనిని అతనిచేత చేయిస్తుంది. ఒకడు చేయకూడని పని చేయబోతుంటే న్యాయస్థానాలు అడ్డుకొని పోలీసులు అమీనుల ద్వారా ఆ పనికాకుండా ప్రతిఘటిస్తుంది. ఒక వేళ ఆ పని పూర్తి అయిపోతే, అందుకు కారణమైనవాణ్ణి శిక్షిస్తుంది.

హక్కు: ఇదంతా యెందుకు? ఒకడు మరొకడి కోసం చేయవలసినపని చేయవంగూకు లేక చేయకూడని పని చేసిందుకు అనగా, ఆ మరొకడికిగల "ఫలాపేక్ష"ను సంరక్షించుటకుగాను అనవచ్చును. ఈ విధంగా ఆ మరొకనికి ఒక హక్కు ఉంది. ఏమిటా హక్కు? న్యాయస్థానముద్వారా తన "ఫలాపేక్షలను" కాపాడుకొనుట. అనగా వ్యవహార మూలకముగ తన "ఫలాపేక్షల"ను కాపాడుకొనుట. 'హక్కు'లు అని మనం ఇకముందు వాడితే, అవి ఈ వ్యవహార సంబంధమైన హక్కులనే అర్థముగాని, మతసంబంధమైనవిగాని సాంఘిక సంబంధమైనవిగాని కావు. అచ్చముగా కోర్టులద్వారా తీర్మానము కాగల, లేక సంరక్షింపబడగల హక్కులే వ్యవహారపు హక్కులు; ఇతరములుకావు. (చూడండి శ్రీ జి. పి. వి. సుబ్బారావుగారు వ్రాసిన జూరిస్ప్రుడెన్స్.) ఇది మనస్సునకు పట్టినగాని మిగత వ్యవహారాంశము లర్థమగుట వీలిక కాదు. హక్కులనగానే కోర్టులకు సంబంధించిన హక్కులనే అర్థం.

పూర్వపక్షం: డ్యూగెయిట్ అనే ఫ్రెంచి విద్వాంసుడు యిలా అన్నాడు." హక్కు అనేది ఎవరికీ లేనే లేదు. మహా వుంటే అది న్యాయస్థానాలకు మాత్రమే వుంది. ఎందుకనంటే,—న్యాయస్థానాలేగా వ్యక్తులచేత వాళ్ల విధులు నిర్వర్తింపజేయ కలుగుతున్నది. వ్యక్తులకు ఒక్క పనిచెయ్యవలసిన విధిమాత్రమే వున్నది. అందుచేత వారికి విధ్యనుసారం నడవవలసిన బాధ్యత మాత్రమే వుందికాని, 'హక్కు' అనేదిలేదు. అందుచేత పెద్ద ఉపన్యాసంగా పైన చెప్పిన హక్కులు వట్టి 'గగన కుసుమాలు', లేనే లేనివి".

విధిప్రకారం నిర్వర్తింపవలసిన బాధ్యత వ్యక్తిమీదవుందీ అనేమాట నిజమే. కాని ఆ బాధ్యతతప్ప హక్కు లేదంటం సరికాదు. ఒకడొకబాధ్యత నిర్వర్తించకపోతె, ఉదాహరణకు – షావుకారు రామయ్యకివ్వవలసిన డబ్బు శేకారి కామయ్య యివ్వకపోతే, రామయ్యకు నష్టంకలుగుతుంది. అందుచేత రామయ్య కోర్టులో దావావేసి, కామయ్యదగ్గర డబ్బు వసూలు చేస్తాడు. ఇలా వసూలుచేయించే హక్కు రామయ్యకుంది. రామయ్యతరఫున వసూలుచేసే అధికారం కోర్టుకువుంది. అంతకంటే 'రాజుగారికి వుంది' అనవచ్చు. మన రాజ్యంలో 'రాజు' లేడు కనక, రాజ్యసంరక్షకులకుంది అంటే సబబు. రాజ్యసంరక్షకులంటే, ప్రభుత్వం, న్యాయస్థానాలూ, శాసనసభలూ కలిపినట్టివారు. వారికి సంపూర్ణంగా అధికారంవున్నది. అంచేత న్యాయస్థానాలకున్నటువంటిది, "అధికారం" కాని, హక్కు (right) కాదు. ఆ రాజ్య సంరక్షకుల ద్వారా కామయ్య చెయ్యవలసినపని చేయించగలిగిన వాడు రామయ్య. రామయ్య, తన హక్కును న్యాయస్థానంద్వారా చెలాయించి కామయ్య తన పనినిచేసేటట్లు చేశాడు. కనక హక్కువున్నది రామయ్యకే. కామయ్యకు విధి చేయవలసిన బాధ్యతవున్నది. రాజ్యపాలకులకు అధికారం వున్నది. అధికారమును హక్కుగా భ్రమించి పూర్వపాక్షికుడు మోసపోయినాడు. ఒక నిర్దిష్టమైన ప్రకారం పనులు చేయవలసిన బాధ్యత వ్యక్తిమీద వుందంటాడు. అది నిజమే. ఆ నిర్దిష్టత్వం ఏమిటి? 'కొన్ని నియమాల ననుసరించి' అని అర్థం. ఆ నియమాలు, వ్యవహారపు హక్కుల సంరక్షణకొఱకే నన్నమాట. అందుచేత హక్కుల సంరక్షణ పూర్వపాక్షికుడుకూడ ఒప్పుకొన్నదే—బహిరంగంగా కాకపోయినా.

సిద్ధాంత నిర్వచనం: 'హక్కు'ను ఆస్టిన్ అనే ఆయన యిలా నిర్వచించాడు. "వ్యవహారసూత్ర

ప్రకారం ఎవరైనా ఒకడు మరియొకనికి సంబంధించిన ఒక విధిని చేయవలసిన బాధ్యత కలిగివున్నట్లయితే, ఈ మరియొకడు కలిగివున్నది ఒక హక్కు" అని. ఒకడు రోడ్డుబాగుచెయ్యవలసిన బాధ్యతకలిగి వున్నప్పుడు, మరొకనికి అది బాగుచెయ్యకపోవటమువలన నష్టము కలిగేటట్లుంటే ఇతనికి ఒకహక్కు వున్నదని యర్థము. దానిని పురస్కరించుకొని కోర్టుద్వారా మొదటి వానిచే రోడ్డు బాగుచేయింపజేస్తాడు. ఇది బాగానే వుంది. కాని, 'లా' ప్రకారం ఒక జైలరు మరణశిక్ష విధింపబడ్డవానిని ఉరితీయవలెను. మరి ఈ మరణ శిక్ష విధింపబడ్డవానికి ఉరి తీయించుకొనగలిగిన హక్కు వున్నదిఅని అనవలసివస్తుంది. ఇదెంత హాస్యాస్పదమైన విషయము!

సాల్మండు అనే ఆయన పైనిర్వచనాన్ని రోగ తాళిచేసి, తను యిలా నిర్వచించాడు. "న్యాయ స్థానాల్లో ఏయే ఫలాపేక్షలు, గుర్తింపబడి రక్షింప బడుతున్నాయో ఆ ఫలాపేక్షలు హక్కులూ" అని. దీనిప్రకారం పైన వచ్చిన చిక్కు సద్దుకొన్నది. నేరస్థుణ్ణి వురితీయవలెను—అని శిక్షాస్మృతిలో చెప్పిన దానిని న్యాయస్థానాలు పాటిస్తవి కనక, అలా శిక్షింప బడటం రాజ్యంలోని మొత్తం సమాజానికిగల హక్కుగా గుర్తింపబడినట్లు చెప్పవచ్చు. సంఘమునకు, ఆ నేరస్థుని ఉరితీయింప జేయుటకు హక్కువున్నది అని చెప్పటానికి సాల్మండు నిర్వచనం సమర్థమైవుంది.

తాడి తన్నేవాడి తల తన్నేవాడుంటాడన్నట్టు, గ్రే అనేఆయన ఈ నిర్వచనాన్ని ఒప్పుకోలేదు. "ఫలాపేక్ష హక్కెట్లా అవుతుంది? 'ఫలాపేక్ష' కూడా అపేక్షే. ఈ ఫలాపేక్షను న్యాయస్థానాలమూలకంగా పొందగలిగితే లేక పొందగలిగిన అవకాశం వుంటే, ఈ అవకాశమునేది హక్కు అవచ్చు" అన్నాడు.

హాలెండనే ఆయన యిలా అన్నాడు. "ఒకడికి, మరొకడి పనులను అజమాయిషీచేసి, రాజ్యపాలకుల ద్వారా ఒక నిర్ణీతమైన దోవలో నడపగలిగిన శక్తి కలిగివున్నట్లయితె ఆ శక్తియే హక్కు" అని. ఈ నిర్వచనాన్ని చాలామంది ఒప్పుకొన్నారు. మనమూ ఒప్పుకొందాం. ఒకడికి హక్కువుందా లేదా అని తెలుసుకోటానికి యీ నిర్వచనం క్రిందికి వచ్చే శక్తి అతనికి వుందాలేదా అని చూడాలి. అందుచేత ఆశక్తి లోతుపాతులు తెల్సుకోవాలి. కనక దానిని వ్యాఖ్యానించవలసి వుంటుంది.

వ్యాఖ్యానం : హక్కు అనబడే శక్తి వేరు—శరీరబలంతో ఇతర్ల చేత పని చేయించగలిగిన శక్తి వేరు. తండ్రి కొడుకును దబాయించి తనకవిత్వానికి కాపీలు వ్రాయించుకొంటాడు. లేకపోతే చుట్టలు బజారు నుంచీ తెప్పించుకుంటాడు. మేష్టారూ అంతే కుర్రాళ్లని. వాళ్లకున్న శక్తి హక్కుకాదు. శరీరబలం లేదా గౌరవమునై బలం. దీనికీ హక్కుకూ చాలా భేదంవుంది. అది గమనించాలి.

హక్కు ఎవరిదో వారే ఆ హక్కును చెలాయింప జేయగలగాలి. అదేంమాట్లు? ఇతర్లెలా చెలాయిస్తారనకండి. ఒక స్వాములవారున్నారనుకోండి. ఆయనంటే చాలామందికి నమ్మకం. కొందరు శిష్యులు ఆయనదగ్గరకు వెళ్లటం తాత్కాలికంగా మానుకున్నారనుకోండి. ఇతర శిష్యులు—అలా వెళ్లకపోతే ఏదో చెడు కలుగుతుంది. ఈ మాట ఖాయం—అని బెదిరించారు. ఈశిష్యులు కొంచెం బాధపడి చివరకు వెళ్లారనుకోండిఆయన వద్దకు దక్షిణతాంబూలాదులతో. ఇక్కడకూడ ఒక పని బలవంతంమీద చేయించటం జరిగింది. ఇది హక్కు అంటానికి వీల్లేదు. (1) కోర్టు ద్వారా ఆ పనిచేయించటం సాధ్యంకాదు కనక (2) స్వాములవారు తనుగా చెలాయించలేదు కనక. ఆయన చాలా మంచివాడే నేమో. ఈ బెదిరించిన శిష్యులు తమాషా మనుషులు కావటం మూలాన ఒత్తిడితెచ్చారు. అంతే. అందుచేత వారుపయోగించిన శక్తి హక్కుకాదు.

ఒకాయనకు చిన్న సందేహం వచ్చింది: ఈ శక్తి అనేది కోర్టులో వ్యాజ్యమో, ఏదో వేసిన కారణాన మాత్రమె 'హక్కు' అనబడుతుందా? ఒక వేళ వ్యాజ్యం వెయ్యలేని బికారివాడువుంటే వాడికి 'హక్కు' లనేవి లేనేలేవా?—అని. ఆయనవాదం ఏమిటంటే కోర్టుద్వారా ఎప్పుడైతే పనిచేయించటానికి పూనుకొనలేదో 'శక్తి' అనేదిలేదు. కనక అక్కడ హక్కు అనేదికూడా లేదుకదా! సాల్మండు "అలా కాదయ్యా శక్తి అనేదివుంటే చెలాయింప బడకపోయినా అది హక్కే. చెలాయింపబడగలిగిన అవకాశంవుంటే చాలు" అన్నాడు. సిడ్జివిక్ అనే ఆయన ఒప్పుకోలేదు. "అలా అంటే యెలాగు? పుట్టించినవాడు పెట్టకపోయినా డన్నట్టు హక్కు నిచ్చిన

'లా' అసరా నివ్వకపోతే, అది 'లా' కావడం మానెయ్యదా ?" అన్నాడు. 'యూబి జస్ ఐబి రెమెడియం' అన్నాడు. ఎక్కడ హక్కుంటె అక్కడ కోర్టు అసరా వుంటుందన్నాడు. ఏతావతా కోర్టు అసరా యిచ్చేచోట హక్కుంటుందని ఒకాయనా, హక్కున్నచోట కోర్టు అసరా వుంటుందని ఒకాయన విత్తుముందా చెట్టుముందా వాగ్వాదానికి దిగారు.

సాల్మండు ఇలా విడమరచాడు : "న్యాయస్థానాలాసరా ఇవ్వదగినట్లయితె (అనగా లా ప్రకారం) అది శక్తి. దానిని హక్కు అనవలెను. అనగా లా ప్రకారం హక్కు వుంటే, న్యాయస్థానాలు అసరా యివ్వవలసి వుంటుంది. అనుమానం లేదు. కాని, మరి యే యితర కారణాలవల్లనయినా కోర్టులు అసరా యివ్వలేకపోతే అది లెక్కలోదికాదు. చెలాయింపబడలేని శక్తికూడ 'హక్కే'. దాన్ని అసంపూర్ణమైన హక్కనవచ్చు". నన్నాడు. ఉదాహరణకు, లిమిటేషన్ చట్టంప్రకారం మూడు సంవత్సరాలలోగా లేవలసిన ప్రానోటు దావా తేకపోయినట్లయితే, కాలదోషం పట్టిపోతుంది. దావా వేసుకోనే వీలు చచ్చిపోయింది గాని, హక్కు అనేది వుండీ అంటారు. న్యాయస్థానాలు మాట్లాడ్డానికి వీల్లేనప్పుడింకా ఏం హక్కు- అనకండి. న్యాయస్థానాలు మరోవిధంగా అసరా యిస్తాయి. చెపుతాను వినండి. ఏవిధానైనా ఆ ప్రానోటు వ్రాసినాయన డబ్బు వ్రాయించుకొన్నాయనచేత చిక్కిందనుకోండి. ఆ డబ్బు తనకు రావలసిన పద్దుక్రింద జమకట్టవచ్చు. వాటిని పురస్కరించుకొని దావాఅంటే తేలేడుకాని, డబ్బువస్తే వాటిక్రింద జమకట్టినానని అతడంటే, న్యాయస్థానాలు 'మంచిదే', 'మంచిదే' అంటయి. ఈ విధంగా హక్కు పూర్తిగా చావక, బ్రతికివుంది. అది అసంపూర్ణమైన హక్కంటారు.

ప్రతిహక్కుకూ సంబంధించి ఒక విధి (duty) వుంటుంది. అనగా ఇతరుడు ఒకపనిని చెయవలసిన బాధ్యత వుంటుంది. మరి అది వున్నప్పుడేకదా కోర్టులు ఆ పని చెయింప కలిగింది. విధివుందనిచూస్తే దాని నానుకొని హక్కుకూడ వుందని తెలుసుకుంటూ వుంటానికి వీలు. ఈ హక్కు, విధి అవినాభావ సంబంధంతో ఒకదానివెంట ఒకటి సన్నిహితమై నిలిచి వుంటయి.

పరికరాలు : 'హక్కు'నకున్న పరికరాలు యివి—(1) ఎవడికి హక్కు సంక్రమిస్తుందో అతడుండవలెను. (2) ఎవడిపై ఆ హక్కు చెలాయింపబడవలెనో అతడుండవలెను. (3) నిర్వర్తింపవలసిన పని యేమిటో అది తెలిసియుండవలెను. (4) ఏ వస్తువును గురించి ఈ బాధ్యత నిర్వర్తింపవలెనో ఆ వస్తువుండవలెను. (5) ఈ హక్కునకు అధిభూతమైన 'సూత్రం' లేక దస్తావేజు యేమిటో అదివుండవలెను.

ఉదాహరణకు : వెంకయ్యదగ్గర భీమయ్య పనివాడుగా చేరటానికి ఒప్పుకొన్నాడు. (1) వెంకయ్య హక్కుదారు. (2) భీమయ్య బాధ్యతదారు. (3) నిర్వర్తింపవలసినపని ఉద్యోగం. (4) భీమయ్య శరీరబలం లేక బుద్ధిబలం చేర్పు ఇవి పైన (4) లో చెప్పిన వస్తువులు. (5) ఇద్దరిమధ్య ఒప్పందల (5) లో చెప్పిన సూత్రం. ఇల్లాగే అన్ని హక్కులకూ సమాధానం దొరకాలి.

హక్కు వేరు — అధికారం వేరు. అధికారం చెలాయించేది న్యాయస్థానాలు; లేకపోతె ప్రభుత్వం. తద్వారా హక్కు చెలాయించేది వ్యక్తి.

హక్కు వేరు - స్వతంత్రం వేరు : - స్వతంత్రం అంటే అదుపులేనిది. సాల్మండు ఇలా అన్నాడు. "నా హక్కులంటే,-ఇతర్లు నాకేంచెయ్యాలో అవి. నా స్వతంత్రంఅంటే,-నాకు నేనేంచెసుకోవాలనుకొంటానో అది."

# వసంతవాల్లభ్యము

## శ్రీ శనగన నరసింహస్వామి

బాలరసాల ఫుల్లనవపల్లవ తీక్ష్ణ శరుండు, పుష్పలిడ్
జాల లసత్పలాశసుమ చాపగుణుండు, వసంతయోద్ధ; త
త్కాల ముహుర్ముహుః ప్రసురత ప్రవిసంగి మనస్సరోజినీ
పాలి విపాటనోద్యము డుపాగతుడయ్యెను, చూడు ప్రేయసీ!

ద్రుమములు పుష్పవంతములు, తోయము లుద్గతపద్మరాజముల్,
ప్రమదలు కామమంథరలు, వాయువు లాత్తసుగంధముల్, ప్రదో
షములు సుఖమ్ము, లెల్లదివసమ్ములు సుందరముల్, వసంత మా
సమున చరాచరప్రకృతి సర్వము చారుతరమ్ము జవ్వనీ!

రాగవతీ కపోలముకురమ్ముల రంగులు దిద్దు కర్ణసీ
మాగత కర్ణికార కుసుమమ్ములు, మేచక చంచలత్కచా
భోగములందు తావులు గుబుల్కొను దీవ్యదశోక మల్లికా
భోగవిలాసహాసరుచి పూరతరంగము లంగనామణీ!

అలరుల వింటివాడు మదిరాలసనేత్రతటమ్ములందు చం
చలుడు, కపోలపాళికల సర్వసితుండు, కుచమ్ములందు దు
ర్లలితుడు, శ్రోణి పీనుడు, వలగ్నపదమ్ముల యందు నిమ్నుడై
నెలతల యందు నామని ననేకవిధాస్థితుడయ్యె భామినీ!

మామిడి చిగురుటాకు రసమద్యము నాని మదించి పుంస్పిక
గ్రామణి, రాగహృష్టత స్వకాంతను ముద్దుల గారవించు, నా
తామరపూవుపైన నినదమ్మొనరించు కుమారషట్పద
స్వామి, నిజాంగనా మధురచాటుకృతిం భజియించు రాగిణీ!

సువదన లాచికొన్న యువశూరుల డెందము నేల కోకిల
ప్రవరము క్రమ్మఱ మ[illegible]రవాక్కుల నొంచు? శుకానసప్రతి
చ్ఛవి గురుకింశుకప్రసవ శాతకశారులు చీల్పలేదటో?
నవనవ కర్ణికార సుమనమ్ములు కాల్పగ లేదటో? సఖీ!

# వసంతవాల్లభ్యము

విరిసిన తియ్యమావుల చివిం బడి శాఖికలం గదల్పుచున్,
పరభృత పంచమప్రచుర వాక్కులదిక్కులకున్ వహించుచున్,
నరహృదయాంబుజన్మహరణ మ్మొనరించుచు హైమవాత ని
స్సరణమనోహరానిలము చైత్రదినమ్ముల వీచు మానినీ!

విరిసిన మల్లెపూవులు సవిభ్రమ మానవతీ ప్రహాస పాం
డరరుచు లెత్తగా నుపవనమ్ములు రమ్యములై హరించు బం
ధురవినివృత్తరాగ మునిధూర్జటి చిత్తములే! హరించు ఓ
యరిది వయస్వి రాగమలినాత్మల నంతకుముందె సుందరీ!

కనుగవ మోమ్ము, నేమ్ము, నధికవ్యథ గద్గదపాటుజెందు, నా
నను బిగియించు చేత, నతిచారివిరావముసేయు, కామినీ
జన విరహార్తమానస దశావశు దధ్వగు దధ్వమోహనాం
గణకిన పుష్పసత్రమ సహకార కుజమ్ముంగాంచి గేహినీ!

వరశర మాత్రమ క్రమతర వల్లరి,
చాపము కింశుకమ్ము, జ్యా
స్వరదళిపంక్తి, ఛత్ర మనవద్య
సితామృత రోచి వేనికా
పరభృత వంది, ఆ మలయ వాయు
మదద్విరదుండు, లోకజి
త్వరు డతనుండు మీ కిడుత!
భద్రము లెల్ల వసంతయుక్తుడై.

[ఆంధ్రీకృత ఋతుసంహార కావ్యమునుండి]

# రాష్ట్రగానములోని రామణీయకము

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

నలుబది రైదేడులు తెలుగువారు పోయిన పోకడలను వర్ణించిన రెండు కావ్యములు "రాష్ట్రగానము", "ఉదయగానము" అనునవి. ఈ కావ్యములను రచించినవారు తుమ్మల సీతారామ మూర్తిగారు. వీరాధునిక ప్రసిద్ధ కవులలో నొకరు. "ఆత్మార్పణము", "ధర్మజ్యోతి" యను ధర్మవీరరసప్రధాన కావ్యములను, "పఱిగపంట", "శబల" యను ఖండకావ్యములను, "బాపూజీ—ఆత్మకథ" యను మహావీర కావ్యమును సీతారామ మూర్తిగారు రచించిరి.

కవికృతమైనది కావ్యము. ఆ కవి యీ లోకమునకు చెందినవాడు. ఇచ్చటి సంఘమునందు మెలగినవాడు. మాతృదేశమందలి వాయువులను పీల్చినవాడు. సమకాలీన సంఘమందలి యభ్యుత్థాన పతనములను, ధర్మాధర్మములను, మంచిచెడ్డలను గుర్తించినవాడు. ఆ సంఘయాత్రలో తానును గొంతెత్తి గానము సేసినవాడు. కావున తత్సంఘ సర్వభాగము లాతని కావ్యమునందు ప్రతిబింబించును. అతడా సంఘముపై దన ప్రభావము నెఱపును. కవికృత కావ్య పరిశీలనములో నిది సంఘపరమయిన విమర్శ. "రాష్ట్రగానము"ను, "ఉదయగానము"ను మన మేవంవిధదృక్కోణము నుండియే పఠింపవలయును; పరిశీలింపవలయును. అప్పుడే మన కా కబ్బములలోని సొగసులు, తీరుతియ్యములు, నయనాణ్యము లంతుపట్టగలవు.

ఆంధ్రు డెవడు? అతనికొక చరిత్రయున్నదా? తదితర జాతులవలె నాంధ్రజాతి నాగరకత నేర్చినదా? సంస్కృతిని పెంచినదా? ఆంధ్రుడు మహాసామ్రాజ్య నిర్మాతయై చరిత్ర కలంకార ప్రాయుడయ్యెనా? లలితకళా లక్ష్మికి తెలుగుబిడ్డ కపురంపు టారతు లిచ్చెనా? ఐనచో నాతని ప్రశస్తి యెట్టిది? అసలాంధ్రునకొక వ్యక్తిత్వ మున్నదా? అను నీ ప్రశ్నలీ శతాబ్ద ప్రారంభములో నుప్పతిల్లినవి. ఈ ప్రశ్నలా నాడాకాశమునుండి యూడిపడలేదు. క్రమ క్రమ పరిణామమున కాదరువయిన యానాటి యాంధ్ర సంఘమునుండియే యీ ప్రశ్నలు పుట్టినవి. పుట్టుటయే యాలస్యము. చరిత్రకారులు, కవులు సమాధానములు వెదకిరి. చరిత్రకారులు ప్రాచీన చరిత్రనంతయు త్రవ్వి తలకెత్తిరి. కవులు పురాంధ్ర వైభవ సంపత్తిని వర్ణించిరి. అదియొక యావేశము! అదియొక మధురానుభూతి!!

దీనికి కారణము లేకపోలేదు. ఆనా డాంధ్ర రాష్ట్రోద్యమమను మహాసముద్రము తెలుగుజాతిపై నుప్పెనలు పొంగించినది. ఆ ప్రవాహములలో తెలుగు జాతి యుక్కిరి బిక్కిరి యైనది. బరంపురమునుండి బళ్లారివఱకు తెలుగునా డట్టుడికి నట్లుడికి పోయినది. "ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రము కావలె"నను పొలికేక దిగంతముల మార్మ్రోగినది. అబాల గోపాలము రాష్ట్రము సాధింప నడుముగట్టినది. కవులుమాత్ర మూరకున్నారా? వా రాంధ్రయశోగాన మొనర్చి నిదురపోవు మూకలను హెచ్చరించి మేలుకొలుపులు పాడిరి. ఆ యూపులోనే నవ్యాంధ్ర కవులలో నొక తరమువారు దేశభక్తి ప్రబోధాత్మకముగా నొక ప్రత్యేక కవితాశాఖను నిలయించిరి. ఆ తరములో నావిధముగా దేశభక్తిని అనగా ఆంధ్రాభిమానమును గానముసేసిన కవులలో సీతారామమూర్తిగా రొకరు.

ప్రాచీన నవీనాంధ్ర సాహిత్యములకు భేద మాపాదించు నంశములలో దేశాభిమానము నుద్బోధించు కవిత యొకటి. దీనిని మనము జాతీయ కవిత్వము అని యందుము. ఈ జాతీయ కవిత్వము నూతనమైనది; తెలుగు కవుల మివుల నాకర్షించినదియును. అట్లని, ప్రాచీన కవులకు జాతీయ కవిత్వము చెప్పుట తెలియ దాయని విజ్ఞులు ప్రశ్నింపవచ్చును. తెలియుననియే సమాధానము. నన్నయ, శ్రీనాథుడు, రాయలు, ధూర్జటి, కుమారధూర్జటి తదితరాంధ్రకవులు తెలుగు నాటిని తెలుగుబాసను, తెలుగు మగంటిమిని ప్రశంసించిరి. శ్రీనాథుడు భీమఖండమున, క్రీడాభిరామము పల్నాటి వీరచరిత్ర తెలుగువారికి గాక మఱి యెవరికి దీప్తి కల్గు

లకు రచించినాడు? కాళహస్తి మాహాత్మ్యము, కృష్ణరాయ విజయము, రంగరాయ చరిత్రము, రామరాజీయము మున్నగు కృతు లాంధ్రులకు గాక మఱి యెవ్వరికి మోదము సేకూర్చును? ఐనను తదితర విషయములందువలె ప్రాచీనుల దృష్టికిని, నవీనుల దృష్టికిని తారతమ్యము గాఢముగా కన్పించును. నవీన కవులు సృజించిన జాతీయ కవిత్వమును పరిశీలించినచో నీ భేదము స్పష్టముగా గోచరించును. సంఘమనునది నవీన కవుల నధికముగా నాకర్షించినది. అట్లాకర్షణముచేత సహజమును. రేలుబవళ్లు మఱచి ముసుగుదన్ని నిద్రవోవు తెలుగుజాతిని మేలుకొల్పుటలోనే నవీనాంధ్ర జాతీయ కవిత్వము పర్యవసించినది. శ్రీనాథాదులు కావ్యములు రచించిన దీదృష్టితో గాదు. ఆంధ్రజాతిపైగల మమకారము తొల్లిటి నేటి కవులకు సమానముగానున్నను లక్ష్యమాత్రము భిన్నముగా నున్నది.

మనకు తెలిసినంతవరకు నవ్యాంధ్రసాహితీ ప్రపంచములో దేశభక్తి కవిత్వమునకు శ్రీకారము చుట్టినవారు గురజాడ అప్పారావుగారు. "దేశమును ప్రేమించుమన్నా" యను వారి గేయము జగత్ప్రసిద్ధమయినది. కాని యప్పారావుగారు విశేషించి దేశభక్తి కవిత్వమాంధ్రుల పరముగా రచించినట్లు గానము. ఆంధ్రాభిమానము చాటిన యీనాటి పెద్దతరము కవులలో రాయప్రోలు సుబ్బారావుగారే ప్రథములు. తరువాత విశ్వనాథ సత్యనారాయణగారు, తుమ్మల సీతారామమూర్తిగారు, జాషువాగారు ముఖ్యులు. దాశరథి ప్రభృతులు తెలంగాణ కవిపుత్రులు ఆంధ్రాభిమానము గానముసేసిన ఇటీవలివారు.

రాయప్రోలు, విశ్వనాథ, తుమ్మల, జాషువా— ఈ నలువురు కవుల కాంధ్రాభిమానము చాటుట సమాన లక్షణముగా నున్నను వారు త్రొక్కిన మార్గములు మాత్రము భిన్నముగా నున్నవి. రాయప్రోలు, జాషువా గారలు ఆంధ్రపురావైభవము నెక్కుడుగా ప్రశంసించిరి. విశ్వనాథ సత్యనారాయణగారు "మహాప్రబంధరచనా సౌందర్యపుక్ వాసనల్ తీపై క్రమ్మగ" నాంధ్రుల చరిత్రలోని ముఖ్యకథా ఘట్టములను రమణీయముగా రచించి "ఆంధ్రప్రశస్తి" కూర్చిరి. దాశరథి తెలంగాణ దాస్య విముక్తికొఱకు పాటుబడిరి. ఇక తుమ్మల సీతారామమూర్తిగారి పద్ధతి యది గాదు. ఆంధ్రరాష్ట్రోద్యమమనది యీ శతాబ్ద ప్రారంభములో పుట్టినదని మొదటనే విన్నవించితిని. సీతారామమూర్తిగారు పురాతనమైన తెలుగు వెలుగునుగూర్చి కవనమల్లినను, వారి దేశభక్తి కవిత్వము ఆంధ్రరాష్ట్రోద్యమముతో పెనవైచికొనిపోయినది. ఆ యాంధ్రరాష్ట్రోద్యమము పొందిన యాయా దశలను ఈయనవలె విపులముగా వర్ణించినకవి మఱియొకరు లేరు. ఆ యుద్యమాఘాతములకు ఱొమ్ము విఱిచి యడ్డునిలిచి స్వాభిప్రాయములను స్పష్టముగా సీతారామమూర్తిగారివలె ప్రకటించిన కవులును లేరు.

"తెలుఁగుదేశము, తెలుఁగుభాష, తెలుఁగు చరిత్ర, తెలుఁగుప్రజ, తెలుఁగు సంస్కృతి అనినంతనే నా యొడలు పులకరించును. ఇవి నాకు ప్రాణకల్ప విషయములు. నేను తెలుఁగువాఁడను—అను సహంకారము నా కెక్కువ. ఈ యహంకారమే నన్ను కవిని చేసినది. ఇట్టి నా జాతియు, నా భాషయు పరతంత్రములై పరకీయ సంస్కారము నాశ్రయించి ప్రాచీన గౌరవమును కోల్పోయినవిగదా! ఇది నా మనస్సులో అనుక్షణముగా రేఁగునట్టి యారాటము. ఈ యారాటమునకు నా జీవుఁడు కదలినాఁడు. ఆ కదలికయే రాష్ట్రగానము.

"1937 అక్టోబరులో విజయవాడయందు అఖండవైభవముతో ఆంధ్రమహాసభ జరిగినది. ఆ సభలో పెద్దలు పిన్నలు రాష్ట్ర సంపాదనముపట్ల వెలువరించిన యుద్రేకము, పచరించిన యుత్సాహము ఈ కృతి యవతరించుటకు కారణములు". ఇది సీతారామమూర్తిగారు రాష్ట్రగానము "మనవి"లో వ్రాసిన మాటలు. ఈ మాటలలో రాష్ట్రగానము "పుట్టుపూర్వోత్తరము" లన్నియు నిమిడియున్నవి. "రాష్ట్రగానము" అని యీ కావ్యమునకు పేరు. రాష్ట్రమునుగూర్చి గానమని ద్వితీయ తత్పురుషలోగాని, రాష్ట్రముయొక్క గానమని షష్ఠీ తత్పురుషలోగాని మన మర్థము కల్పించుకొనవచ్చును. ఆ రాష్ట్రమునకు కావలసినంత పూర్వ చరిత్రయున్నది. ఆ రాష్ట్రము ప్రత్యేకముగా నవతరించుటకుముందు గాథ చాల నడిచినది. కావున ఆ రాష్ట్రమునకు సంబంధించిన యీ విషయముల యొక్కయు, నింక మఱి కొన్నిటి యొక్కయు యావద్గాన మీ కావ్యములో నిండి నిబిడీకృతమై యుండుటను సారాంశము కావ్యనామమునుబట్టి తేలుచున్నది. ఆ రాష్ట్ర మేది? ఆంధ్రము. దాని గానము "రాష్ట్రగానము."

రాష్ట్రగాన సర్వస్వసార మీ క్రింది చిక్కని కందపద్యమునందు పంచారించిన దనవచ్చును.

ఆంధ్రుండవై జన్మించితి
వాంధ్రుండవై యనుభవింపు మాయుర్విభవం
బాంధ్రుండవై మరణింపుమి
ఆంధ్రత్వములేని బ్రతుకు నాశింపకుమీ.

ఆంధ్రసోదరులను "తెనుఁగుఁదనము" కాపాడుకొనుడని హెచ్చరించుచు సీతారామమూర్తిగారు రచించిన పద్యములలో నిది చిన్నది; చిక్కనిది; జీవవంతమును. ఈ గడ్డవాఁ డాంధ్రుడై జన్మించినవాఁడు. అతని చరిత్ర దొడ్డది. అతడు వన్నెవాసి గాంచిన శుభ ముహూర్తములు చరిత్రలో వేవేలు గలవు. వానినే యీ కవిగారు పరమ రమ్యముగా చెప్పినారు.

కలదోయి! తెలుఁగుజోదుల కుటారి కటారి
చెలరేఁగి పగఱఁజీల్చినదినంబు
కలదోయి! తెలుఁగురాజులు గంగ గట్టుపైఁ
దిండ్రించి పసిగ లెత్తినదినంబు
కలదోయి! రేవు రేవులఁ దెలుంగుపరంగు
పెనఁగి లంగర్లు దింపిన దినంబు
కలదోయి! తెలుఁగు పల్కులవెలంది—వెలంది
వెలుఁగు లెల్లెడలఁ బర్వినదినంబు
కలదు కలదోయి! తెల్గు ప్రెగ్గడలు మన్ను
మిన్ను శౌర్యంబునైచి పేర్గన్న దినము
నేఁటి నీపాటునెంచి కన్నీటి నిడకు
నిలుచునే కాల మొకలీలఁ దెలుఁగుబిడ్డ!

ఈ పద్యపు తేటగీతిలో నేనాటికయిన తెలుగు పాలమొక ఖండముగా నేర్పడు నన్న యాస వ్యంగ్యముగా వివరింపబడినది.

అదియునుగాక ఆంధ్ర సంస్కృతిని రాయప్రోలువలె నీయనయు తనివితీరక మొగము వాచినట్లు వర్ణించినారు. "ప్రశస్తి"లో నున్న యీ క్రింది పద్యము లన్ని విషయముల రాటుదేలియున్నవి.

తనకత్తి నీడలోఁ దనిచె ధైర్యమునిచ్చి
దక్షిణక్షోణి హైందవ మతమ్ము
తనబుద్ధి సాగరత్వము తేటతెల్లగా
వేద భాష్యమ్ములు వెల్లడించె
తనతంత్ర శక్తికిఁ దార్కాణగాఁ బాదు
షాలకే తచ్చుటో పీలువెట్టె
తన కళాలిప్స కద్దిమువోలె రాణింపఁ
గల్పించె భువనైక శిల్పవీధి
తన రసజ్ఞతకది నిదర్శనముగాఁగ
మోసెఁ గవిరాజు పల్లకీ మూఁదుకొమ్ము
కొమ్ము దిరిగినవారలే కొలువుసేయ
దిక్కులొత్తిన మొనగాఁడు తెలుఁగువాఁడు.

అకలంక శౌర్యమూర్తికి శివాజీకి రాజ్య
తంత్రంబు నాంధ్రుఁడే దానమిచ్చె
పీష్వాల యేల్బడి పెంచె మంత్రిత్వంబు
మోసి పింగళివారి మోరోపంతు
చైతన్యునకు భక్తి లోతులన్నియు మప్పి
మహిమ గూర్చెను బిల్వమంగళుండు
కర్ణాట కవితా వికాస నిర్మాతలై
ప్రథితి కెక్కిరి పూజ్య పాదముఖులు
కూర్చె హిందీ కవిత్వంబు క్రొత్త క్రొత్త
పోకములతోడ భట్ట పద్మాకరుండు
పుక్కిటి పురాణములుగావు పూర్వచరిత
తఱచి కన్గొను డాంధ్ర సోదరులార!

ఆంధ్రరాజ్య స్థాపనాచార్యుఁడై తెల్గు
వేలుపైనా డాంధ్రవిష్ణువిభుఁడు
దిఙ్కళానిధి సుశర్మను జంపి మగధోర్వి
శాసించె శ్రీముఖ చక్రవర్తి
ఔత్తరాహులనెల్ల నదలించె హాలుండు
శాలివాహనశక స్థాపకుండు
నిజ జయస్తంభముల్ నిఖిల దిక్కులఁ బాఁతె
గౌతమీ పుత్రుండు శాతకర్ణి
క్షాత్రపుల గెల్చి మాళవధాత్రి కెల్ల
నాథుఁడైయొప్పెను వాసిష్ఠి నందనుండు
ప్రాఁతవనిపట్టి యాంధ్ర భూపతుల కథలు
చదువుఁ డొకసారి కంపెలు కదలియాడ!

లాలిత్య లక్ష్మి విలాసరంగమ్ము ని
ల్పితి వజంతా చిత్రలేఖనమ్ము
సవరించితివి శైవ భువనంబు నెల్లోరా
కొండను మైనంపుటుండఁజేసి
విఠ్ఠల ప్రభుని కోవెలకంబములచేతఁ
బలికింపఁగంటి సప్తస్వరాలు
ఒలికించితౌర! తిర్మలనాథు నగరులో
వెలలేని సభ్యతా విలసనములు
భగవదన్వేషణార్థమై పాటుపడిన
యుత్తమ తపస్వివై కళాయోగివయిన

నీకు ఋణపడె రసలుబ్ధ లోకమెల్ల
నాంధ్ర శిల్పీ! చిరంజీవివయ్య నీవు!

ఐన నీ పద్యములలో వర్ణితమగు నాంధ్ర సంస్కృతిని గుఱించి యాంధ్రునకెంత తెలియునను నది యొక ప్రశ్న. ఏమియు తెలియదని కవిగారి సమాధానము. ఆ విధముగా నీ కవితలంపనిచో మాతృశ్రీ నుద్దేశించి యడిగిన ప్రశ్నవలె నున్న యీ క్రింది పద్యమును అతను రచించుటలో రహస్యమేమి? "అనుతాపము" అనుదానిలో నున్నదీ పద్యము.

ఖండించెనా ఘోర ఖడ్గధారనితండు
  మగధసేనావ్యూహ మండలంబు?
నడిపించెనా తెల్గునాఁటి శిల్పముమోయు
  నౌకలీతఁడు రోము నగరమునకు?
శ్రమియించెనా యితం డమరావతీ కళా
  పరిషత్తులో శాస్త్ర పాఠములకు?
అర్పించెనా పన్య హారావళినితండు
  కనకాభిషేకంబు గన్న కవికి?
త్రాగెనా రామభక్తిమైఁ ద్యాగరాజు
క్రుమ్మరించిన గీతామృతమ్ము నితఁడు?
పూర్వ సంస్కారమూఁడై పుట్టు కతన
వేఁడుచున్నాఁడు వివరింపవే! సవిత్రి!

మఱి యాంధ్ర నాగరకత పూర్వ మీ మాదిరిగా మూఁడుపూ లారుకాయలుగా విలసిల్లినదిగదా! ఈ కావ్యము రచించునాటికీ తెలుగు మాగాణము సంతృప్తి నొసగలేదో యేమో పూర్వాంధ్ర మహోన్నత్యమేల చవిచూడకపోయితి నయ్యో యని వాపోయినారీ కవి గారు. దానికీ క్రింది పద్యమే సాక్షి.

పాటలీ పుత్రమ్ము కోటకొమ్మలమీఁదఁ
  దెలుఁగు జెండాలు నర్తించునాఁడు
ఢిల్లీకు చెదిరి చెండిన తెల్గు విలుకాండ్రు
  నవలక్ష లోరుఁగల్ గవియునాఁడు
రాచూరు కదనమం జేచి తళ్తళమంచుఁ
  దెలుఁగు జోగుల కత్తి తిరుగునాఁడు
అల చోళపాండ్య భూములఁ దెల్గుసరకార్ల
  పసుపు నూయాణమై ప్రాఁకునాఁడు
చూచి సంతోషభారంబు మోచి శిరము
నూఁచు భాగ్యంబునకు నింత నోఁచలేక
యేల పుట్టితి నిపు డిసీ! యేటి బ్రతుకు
కటకటా! దాఁటిపోయె బంగారు యుగము.

ఏతాదృగ్విధమైన ప్రాక్తనాంధ్ర వైభవ ప్రశంస యీ కావ్యము ప్రథమభాగములో మిన్నంటినది.

ఇంతగా పురాతన ప్రశస్తిచేసినను, ఆ వైభవము దగ్ధమైపోయినదని వాపోయినను లాభములేదు. ప్రాచీన వైభవము ప్రాచీనమే. దాని నెంత పొగడినను లాభము లేదు. మఱి యీనాటి తెలుగువాని గొప్పతనమెంత?— యను ప్రశ్న వెంటనే పుట్టకమానదు. ఆ సంగతి యీ కవిగారికిగూడ తెలియును. ఈ కావ్యము రచించు నాటికిగూడ తెలుగుపాలము ఇంగువ కట్టిన గుడ్డవలె నున్నది. ప్రాచీనకాలమునందువలె ప్రజ్ఞామూర్తులకు, దానశేఖరులకు, వీరవరుల కాంధ్రదేశమునందు తఱుగు లేదని సంతృప్తిపొంది, యీ కవిగారు తద్యశోగానము గావించినారు; ఇక్కడినుండియే యాంధ్రప్రశస్తి పాడిన తదితర నవ్యాంధ్రకవులకంటె భిన్నమార్గమును త్రొక్కినారు. ఈ క్రింది పద్యములను చూడుడు.

జలధులేడింటి కవ్వలిమిట్టపై నల్లు
  కొనె రాఘవేంద్రుని గుణలతాళి
కర్ణాట నరపతి గ్రామకర్షకజాతి
  కింటిజేల్పయ్యె విశ్వేశ్వరుండు
అతివేల రాజకీయజ్ఞానదాతయై
  చింతామణి జగత్ప్రసిద్ధి వడసె
సింధురాష్ట్ర ప్రజాసేవకోత్తముఁడై
  రాణించెఁ గోటమరాజాకులుఁడు
నాగపురధర్మ పరిషత్తునకు వినూత్న
రామణీయకమిడె మాచిరాజ్ఞియోగి
తారకాపత్రి కుముదబాంధవునియట్లు
వెలుఁగు నెచ్చోటనున్న మా తెలుఁగువాఁడు.

ఓహోహో! ఆంధ్రుఁడు భారతదేశమునకే భూషణప్రాయుఁడై యితర రాష్ట్రాభ్యుదయములకు జీవన మర్పించినాఁడట!

పొలివోవలేదు తెల్గుల పరాక్రమరేఖ
  మన "టంగుటూరి"లో మల్లడించె
పసలతే దాంధ్ర విజ్ఞాన తేజఃపుంజ
  మది రామలింగార్య నాశ్రయించె
చెదరిపోలేదాంధ్ర శేముషీ సంపత్తి
  పట్టాభి సచివుకేల్ పట్టుకొనియె
బీఱువోలే దాంధ్ర వీరదాతృత్వంబు
  నాగేశ్వరునిలోఁ దెనంగియుండె

తలఁగిపోలేదు తెల్లుకోతల పసందు
కులుకుచున్నది చెఱకుపిళ్ళ కలమునందు
నిస్పృహోహారు వించుకేనియును లేదు
సోదరా! లెమ్ము నీ హక్కు లారుకొమ్ము.

ఈ పద్యములందు పేర్కొన్న వారందఱు ఆంధ్ర వీరులు. ఆంధ్రదేశములో సర్వవిధముల సాంస్కృతిక పునరుజ్జీవనమును కల్గించిన మహనీయులు. వారు, తాము సల్పిన నిర్విరామ సేవకు ప్రతిఫలముగా కవితా ప్రపంచములో చిరస్థాయు లయినారు. వీరిలో నింకను కొందఱున్నారు. తెలుగువారు వీరి కెంతో ఋణపడి యున్నారు. కనీస మీ పద్యములను చదువుకొని యా తేజోమూర్తులయెడ మనకుగల భక్తిప్రపత్తులను వెలార్చుట మన కనిష్ఠధర్మము.

ఇచట నొకమాట చెప్పుట యనవసరము కాదను కొందును. ఈ పద్యములను లేదా యీ కావ్యమును చదువునపుడు మన మొక విషయము విస్మరింపరాదు. అది యీ కావ్యోత్పత్తికాలము. ఆ కాలములో మనము మానసికముగా విహరింప గల్గినచో నీ కావ్య పఠనములోని యానందము ననుభవింప గలుగుదుము. ఇది యీ యొక్క కావ్యమును గూర్చియే గాదు నేను జెప్పునది. సంఘమందలి మంచి చెడులను వర్ణించుచు నీ శతాబ్ద ప్రారంభములోను, నా నాఁడును వెలసిన కావ్యము లన్నిటి కీసూత్రము సమన్వయించును.

మఱియొకమాట. పై పద్యములలో కొన్నిటిలోని ప్రశ్నలకు మనమీనాడైనను సమాధానము చెప్పగలమా? ఏమో? మన కొక సర్వసమగ్రాంధ్రచరిత్ర మీనాటికైన నిర్మింపబడలేదే? ఈ నాటికిగూడ మన యాంధ్ర చరిత్రాభిమానము మాటలకు మాత్రమే పరిమితమైనదే? ఆంధ్ర సంస్కృతికి చిహ్నములని, జయపతాకలని మనము ప్రశంసించు విశ్వవిద్యాలయములయిన నేల యీ కార్యనిర్వహణమునందు ముందంజవేయవు? తెలుగు నాయంకరము మూడు మూపులపై మోయువారి కయిన మన చరిత్రకారుల జ్ఞానము "ఊషరక్షేత్ర వర్షోదక" మగుచున్నదని తెలియదా?

ఇంతటితో మొదట నుదాహరించిన కందపద్యము నందలి ప్రథమపాదము సారస్యము తేలినది. ఈ విధమైన ప్రాచీనాంధ్ర సంస్కృతి ప్రశంసయంతయు నీ కావ్యములో మొదటిభాగముగా చేర్పబడుచున్నది.

## 2

"ఆంధ్రుఁడవై యనుభవింపు మాయుర్విభవం" బనునది యీ కందపద్యములోని ద్వితీయపాదము. తెలుగుబిడ్డవై సర్వాయురారోగ్య సంపదల ననుభవింపుమని యీ పాదమున కర్థము. ఈ యర్థము పై చూపులకు చాల నేలికగా నుండును. కాని సీతారామమూర్తి గారి దృష్టిలో నాంధ్రుడుగా జీవించుట యనునది విస్తృతమైన, పరమపావనమైన యవశ్యాచరణీయ మయిన కర్తవ్యము; విధి. మనమందఱ మాంధ్రులమే. ఈ సంజ్ఞ మనకు కేవలము జన్మస్థానమునుబట్టి సిద్ధించినది. ఈ సంజ్ఞ చాలుఁగదా యని మనము సంతృప్తితో పొంగుదుము. కాని కవిగారి కింతమాత్రముతో సంతోషము కల్గదు. కట్టు, బొట్టు, నడత, భాష—వీని యందు ముమ్మూర్తుల తెనుఁగుదన ముట్టిపడవలయునని కవిగారి యాకాంక్ష. ఈ యభిమతమే రాష్ట్రగానములో రెండవభాగముగా చేర్పబడుచున్నది.

వేషభాషలలో, నాచార వ్యవహారములలో నాంధ్రత్వమే కావలయునను పట్టుదల సీతారామమూర్తిగారి కధికముగా నున్నట్లున్నది. ఈ దృక్కోణమునుండియే కవిగా రీనాటి యాంధ్రునిపై చూపు సారించిరి. పాపము! అతనిలో నీ కవిగారి కాంధ్రత్వము కన్పడకుండుటయే గాదు. పరకీయ నాగరకతా వ్యామోహముగూడ దర్శనమయినది. ఎక్కడ చూచిన అనాంధ్రప్రవృత్తి. ఏ వైపు వీక్షించిన అనాంధ్ర సంస్కృతి లంపటత్వము. వీనినిచూచి సీతారామమూర్తిగా రెంతగా బాధపడినారో, యెంతగా మండి పోయినారో "తెనుఁగుఁదనము", "మాతృభాష" యను శీర్షికల క్రింది పద్యములను చదివినచో మనకు తెలియ గలదు. మొదట కట్టుబొట్టులనుగూర్చి యేమని చెప్పి నారో చూతము.

అయ్యరు కూడ కట్టుమన
కక్కు అయే గుజరాతిటోపితో
నెయ్యములేనిచో బ్రదుక
నేర మరబ్బుల లుంగిపొత్తు లే
దయ్యెనయేని చక్కఁదన
మన్నది సున్న తెలుంగువానికి
దయ్యపు వేసమేల మన
తాతల తండ్రుల కట్టు గిట్టదే?

తుక తుక పుట్టెడిక గోదమ
తుమ్మెద రెక్కలవోలె వాస్యల
క్కికి నొకవింత కాంతినిడు
మీసముల్ గొఱిగించి ఫ్రెంచి పో
లికయంట ముక్కు క్రింద నొక
లేశము నిల్పెద; రద్ది యెద్దియో
మకిల వలెజ్ జుగుప్సనిడి
మానసముల్ గలఁగించి వైచెడిన్.

ఇంతియేగాదు. ఆనాటి యాంధ్రులలో గల యనాంధ్ర లలితకళా వ్యామోహమును, అన్య చరిత్రాభిమానమును గూర్చి సీతారామమూర్తిగారు వ్రాసిన యీ క్రిందిపద్యములు తప్పక చదువదగినవి.

అస్పృశ్యములు నీకు నాంధ్ర పత్రికలెల్ల
నింటివేల్పులు టైమ్సు, హిందు, మెయిలు
నలసారములుగదా తెలుఁగు మందులు నీకు
జండుఫార్మసీ సుధా సాగరంబు
కలుషు బంకలు భద్రగిరి తీర్థములు నీకు
పంఢరి క్షేత్రంబు పరమపదము
పరిహాస్యములు నీకు శాలమ్మ చరితముల్
శరణంబు కుసుమాంబ చరణపీఠి
చవుతి చంద్రుఁడు తెలుఁగుపుస్తకము నీకు
విదియజాబిల్లి హిందీకవి ప్రబంధ
మక్కటా! యేలపుట్టె నీ కుక్కమూతి
పిందియలు నీకు నంచితాస్పందమతికి?
దామెర్ల వారి చిత్తరువు సొంపులుచూచి
యవనీంద్రు గీతల కబ్బపడెదు
కోడిరాముని శక్తిఁ గొనియాడ నొల్లవు
గామాను దలఁదాల్చి గారవింతు
కన్నాంబ నైపుణుల్ గని సెబాసన లేవు
దేవికా ప్రతిమకై తీవ్రపడెదు
నాగభూషణు గీతనైపుణ్య మెఱుఁగవు
వైగరాచారి పాటను గణింతు
వెల్లకాలము పొరుగింటి పుల్లఁగూర
కొఱుకు లొట్టలు వేయు దుర్గుణమె నీకు
నిష్టదేవతయయ్యె నీ కష్టబుద్ధి
రొట్టు రుచియించె దీని నీ కెవఁడు మప్పె?
చాళుక్య రాజ్య ప్రశస్తి నీ వెఱుఁగవు
నార్మన్ ప్రభుత్వ వర్ణన మొనర్తు
రుద్రమాదేవి పౌరుష భంగుల నెఱుంగ
జలిజబెత్తు మహత్త్వ మెన్నుచుందు
సూరన్న కావ్యకళా రూఢి నెఱుఁగవు
షేక్స్పియరు కవికిఁ జేజేల నిడుదు
మన తిమ్మరుసు బుద్ధిమత్త నీ వెఱుఁగవు
వాల్ పోలు చరితంబు వల్లెవైతు
నిన్ను నీ వెఱుంగ కెన్ని విధానంబు
లాశ్రయించి సర్వదాశ్రమించి
రొట్టె బన్నులకు నియ్యకోల్ సూపిన
లేదు లేదు ముక్తి లేదు నీకు.

పోతన్న కలము సొంపుల నెఱుంగకమున్నె
తులసీదాసుని కైతతోఁ బనేమి
బొబ్బిలి కథలోని దెబ్బ చూడకమున్నె
మేవాడ పతనంబు మెచ్చనేల
రాజశేఖర చరిత్రము పఠింపకమున్నె
రంగభూమికి జయారావమేల
పూదండ సౌరభంబులను బీల్వకమున్నె
సప్తసరోజకై శ్రమ మదేల
కోర్కెమై నొక్క భారతిం గొనకమున్నె
కొన్క లేటికి మాధురీ కరుణకొఱకు
పైత్య మెసకేఁగి కంటికి భ్రమలు గ్రమ్మ
దిక్కు తెలియక యున్నాఁడు తెలుఁగువాఁడు.

ఈ పై పద్యము లత్యధికాంధ్రాభిమానముతో రచింపబడినవి. భారత జాత్యభిమానమునకు తిలోదకములు వదల వలసినదేనా యను శంక పాఠకులకు గల్గునంతదాక నడిచిన వీ పద్యములు. కాని నిశితముగా నీ పద్యములను పరిశీలించి వీని తాత్పర్యములో సత్యమేమాత్రము లేదని యాత్మసాక్షిగా మనము చెప్పగలమా? ఎంతవఱకు మనము మన సంస్కృతిని, మన భాషను, మన వారిని నాదరించుచున్నామను ప్రశ్నలను మన మనసులలో పుట్టించుటకే కవిగారీ పద్యములను రచియించి యుండెనేమో. రాష్ట్ర గానా విర్భావ కారణములను ప్రకటించు కవి పల్కులను, నే నుదాహరించిన వానిని పరిశీలించినచో పాఠకులీ పద్యములను చదివి యాశ్చర్యపడ రనుకొందును. అదియునుగాక సీతారామమూర్తిగారు సంకుచిత దృక్పథము గలవారుగా కనరారు. "ఆంధ్రత్వము లేనివాఁడు కలఁడా మనకించుక యేని భారతీయత్వ" మనియే వారి వేదన. అదియునుగాక హిందీనిగూర్చి వ్రాయుచు.

వలదీ భాష యటంచు నే నుడివి దు
ర్వాదంబు గావింప ని

ప్పులకే భారతజాతికెల్ల నొక సం
బంధంబు సంధింపఁగాఁ
గల; దీచుట్టరికంబులేకయ కదా
గాసిల్లెడిన్ దాస్య శృం
ఖల కగ్గంపడి భారతావని తిర
స్కారాలవాలంబుగన్

అని చాటిరి. "సామాన్య సంభాషణల్ పొనరింపం దగునట్టు లేపడి పదంబుల్ చేర్చినన్ జాలున్" యని హిందీ కెంత ప్రాధాన్య మీవలెనో యుచితముగా చెప్పిరి. దీనినిబట్టి సీతారామమూర్తిగారికి దురాంధ్రాభిమానమును మన మంటగట్టగూడదు.

ఐనచో నీ పద్యములను వారెందులకు రచించినారు? కారణ మరయుదము. ఇరువది సంవత్సరముల నాటి యాంధ్రునిలో పరవిషయ వ్యామోహ మధికముగా నున్నట్లు కవిగారికి కన్పడినది. తెలుగువాడు వ్యామోహ ప్రవాహములోపడి కొట్టుకొని పోవుచున్నాడు. దీనిని కవిగారు కనులారచూచి సహింపలేక పోయిరి. తా నాంధ్రుడు గావున, ఆంధ్రుడనను నహంకారము తనలో నెక్కువగా నున్నది కావున, తా నాంధ్ర ప్రబోధము గావించుచున్నాడు గావున నవశ్య మీ దేశభాషా పతనమునుగూర్చి వ్రాయవలసిన యగత్యమెంతయైన యున్నదని సీతారామమూర్తిగారు తలంచిరి. స్వసంఘ సంస్కృతి ద్వేషులను చూచి సహింపనోపక యా వేదనా పూరితములగు కావ్యములను రచించిన కవులు దేశ దేశములలో నున్నారు. ఆ పనినే యీ కవిగారుకూడ చేసిరి. అందులకు మనము బాధపడరాదు. ఆత్మ పరిశీలనము గావించుకొనవలయును. ఆంధ్రత్వము సమసిపోయినవా డింత తీవ్రముగా వ్రాయుటలో వింతలేదు. లంకణములకు దిగవలయునన్న చికిత్స తీవ్రముగా జేయవలసి యుండును. రాష్ట్ర గానములో సీతారామమూర్తిగారి భావప్రకటన యీ ధోరణిలోనే చెల్లినది. ఆనా డింతగా వ్రాయుట యవసరమైనదేమో! ఇంత కఠినముగా పల్కిన సీతారామమూర్తిగారే "బాపూజీ—ఆత్మకథ"ను సంతరించినారన్నచో వారి పలుకులలోని యాథార్థ్యమును మనము గుర్తింపగలము. ఆంధ్రాభిమానమును జీవనమునందు ప్రతిభాగములోను ప్రదర్శింపవలయునన్న ప్రబోధముగల యీ ద్వితీయభాగమింతటితో పూర్తియైనది.

## 3

"ఆంధ్రుఁడనై మరణింపుమి
యాంధ్రత్వములేని బ్రతుకు నాసింపకుమీ"

యీ రెండును కందపద్యములో తృతీయ చతుర్థ పాదములు. ఆంధ్రునివలె మరణింపుమని, యాంధ్రత్వములేని బ్రతుకు నాశింపవలదని సీతారామమూర్తిగారాంధ్రులకు సందేశమిచ్చిరి.

ఆనాటి కాంధ్రుడుగా మరణించుట యెట్లు? ఆంధ్రత్వములేని బ్రతుకు నాసింపకుండుట యెట్లు? అను నీ రెండు ప్రశ్నలకు మన మొసగు సమాధానములోనే యాంధ్ర రాష్ట్రోద్యమ చరిత్రయంతయు నిమిడి యున్నది. ఆ యాంధ్రోద్యమముతోబాటు సీతారామమూర్తిగారుకూడ ప్రయాణముచేసినారని, తదుద్యమమునుగూర్చి తమకు తోచిన యభిప్రాయములను స్పష్టముగా ప్రకటించినారని మునుపే నేను చెప్పితిని. ఏతత్సంబంధమైన యభిప్రాయ ప్రకటనయే రాష్ట్రగానములో తృతీయభాగముగా రూపొందినది.

ఆంధ్రుడుగా మరణింపవలయునన్న ఆంధ్రదేశములో పుట్టిపెరిగి మరణింపవలయును. ఆంధ్రత్వములేని బ్రతుకు వాంఛింపకుండవలెనన్న ప్రత్యేకాంధ్ర రాష్ట్రమును సాధింపవలయును. ఆ ప్రత్యేక రాష్ట్రములో బ్రదికినదే బ్రతుకు. కానిచో నా బ్రదుకు మరణముతో సమానమే. ఈ భావమునంతయు ఆ చిన్న కందపద్యపాదములలో సీతారామమూర్తిగారు ధ్వనిపూర్వకముగా చెప్పినారు.

1913 నుండి యాంధ్రులు రాష్ట్రసంపాదనమునకు ప్రయత్నించుచున్నను ఎప్పటికప్పుడు వారిలో నున్న దోషములు, ఇతరుల కుతంత్రములు ప్రత్యేకాంధ్ర రాష్ట్రావతరణమును వెనుకకు నెట్టినవి. తెలుగువారికంటె వెనుక ప్రయత్నములుచేసినను సింధుదేశీయులు, ఓఢ్రులు తమతమ రాష్ట్రముల నేర్పరచికొనిరి. రాష్ట్రవాంఛను దిక్కదంబ మగలునట్లు చాటుచున్న యాంధ్రుల ప్రయత్నములు వ్యర్థములగుటకుగల కారణములను సీతారామమూర్తిగారు పరిశోధించిరి. ఆంధ్రునిలో నాంధ్రత్వము లేకపోవుట, యాంధ్రజాతిలో విపరీత లక్షణములు కన్పడుట మున్నగునవి రాష్ట్రావతరణమునకు ప్రబల నిరోధకములని యీ కవిగారు సారాంశము తేల్చిరి. ఆ నాటి యాంధ్రజాతి యీ

కవిగారి భావనలో నెట్లు సాక్షాత్కరించినదో చూడుడు :

పరదేశభాషా సపర్యా తారకమూట
నాంధ్రత్వమే సగం బడఁగిపోయె
పరభుక్తమునకు లోపడి జోహారులువెట్ట
స్వాతంత్ర్య సముపేక్ష జాఱిపోయె
కులతత్త్వములు చుట్టుకొని యార్వేలకుదింప
నైకమత్యము సర్వమాఱిపోయె
అసమర్థతాపంకమందు బ్రుంగుటఁజేసి
మెట్టవేదాంతముల్ మిగిలిపోయె
నలఁగిపోయిన యీనాఁటి తెలుఁగుబిడ్డ
కేమి సందేశమిత్తు తల్లీ ! తమస్సు
విరుచుచున్నది యిప్పుడిప్పుడె రవంత
ఉద్ధరింపును నీని సద్బుద్ధులొసఁగి.

అనైకమత్య మాంధ్రులలో విరాట్రూపము ధరించినది. దానిమూలముననే యాంధ్రుల కఖిలభారతమందు నాటికి నేటికి వన్నెవాసి లేకుండ పోయినవి. కులభేదములకులోనై తెలుగుబిడ్డ తనవానిని గౌరవించుట నేర్చుకొనలేదు. అతఁడు పెత్తనములను పట్టినాడు. తెలుగువారిలోనే కొందఱు తెలుగురాష్ట్రము నెన, తెలుగుబాసయెన సవతితల్లివలపు ప్రకటించిరి. తెలుగువారి మనుగడ నవ్వులపాలయినది. సీతారామమూర్తిగారీ శోచనీయస్థితి చూచినారు. తమ హృదయములోని బాధను స్పష్టముగా ప్రకటించినారు.

వైదికులన్నచో మెంగను
నాడ్చునొకండు నియోగిభోగముల్
ఛేదముగూర్చు నొక్కనికి
గిట్టదు గిట్టదు కమ్మవారి భా
గోదయమన్నఁ గొందఱకు
నోర్వరు రెడ్లయశంబొకింక స
మ్మోదమునీదు కాఁపుల స
మున్నతి యొక్కని కేమిపాపమో!

ఇది తగదనిచెప్పుచు సీతారామమూర్తిగారు జాతికిచ్చిన సందేశమును వినుడు.

వచ్చెను బుద్ధివచ్చె నిక వద్దిఁక
వద్దిటువంటి జీవితం
బెచ్చట నార్జవంబు కల దచ్చట
సౌఖ్యము తాండవించు నిం
కెచ్చటఁ బ్రజ్ఞ వెల్గు మరి
యచ్చట నొప్పు నుదార దర్శనం
బచ్చట నచ్చుగొట్టక జోహారులు
వెట్టుఁడు తెల్గుసోదరుల్.

ఆంధ్ర రాష్ట్రోద్యమమున కాంగ్రెస మహాసభ యాలంబనమై నిలిచినది. ఆనాటి మేధావులందరా యాంధ్రమహాసభల కధ్యక్షులై తెలుగువారి కోర్కెని చాటుటలో కృతకృత్యులైరి. కాలక్రమమున నా పెద్దలందఱు దివంగతులయిరి. రాష్ట్రోద్యమమునకు తీవ్రాఘాతములు కల్గినవి. దివంగతులయిన యాంధ్ర మహాసభాధ్యక్షులకు తెలుగుతల్లి దీనావస్థను జూచిన వారికి స్వర్గము నరకముతో సమానముగా నుండునని సీతారామమూర్తిగారి యభిప్రాయము. ఈ క్రింది పద్యమును చూడుడు

మున్నింకెన్నా డొక్కనాఁ డని పానుగల్
విభుఁడు రంభతోపసందు వీడి యమ్మ
సురఁ డెంతగా వేఁడుకొన్నను గోష్ఠికై
తలయూఁచె నొక్కొ వేదను బున్నుఁడు
విసముకాదా సుధారసధార మోచర్ల
రామచంద్రున కాంధ్రరాష్ట్ర రవికి
కారింపఁజే నందనారామ సుమబంధు
వనిలంబు నెమిలి పట్టాభిరాము
గాంగవాఃకణ మంగారకణము గాఁగఁ
జేకునంబనఁడో నరసింహశర్మ
తల్లి సంకెలలోఁ దల్లడిల్లు వేళ
నాకమైనను నరకంబు గాకయున్నె ?

"ప్రబోధము"నందలి పద్యములన్నియు నీరసంపడిన తెలుగులకు నవనవోన్మేషము సంధించుటకే వ్రాయబడినట్లున్నవి.

రాష్ట్రగానములో "పశ్చిమాంధ్రు"లను నొక ఘట్టముకలదు. పశ్చిమాంధ్రులు తమ భూభాగమునే రాయలసీమయన్నపుడును, సాగరాంధ్రులపై శంకకొలది యాదోనిలో సమావేశమై ప్రత్యేక రాష్ట్రవాంఛ వెలిబుచ్చినపుడును సీతారామమూర్తిగారీ పద్యములను రచించిరి. రాష్ట్రగానములో తీక్ష్ణదృష్టితో రచించిన భాగములలో నిది ప్రథమశ్రేణికి చెందును. వారికి దత్తమండలములనే రాయలసీమగా పేర్కొనుట యిష్టములేదు. దానికి కారణములును లేకపోలేదు. త్రిలింగక్ష్మా పీఠములంతట మూరురాయరగండను కృష్ణ

రాయలవారి పలుకు చెల్లినది. అట్టిసమయములో త్రిలింగ దేశమునందలి యేకభాగమునే రాయలసీమయని వ్యవహరించుట తగదని, యట్లు వ్యవహరించినచో రాయలవారికి సిగ్గుకల్గునని సీతారామమూర్తిగారు చాటినారు.

కటకంబాదిగ సింహాచలంబువఱకే
  కన్యాత్రతమై సత్కృతి
స్ఫుటవాణీ పరిగీతమై పరనృప
  భ్రూభంగ సంపాదియై
పటుకీర్తిం గనినట్టి రాజ్యముగదా
  పాలించె రాయండు, మీ
నటనల్ కన్గొని పల్లటిల్లియతఁడ
  న్నా! సిగ్గునన్ గ్రుంగఁడే!

ఇఁక సాగరాంధ్రులపై రాయలసీమవారికి ననుమానములు వలదని వ్రాసిన పద్యములన్నియు సోపపత్తికములుగా, నైకమత్య ప్రబోధకములుగా నున్నవి. వానినెల్ల నుదాహరించుటకిది తావుగాదు; సమయము గాదు. మనమే చదువుకొని యానందింపవలయును. ఐనను ఈ క్రిందిపద్యము నుదాహరింపకుండ జాలను.

మాకున్ మీకును లేవు భేదములు మా
  మాటల్ యదార్థంబులే
కాకున్నన్ దివదారిఁ దాఁజనక రం
  గద్భంగ హస్తాళితో
మా కృష్ణమ్మను గౌఁగిలించుకొనునే
  మన్నించునే తుంగభ
ద్రాకూలంకష మీ సరస్వతి నితాం
  తస్నేహ సంపన్నయై

"బులుసు సాంబమూర్తిగారు 1937 లో ఆంధ్ర రాష్ట్రముపట్ల సుముఖత చూపరైరి. కాని 1939 లో మరల నాంధ్రోద్యమమునకుఁ దోడ్పడిరి" ఆంధ్రులు సాంబమూర్తిగారి సహార్థము సేసికొనుట "ప్రమాదము" అని సీతారామమూర్తిగారు హెచ్చరించిరి.

అటు సుతుఁబూన్చి పెట్టె నిటు
  లందుకొనెన్ భరతోర్వి శృంఖలా
పటల విపాటన క్రియలు;
  బాపురె! దంపె శితశుతాంగుఁడై
జోటజోట నెత్తు రోడినను
  శూరతఁ బాయఁడు సాంబమూర్తి, నీ
కెటులతఁ డెగ్గుసేయు జన
  నీ! వినఁజాలని వాదు లేర్చెడెన్.

"ఆంధ్రరాష్ట్రము నంగీకరింపుఁడని మన వారు కాంగ్రెసు పెద్దల కడకు రాయబారము నడుపఁగా వారు మన కోరికను తృణీకరించిరి." సీతారామమూర్తి గారికి కనుపు మండినది. ఎంత తీవ్రముగా పద్యములను రచించినారో చూచినారా?

వీటికో దిక్కుమాలిన యీ జోహార్లు
దినికో సిగ్గులేని యీ దెవురింపు
లేలొకో రాయబారముల్ వేలమొగము
లెందులకొ రాష్ట్రలబ్ధికై యింత రగడ?

ఎవ్వఁడాదాత మనరాష్ట్రమిచ్చి పంప
నరము లిక నెవ్వఁడా లోకవల్లభుండు
యాచనాదైన్య మెఱుఁగని యాంధ్రజాతి
యింత దిగజారునే యెంత వింతపుట్టె!

ఎండమావుల వెంటఁ బరువెత్తనేల
మేఁక మెడచంటి పాటికి మెప్పనేల
యరసి యాత్మావలోకన మాచరింపుఁ
డదిగో! మన ముక్తి మనచేతియందె కలదు.

విశ్వరూపమ్ముఁ జూపించు వేళలందు
జిన్నవోవుట లోకమ్ము మెచ్చఁబోదు
వినయమది యెంత సేవ్యమై వెలయుఁగాక
తలబిరుసువారి మన్నింపఁ దగదు తగదు.

అటులనే సుభాసు బాబాంధ్ర రాష్ట్రవాంఛను తిరస్కరించినప్పుడు కొన్ని పద్యములను రచించిరి. ఆనాటి సీతారామమూర్తిగారి యావేశము కాంగ్రెసు పెద్దలనే పరిత్యజింపవలయు నన్నంత వఱకు పోయినది. ఈ క్రింది పద్యమును జూడుడు.

వాసిగలట్టి నీకుఁ దల
  వంపులుగూర్చెడు శాసనమ్ములన్
జేసెడు పెద్దలన్ విడువఁ
  జెల్లదె నీకుతు? — లిందు లేశమున్
దోసము రాదు సంశయము
  తోఁ బనిలేదు నభఃప్రసూనముల్
వాసన పంచునాఁడు మన
  వైభవ మేర్పడు నట్టె! వింటివే.

ఈ విధముగా నాంధ్ర రాష్ట్రోద్యమమున కాఘాతములు గల్గించిన యాంధ్రేతరులనే గాదు సీతారామమూర్తిగారు విమర్శించినది. తెలుగు జాతియెడ, తెలుగుబాసయెడ విముఖత చూపిన తెలుగువారు సైతము వీరి కఠినవిమర్శకు లోనైరి.

ఒక "యంత్రబ్రహ్మ" తెలుంగు రాష్ట్రమున కే
  దో "కుంభకోణంబు" పేఁ
టకునై మొగ్గర మొడ్డినాఁడని మహో
  దగ్ర క్రుధా విభ్రమన్
భ్రుకుటిం జూపఁగ నేల గ్రుడ్లురిమి గం
  తుల్ వెట్టఁగా నేల కా
ర్య కళాభిజ్ఞుల కేల పిచ్చుకపయిన్
  బ్రహ్మాస్త్ర సంధానముల్.

మన దేవయ్య మఱొక్కరుండు "తెనుఁగే
  మాటాడరా" యన్న నా
పనమున్ మెచ్చె నిఁకొక్క భైరవుఁడు ల
  జ్జా త్యాగ పారీణుఁడై
"తెనుఁగుం జాతికి రాష్ట్రమేటి" కని ధిగ్
  ధిగ్గావముల్ పల్కెఁ బ
ల్చని కూటమ్మున; చెప్పటం గలరు దే
  శద్రోహు లేతాదృశుల్.

ఈ రీతిగా పరిస్థితి "అయోమయము అంకమ్మ జాతర"గా నున్నను సీతారామ మూర్తిగారట్టి వ్యతిరేకులను పరిగణింప వలదనియు, నుద్యమము తీవ్రముగా కొనసాగింపవలయు ననియు నాంధ్రజాతికి సందేశ మిచ్చిరి.

శకమున్ నిల్పిన జాతి, మాతృజగతీ
  సమ్మాన సంపత్తికై
సకలం బిచ్చినజాతి, కీర్తిలహరీ
  స్నాన ప్రియుల్ మూఁడు కో
ట్ల కుమారుల్ గలజాతి, వీరిఁగని కం
  టన్ నిప్పులన్ నీరమున్
బ్రకటింపం బనియేమి కేవల తృణ
  ప్రాయుల్ గదా తాదృశుల్.

ఆంధ్రులు చెన్నపట్టణమునకై సల్పిన కృషి యాంధ్రోద్యమమందునొకభాగముగానున్నది. తమిళులు గూడ నాంధ్రోద్యమములో తెలుగువారితోపాటు సంబంధము పెట్టికొనిరి. కాని యాంధ్రోద్యమముపై నెయ్యము నూపుటలో తమిళులలక్ష్య మాంధ్రుల లక్ష్యముకంటె సర్వథా భిన్నముగానున్నది. మద్రాసు నాంధ్రులకు దక్కనీరాదని, వీలయిన తదితరాంధ్ర భాగములు కలుపుకొనవలెనని తమిళులు ప్రయత్నము సేసి కృతకృత్యులయిరి. చెన్నపట్టణము తెలుగువారిది కాదని వారు చాటిరి. ఆనాడు సీతారామమూర్తిగారి కలము విశ్వరూపము ధరించినది. తత్ఫలితముగా "అలివలు" అనుఘట్టమును రాష్ట్రగానములో పాడిరి. "పశ్చిమాంధ్రము" లను భాగమువలెనే యీఘట్టముగూడ తీవ్రముగా నడిచినది. సీతారామమూర్తిగారు మద్రాసు ఆంధ్రులదని యనేక చారిత్రోపపత్తులను చూపిరి. అదియేగాదు. ఆంధ్రుల ప్రాభవమునకు గుర్తులుగా తమిళుల వివాహసంప్రదాయము లున్నవని సీతారామమూర్తిగారి యభిప్రాయము. ఈ క్రింది పద్యమును చూడుడు.

ఎఱుఁగుదురా? మీ రాంధ్రుల
గరిమమ్మున కానవాలుగా నిటఁ బెండ్లిన్
దురగము నెక్కమి, పందిరి
సరిగుంజల నిల్పు సాహసము నేర్పమియున్.

ఈఘట్టములో తమిళాంధ్ర సంబంధములను తడవిరి. తమిళులకు సంస్కృతిభిక్ష పెట్టిన పల్లవు లాంధ్రనృపాలురని నొక్కి వక్కాణించిరి. పౌరుష మన్నది యొక్క తమిళులసొత్తుగాదని హుంకరించిరి.

రాజకులావతంస మప
  రాజిత శౌర్య కళావిభాసి మా
రాజనరేంద్ర భూవరపు
  రాకృత పుణ్యఫలంబు కంచిలో
రాజులు మెచ్చఁగాఁ దమిళ
  రాజ్యము నేలఁగ లేద చోళులే
రాజులుగారు పాండ్యులె ప
  రాక్రమశీలురుగారు కొరయా.

తిరుపతి, సింహపురిమండలములను ద్రావిడములని తమిళులు చాటినపుడు సీతారామమూర్తిగారు ధిక్కారముగా కవిత్వము వ్రాసి వారికి జవాబు లొసగిరి. "ఆంధ్రకేసరి పైబడి నదిరిపోవఁ దుపాకి కెదురుగా నిలచి రొమ్మిచ్చినాఁడు........రంగయ్యనాయఁ డారంభించి శాసనధిక్కారకరము సంధించునాఁడు, దుర్గ బందాన మా దుర్గమ్మ చెలరేఁగి శాంతిసంగ్రామంబు జరుపునాఁడు" మద్రాసుమాదను తమిళులార మీరెచ్చట నున్నారని సీతారామమూర్తిగా రెదురుప్రశ్న వైచిరి. నాటికి నేటికి వారి యీ ప్రశ్నకు సమాధానము లభింపలేదు సరికదా మద్రాసు తమిళుల కైవసమయినది.

ఈఘట్టమునందు సీతారామమూర్తిగారి సునిశిత హాస్యము ప్రతిబింబించినది. హాస్యమునకు మూలము హేళనమని విమర్శకుల యభిప్రాయము. ఆ హేళన

మీ క్రిందిపద్యద్వయములో నిండుగా నున్నది. పరికింపుడు.

వేఱేమి లేదు లేదు మము
        వేలుగఁజూడకుఁ డచ్చమైన మీ
కూరిమి పేరిమిం బసయఁ
        గోరిన తమ్ములమేము; మిమ్ములన్
దూఱిన మాకు నిద్దెనలు
        దోసెలు తైర్వెడ లుప్పుమావు సాం
బారు నొసంగి యింకెవరు
        పండువుసేయఁగ జేర్తు రక్కటా!

తరుణుల మోవి తేనియలు
        త్రావకపోయిన నేమి స్వర్గమం
బరిచితిగూర్చు సోమరస
        పానముసేయకయున్న నేమి మా
కరుణగభస్తి బింబ ముద
        యాచల మెక్కకమున్నె వెచ్చనై
గరగరలైన కాఫి యొక
        కప్పిదిగో యని యయ్యరిచ్చినన్.

అనాంధ్రనాయకులలో నొకరు తెలుగువా రసమర్థులని వెక్కిరించినారు. 1939 లో రాష్ట్ర కాంగ్రెసున కధ్యక్షులుగానున్న పట్టాభిగారా యనాంధ్రనాయకుని సునిశితమయిన హెచ్చరికలో గౌరవించిరి. దానికి సీతారామమూర్తిగారు పొంగిపోయి "పట్టాభికి జే" యని వాలుగు పద్యములను రచించిరి. కాలము శరవేగముతో నడుచుచున్నది. తెలుగువా రెన్ని ప్రయత్నములు చేసినను ఆంధ్ర రాష్ట్రము విడివడలేదు. భారతదేశమునకు స్వాతంత్ర్యము 1947 ఆగస్టు 15 నాడు సిద్ధించినది.

1948 సంవత్సరములో నుత్తరార్ధ మంతమగుచున్నది. ఆంధ్రలో నొక ఖండమగు తెలంగాణము నైజాము దాస్యమునుండి విముక్తిపొందినది. పట్టాభిగారు కాంగ్రెసున కధ్యక్షులై సర్వుల ప్రశంసల నందికొనిరి. సీతారామమూర్తిగా రీ విషయములను మఱచిపోలేదు. విజయవాడ ఆకాశవాణీ కేంద్రము ప్రారంభమయిననాడు జరిగిన కవి సమ్మేళనములో నీ కవిగా రేమని పాడిరో వినుడు:

రుద్రమాదేవి పౌరుష పతాకల నీడ
        సొంపు పెంపులుగన్న శూరసీమ
పోతనార్యుని క్రొత్తపూఁదేనెకైతతో
        నుడివోని కైవల్యమిడిన పొలము
సర్వజ్ఞ సింగమ విశ్వనాథ నైదుషీ
        వల్లికల్ కుసుమించి వలచు తోట
జగ మెఱింగిన బౌద్ధశైవ శిల్ప మహస్సు
        పొంగి పొర్లెడు కళాభోగభూమి
కోటిమంది బిడ్డలు నిండుకొన్న గీము
మన తెలంగాణ మీనాఁడు మల్ల పఱచి
తరతరంబుల దాస్య బంధములఁ ద్రెంచి
కులుకుచున్నది కంటివే తెలుఁగుతల్లి.

ఒడ్డె మాగాణముచఁ జిక్కువడ్డ కొడుకు
బెంగతో బెంగటూరఁ గన్పించు పాప
చేరుచున్నారు నీ పాలి మేరలోన
నీకు నింకేమి కలదు తల్లీ! కొఱంత!

అనవద్య ప్రతిభా సముజ్జ్వలుని దే.
        శారాధక గ్రామణిన్
మన పట్టాభిని విశ్వభారతము స
        మ్మానించెఁ; జేర్గన్న నీ
తనయుల్ నేఁడు పరస్పరాదర సము
        ద్రస్నాన సంశుద్ధులై
తెమఁ గల్లం బులకింపఁజేసిరి సవి
        త్రీ! క్రొత్త సంక్రాంతితోన్.

తెలంగాణము విముక్తితో సీతారామమూర్తిగారు పొంగిపోయి తెలుగుతల్లికి "రథోత్సవము" జరుపనెంచి యఖిలాంధ్రదేశమున కాహ్వానములు పంపిరి. ఆ రథమును లాగుటకు తెలుగువారిని "రండు రండు" అని కేకలు వైచిరి. ఆ తెలుగుతల్లి రథము సీతారామమూర్తిగారికి జగన్నాథుని రథము వంటిది. దాని క్రింద పడి మరణించిన యాంధ్రులు స్వర్గసుఖములు పొందగలరని సీతారామమూర్తిగారి యూహ. ఈ క్రింది పద్యమును పరికింపుడు.

ఆ రథ నేమి ఘట్టనల
        కగ్గములై మన హేమ కాయముల్
తీఱినఁ దీఱుఁగాక! చను
        దెంచు విచారము లేల మాతృ సే
వా రమణీయ వృత్తమున
        వందురి సచ్చినవారి జాహ్నవీ
తీరమునందు భోగములఁ
        దేల్తురు వెన్నెలరేల వచ్చరల్.

ఈ రథోత్సవములోనే యీ క్రింది "ఆశీస్సు"

పలికి, తన "ఆకాంక్ష" వెల్లడించి సీతారామమూర్తి గారు రాష్ట్రగానమునకు భరతవాక్యము పాడిరి.

ఆచక్రవాళమ్ము నాంధ్ర జాతీయతా
మధుర సౌరభ్యముల్ మలయుఁగాక
బిగువెక్కు నేల నాలుగుచెఱంగులయందుఁ
దెలుఁగు రాచటెక్కెంబు వెలయుఁగాత
లక్ష్మీ సరస్వతీ లలనా నివాసమై
యాంధ్రదేశమ్ము పేరందు గాత
విశ్వమోహన కళావీథియై త్రైలింగ
శిల్ప విన్యాసంబు చెలఁగుఁగాత
రసిక లోకమ్ము నీకు విందు లొసఁగి పొసఁగి
దేశికవితా లతాంగి వర్ధిల్లుఁగాత
తెనుఁగు జనయిత్రి పచ్చతోరణముతోడ
నిత్య కల్యాణరాశియై నెగడుఁగాత!

ఇంతటితో రాష్ట్రగానము పూర్తియైనది. ఈ విధముగా నీ కావ్యము పురాతనాంధ్ర వైభవ ప్రశంస, ఆంధ్రాభిమాన ప్రబోధము, ఆంధ్రోద్యమ చరిత్ర గానము అను గంగా యమునా సరస్వతులకు కూడలియై త్రివేణీ సంగమమైనది. రాష్ట్రగానములో నే పుట త్రిప్పినను సీతారామమూర్తిగారి యాకాంక్ష ప్రత్యక్షరములో ప్రత్యక్షమగును. తాను తన భావనా వీథిలో నూహించికొన్న సమగ్రాంధ్ర రాష్ట్ర స్వరూపమున కక్షరరూప మొసగుటయందు సీతారామమూర్తిగారు రాష్ట్రగానమును నిర్మించిరి.

సీతారామమూర్తి గారెంత శ్రమించినను వారు గన్న కలలు రాష్ట్రగాన సమాప్తినాటికి దివాస్వప్నము లయినవి. ప్రత్యేకాంధ్రరాష్ట్ర మింకను రాలేదు. ఆంధ్రరాష్ట్రోద్యమ ప్రయత్నముల బిగువు, వేడి, కాలాంతరములచే తగ్గిపోయినవి. అక్కడక్కడ తెలుగు మాగాణము కావలయునను చిలుగొంతుకలు వినిపించుచున్నవి. ఎప్పుడాంధ్రరాష్ట్ర మేర్పడునా యని కవిగారితోపాటు తెలుగువా డెదురు తెన్నులు చూచుచున్నాడు.

రాష్ట్రగాన విమర్శను ముగించుటకు ముందు రెండు ప్రశ్నలను చర్చింతును. గత గాథను వర్ణించు నీ కావ్యప్రయోజనమేమి? రాష్ట్రగానము రచించు

నాటికి కవిస్వరూప స్వభావములు, వ్యక్తిత్వ మెట్లున్నవి ?— యనునవియే యీ రెండు ప్రశ్నలు.

ఆంధ్రరాష్ట్రము సిద్ధించినది. తెలుగు పాలముల మధ్యనున్న గట్లు కూలిపోయినవి. ఆంధ్రు డాంధ్రుడుగా భారతదేశములో రాణించుచున్నాడు. ఇంక నీ కావ్యము వలన కలుగు మేలెయ్యది ?— యను ప్రశ్న రాష్ట్రగానమును చదివినవారి మనసులలో నుప్పతిల్లకమానదు. అట్టిప్రశ్న పాఠకులకు గల్గుట సహజము. మఱి యీ ప్రశ్నకు సమాధానము మనకు లభింపవలయును గదా ? లభించునని నా మనవి. ఈ కావ్యము సంపూర్ణముగా నాంధ్రరాష్ట్రమును గూర్చి చేసిన గానముతో నాద్యంతము నిండియున్నది. రాష్ట్రగానములో తెలుగువారి చరిత్ర, రాష్ట్రమునకై వారుపడిన పాటులు, చేసిన చేష్టలు రాష్ట్ర సంపాదనములో వారికి తారసిల్లిన యొడ్డారములు వర్ణింపబడినవి. అనగా నవ్యాంధ్ర రాష్ట్ర చరిత్ర దీనిలో గానముసేయబడిన దన్నమాట. రాష్ట్రోద్యమములో సారథ్యము వహించినవారికీ కావ్య మెట్లున్నను ముందుముందుతరములవారికి నాంధ్రరాష్ట్రమును గూర్చి యొక కవి యభినివేశముతో ఆంధ్రాభిమాన ప్రబోధకముగా నెట్లు గానముసేసెనో యాంధ్రోద్యమ మేయే మార్పాటులకు లోనగినదో జ్ఞప్తికి తెచ్చుకొనుటకు రాష్ట్రగానము తోడ్పడగలదు. ఆంధ్రప్రజలకు సంబంధించిన యితివృత్త మందు కలదు. కావున రాష్ట్రగానము ప్రజాకావ్యమనుచున్నది. సీతారామమూర్తిగారు ప్రజాకవి యనుచున్నారు. అదియునుగాక తెలుగువారు రాష్ట్రము సిద్ధించుటకు చేసిన ప్రయత్నములలో, నడిచిన నడతలలో తెలిసియో తెలియకయో కొన్ని పెడత్రోవలుపట్టిరి. అనా డాంధ్రత్వ మాపాదమస్తకము మూర్తీభవించిన యొక తెలుగు మానిసి యెంతగా వాపోయినాడో యీ కావ్యము వ్యక్తీకరించుచున్నది. ఆంధ్రులలో గూడుకట్టిన యనైకమత్యమెట్టి యనర్థములకు దారితీయునో రాష్ట్రగానము యథాతథముగా చిత్రించుచున్నది. మనము మన గతచరిత్రనుండి నీతిని నేర్చుకొని మనదోషముల కుచ్చాటనము సేయుటలో రాష్ట్రగానము చేయూతగా నిల్చునని నా మనవి. మొదటనే చెప్పినట్లు నవ్యాంధ్ర వాఙ్మయములో నూతనశాఖయగు జాతీయ కవిత్వమునకు రాష్ట్రగాన మొక చిహ్నముగా నుండును గూడ.

ఇక రెండవ ప్రశ్న. ఈనాటికి కవిస్వరూప స్వభావములు, వ్యక్తిత్వము లెట్లున్నవి ? సీతారామమూర్తిగారు "మనవి"లో చెప్పిన మాటలను మరియొకసారి చదువుడు. ఆయనకు నేను తెలుగువాడనను నహంకార మెక్కువగానున్నది. తెలుగువాడు తెలుగువానివలె జీవింపవలయునను నాకాంక్ష సీతారామమూర్తిగారికి మిక్కుటముగా కలదు. వేషభాషలలో నాచార వ్యవహారములలో తెలుగుదనము విడనాడుట నాయన సహింపడు. వారికి రాయలసీమ, సాగరాంధ్రము, తెలంగాణమన్న కృత్రిమ విభజనము కంటగింపుగా నుండును. ఆంధ్రుడొకడే ! అత డాంధ్రదేశీయుడని సీతారామమూర్తిగారి తలంపు. ఆంధ్రోద్యమమున కనాంధ్రులు అఘాతములు కల్గించిననా డీకవి తోకత్రొక్కిన త్రాచయ్యెను. ఆంధ్రజాతిలోని గుణదోషములను సీతారామమూర్తిగారు ప్రకటించి ప్రశంసింతురు. కఠినముగా విమర్శింతురు. దోషములయెడ నాదృతి మాపు తనవారినిగాని, యితరులనుగాని యీ కవిగారు గారవింపరు. ఆంధ్రత్వము నెంత కొనియాడినను భారతీయత్వము నీ కవిగారు మఱచిపోలేదు. ఆంధ్రు డాంధ్రరాష్ట్రముకొఱకు యత్నములు సలుపుటకుముందు తనకు తెలుగుదనము పాటింపవలయుననియే సీతారామమూర్తిగారి యావేదనము.

# ముద్దబంతి

శ్రీ బోయి భీమన్న

నవ నవోత్ఫుల్ల బాల కైరవ సమాజ
మింక తనొల్లదని — శరద్వృద్ధు డెంద
మగిలి హిమతమి జెంది — పౌషాంగణమున
పూచె ననుకొందు బంతి పువ్వులుగ నిట్లు.

శరదవసాన సంధ్య తమిజార్చిన కోర్కెల మూర్తులివ్వి; మి
ణ్గురులుగ వ్రాలి, చెందొవల గుండెలు త్రావి, విభాత వేళ కే
మెరుగ నటుల్ వసించు, వికసించు, రచించు వధూ విభూతులన్;
తరుగని శోభ లివ్వి, సరదాల రథాలివి, ముద్ద బంతులే!

ఈ పిన్న బంతి చెట్టు మ
హా పెరిగిన సందెడే; అనంతముఖాలన్
పూ పడగలు విడిగి జగ
ద్వ్యాపారము నడుపు శత సహస్ర ప్రభలన్.

ఇల వాసంతికి లేదు, జాతికిని లే దీపాటి సౌభాగ్య; మే
యుల రేనిన్ నిజ వర్ణ వాసనల బుయ్యారమ్ములో వాడి వ
త్తలగున్; జీవన మాధురీ కృషికి సద్యస్స్ఫూర్తిగా బంతి — గొ
బ్బిళులన్, గుమ్మములన్, శిరమ్ములను దీప్తిం జెందు నూత్నాంశలన్.

వేయి కాల సర్పముల గుప్పిటను బట్టి
పడగ లెత్తించి ఆడించు బంతి కొమ్మ;
బీజమై కాలమే హృదబ్ధిని శయింప,
బంతి పహరా నిలుచు ద్వార బంధమందు.

చెలిమిని తమ్మి కళ్లు వికసింపగ జేసిన నిండు మోము జా
బిలి నలరింపగా పడగవిప్పిన పెంజెడత్రాచు మేనికిన్
చెలువము కూర్చు బంతులనుచిక్కగ గుండెల కద్దు కొన్న దే
కలిమి; అతండెపో రతికికాంతుడు, కాంతు డనంత సృష్టికిన్.

# కొన్ని ప్రయోగాల పరిశీలనము

శ్రీ నిడుదవోలు వేంకటరావు

ఇటీవల వెలువడిన యాంధ్రభాషా లక్షణ గ్రంథములలో నాంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వ మొక యుద్గ్రంథము.1 ఇది పందొమ్మిదివందల డెబ్బది నాలుగు పుటలలో రెండు భాగములుగా విభక్తమైనది. సర్వస్వము అను పేరు ననుసరించి యీ గ్రంథమున నాంధ్రభాషా వ్యాకరణము లన్నింటియొక్క సమగ్ర సమన్వయ పరిశీలన ముండుననను నభిప్రాయము విద్వల్లోకమునకు గలుగవచ్చును. కాని ఇది యట్లుగాక, ఆంధ్రభాషా వ్యాకరణములలో నర్వాచీనమును, పందొమ్మిదవ శతాబ్ది ప్రథమార్ధమున వెలసినదియు, పరవస్తు చిన్నయసూరి ప్రణీతమునగు బాలవ్యాకరణమునకు విపుల వ్యాఖ్యానగ్రంథము. ఇందు చిన్నయసూరి తన వ్యాకరణమున నిచ్చిన భాషాలక్షణములకు, లక్ష్యములకు ప్రయోగములు ప్రదర్శింపబడియున్నవి. 'ప్రయోగమూలమ్ వ్యాకరణమ్' అనుసూక్తి ననుసరించి గ్రంథకర్త యీ గ్రంథమున కవి ప్రయోగములను, ప్రతిలక్ష్యమునకు దాపుటకుఁ బ్రయత్నించిరనుటలో సందేహము లేదు. కాని వానినిగూర్చి వివరింపునపుడు, పలుచోట్ల—'ప్రాచీన కవిప్రయోగము లభింపలేదు', 'ఏకోశమందును లేదు', 'కవి ప్రయోగ మగపడదు', 'భారతమున గన్పట్టదు', 'మచ్చునకైన గానరాదు' అని యుద్ఘాటించుటచేత, నట్టి ప్రయోగముల పరిశీలనము నే డావశ్యక మైనది. ఈ వ్యాసమున నట్టి ప్రయోగములు కతిపయము మాత్రమే ప్రదర్శింపబడినవి.

## కల్హారము

కల్హారము: (ఆం. వ్యా. సం. స. పుట ౫౧. సంజ్ఞాసూత్రము.) "కొన్ని సంస్కృత శబ్దముల విషయమున గ్రంథకర్తలును భ్రాంతులగుచు నూతన శబ్దములను భాషలోఁ జొనుపుచున్నారు. శబ్దస్తోమ మహానిధి: పత్తన=పట్టణ, కహ్లార. శబ్దార్థచింతామణి: పత్తన=పట్టణ, కహ్లార. లింగాభట్టీయము: పత్తన=పట్టణ, కహ్లార. శబ్దరత్నాకరము: పత్తన=పట్టణ, కల్హార." అని కలదు. దీనిపైవ్యాఖ్య:

"కే జలే హ్లాదతే కహ్లారం - అని వ్యుత్పత్తి. జలమందు సంతోషించునది. ఇంచుక యెఱుపును, పరిమళమును గలిగియుండు కలువ అని యర్థము. సంస్కృతమున బ్రహ్మ, చిహ్నము, కహ్లారము, పూర్వాహ్ణము, జిహ్వ మున్నగు పదములయందలి సంయోగములోని హకారము మొదటిదియైనను నుచ్చారణమున రెండవదిగా వినబడుచున్నది. అట్టి ఉచ్చారణ వికృతియున్నను తెనుగున నివి తత్సమములుగా బరిగణితములు. ప్రాకృతభాషలో నిట్టి పదములను తద్భవములుగా నెన్నుదురు. 'హ్న, హ్ల, హ్మాషు నలమాం స్థితి రూర్ధ్వమ్" అని ప్రాకృతప్రకాశము (3-8) చెప్పుచున్నది. దీనినిబట్టి మాచిన తెనుగున తత్సమములో 'కహ్లారము' అను రూపమే యుండవలయునని స్పష్టమగుచున్నది."

కాని ప్రాకృతమంజరిలో పై పదములయొక్క యుచ్చారణమునుగూర్చి యిట్లు గలదు.

"వహ్నిర్వహ్నీ తి కహ్లారం కల్హార మభిధీయతే,
బ్రహ్మ బమ్హా మత స్తేషాం స్థితి రూర్ధ్వ మితీదృశీ."

దీనినిబట్టి కహ్లారమునకు 'కల్హారము' అను రూపాంతరమున్నదని యేర్పడుచున్నది. కహ్లారము యొక్క రూపాంతరమే కల్హారము కాబట్టి 'కల్హారము'ను తెనుఁగున తత్సమముగానే పరిగణితమైనది. ఇఁక 'కహ్లారము' అను పదముకంటె 'కల్హారము' అను పదమునకే ప్రయోగములు హెచ్చుగా కానవచ్చుచున్నవి. (1) తాళ్ళపాక పెదతిరుమలయ్యగారు (తాళ్ళపాక అన్నమాచార్యుల తనయులు క్రి. శ.

1. గ్రంథకర్తలు కళాప్రపూర్ణ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులవారు. ఈ గ్రంథ మాంధ్ర సర్వకళా పరిషత్తువారిచేఁ బ్రకటితము (1951-52). ఆం. వ్యా. సం. స. అని సంక్షిప్తరూపము.

(1550) తమ చక్రవాళ మంజరియందును, సుదర్శన రగడయందును 'కల్హార' మని వ్రాసియున్నారు.

చక్ర-మంజరి: "మిసిమిగొండలు తమమీఁదికల్హార
హారముల్ ధరియించి యంబువుల్ చల్లి"

చక్రవాళమంజరి యందలి నియమము ననుసరించి యీ శబ్దము 'కల్హార' అనియే యుండవలెను గాని 'కహ్లార' అని యుండరాదు. ముక్తపదగ్రస్తము చక్రవాళమంజరి ద్విపదయందు చివర పదమున్యమున సంయుక్తాక్షరములలోఁ గ్రిందనే హల్లుండిన, దాని తోడనే తరువాతి పాదము మొదలిడవలెను. ఈ నియమమున కా చక్రవాళమంజరియందే యుదాహరణము చూపెదను.

గంధహీమాంబు పంకరుహ కహ్వార
హ్వార శైత్యముతోడఁ బొసఁగఁబువ్వాడులు.

పై యుదాహరణలో 'కహ్వార' శబ్దములో సంయుక్తాక్షరము 'హ' కారము. కావుననే తిరిగి పాదము మొదలిడినప్పుడు 'హ్వార' అని మొదలిడెను. ఆ రీతిగానే, కల్హారలోని హారశబ్దముతో రెండవపాదము ప్రారంభించినది. అట్టిచో 'కహ్లా' అను రూపముండుట కవకాశమే లేదుకదా!

ఇట్లే సుదర్శన రగడయందును 'కల్హార' శబ్ద ముపయుక్తమైనది.

2 కల్హారమాలికాంతరము చక్రము.
పిల్హాధామ సంశ్లిష్టము చక్రము.

ఇంతికన్నను స్పష్టముగా ప్రాసయందున్న ప్రయోగముల నుదాహరించుచున్నాను.

క. బల్హాయిచోచునట్టి రెు
డిల్హాయలైనట్టి నిల్కడల్ గనుగొన్నన్
మేల్హా దంటే నిఖాబుగ
కల్హారమరందమట్లు కల్కికిఁ బల్కుల్.

కవిజనోజ్జీవని. 78 ప. కోటి రఘునాథ భూపాలుఁడు. (పుదుకోట రాజు)

క. బిల్హణకవీంద్రుఁ డెవరా
ల్కల్హార ప్రియసుధా నికరములు నీ భా
షల్హర్ష మొదవఁజేసెను
బల్హితముగ నీ కభీష్ట ఫలమొసరించున్.

యామినీ పూర్ణ తిలకా విలాసము. శెల్లపిల్లనరసకవి ద్వితీయాశ్వాసము. 34 పుట. 1904 ముద్రణము.

కల్హారము అనుపదము చాల ప్రాచీన కాలము నాఁటికే 'కలుహారము' రూపము నందినది. క్రీ. శ 1139 (శక. సం. 1051) నాఁటి నాదిండ్ల శాసనమున నిట్లు గలదు.

ఉ. పేరు గుణావళాఢ్యుఁడగు
మేడనికిం గలుహారగంధి యం
భోరుహనేత్రి, యన్వయని
భూషణి... మేడమాంబకున్."
(తెనుఁగుకవుల చరిత్ర)

ఈ పద్యమయ శాసనము ముద్రించిన యాంధ్ర సాహిత్య పరిషత్తువారి శాసన పద్యమంజరి (15 పుట. నెం 19 రు. శాసనము. 3 పద్యము) పీఠికలో పై శబ్దమునుగూర్చి యిట్లు వ్రాయబడియున్నది. "'కల్హారగంధి' యనుటకు మాఱుగా 'కలుహారగంధి' అని యున్నది." కలుహారశబ్ద మపశబ్దమును భ్రాంతితో పీఠికాకారు లట్లు వ్రాసిరి. కాని యీ క్రింది ప్రాచీన కవి ప్రయోగములు పరిశీలించిన కలుహార శబ్దము లాక్షణికమైనదేయని చెప్పనొప్పును. నన్నెచోడకవి కుమార సంభవములో—

సీ. జలజాత కైరవోత్పల కలుహారాది
గంధంబులోలి సద్గంధములుగ అ. 9
కమల మృదుబిసములు కల్హారకుముదోత్పలముల-

రెండుచోట్ల నీ పదము ప్రయుక్తమైనది. ముద్రణములలో రెండవచోట యాటవెలఁదిలో కల్హారయని యున్నను వ్రాఁత ప్రతిలో 'కలుహార' అనికలదు. రెండవచోట ఆటవెలఁది గావున ఛందస్సులో 'కల్హార' గా దిద్దినను సరిపోవును. మొదటి యుదాహరణములో "జలజాతకైరవోత్పల కల్హారాది" అని దిద్దిన ఛందోభంగ మగును. కావున నన్నెచోడ మహాకవి 'కలుహార' పదమే యుపయోగించెనని తెలియవలెను.

క్రీ. శ. 1400 ప్రాంతమువాఁడగు మడికి సింగన తన పద్మపురాణములో నీ పదము నుపయోగించి యున్నాడు. మ. మురవైరిన్ గలుహార పంచకమునన్ బూజించి...3 ద్విపద భారతమున తిమ్మకవి:

---

2 Minor works of Tallapakam poets Annama charya and his sons. T.T. Devastanam Series. Vol. 1. Pages 17, 10, 67

3 ఈ గ్రంథ మాంధ్ర విశ్వకళా పరిషత్తు వారిచే ప్రకటితమైనది. ఆంధ్ర సాహిత్య పీఠాధిపతులు, శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు పరిష్కర్తలు, సంపాదకులు.

ద్వి. కలహార దళ నేత్ర కడగంటి చూడ్కి
తొలసి నుట్టిన చిత్తము తిల పసెగ
ఆది పర్వము—238 పుట.

తెనుఁగు భాషా సంప్రదాయము ననుసరించి పద మధ్యమున సంయుక్తాక్షరము లుండవు గావున, కల్హారము శిథిలమై కలుహార, కలహార రూపములుగా మార్పు చెందుట భాషా చరిత్రానుకూలమైయున్నది. ఈ కల్హారశబ్ద పరిణామమును బరిశీలించియే అడిదము సూరకవి తన కవిసంశయ విచ్ఛేదమున, తద్భవ తరంగమున కల్హారమునకు తద్భవము—'కలువ'యని చెప్పియున్నాఁడు. తెనుఁగు నిఘంటుకారులు దీనిని చూచినట్లు కానరాదు. "కలువ" దేశ్యముగా శబ్దరత్నాకరమున (160 పుట), సూర్యరాయ నిఘంటువు రెండవ సంపుటమున (.90 పుట) వ్రాయఁబడియున్నది. కాని పై చర్చనుబట్టి కలువ తద్భవమే! కల్హార శబ్దభవముగాని దేశ్యముకాదు అని నిర్ణయింప వచ్చును.

## చిగురాకు

ఆం. వ్యా. సం. స. ప్రథమ సంపుటము 354 పుటలో "'చిగురాకు' అను టుగాగమరహిత రూపము భారతమునఁ గన్పట్టలేదు." అని గ్రంథ కర్తలు వ్రాసిరి. కాని 'చిగురాకు' అను టుగాగమ రహిత రూపమును తిక్కన సోమయాజియే ఆనుశాసనిక పర్వమున వాడియున్నాఁడు.

సీ. చంచులఁ జిగురాకుఁ జించిచూడుము నలి
చెలు గిచ్చు గండు గోయిలల సొంపు-
1.182.

ఇది క్రమా వినతలు సముద్రతీరమున వనమున కేగు నప్పుడుగల వనవర్ణనలోనిది. పై వాక్యమునకు రెండు వాక్యములక్రింద వారు కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సార సంగ్రహమున నిచ్చిన 'చిగురాకు' గల భారత పద్య పాఠము నుదాహరించి, ప్రాఁత ముద్రణములందు దానికి పాఠభేదమున్నదని నిరాకరించి, నాచన సోముని యుత్తర హరివంశము నందలి 'సుడిగొన్న చిగురాకు జొంపంబు' అను ప్రయోగము నుదాహరించుచు "అట్లని 'చిగురాకు' అనురూపము సాధువు కాదన రాదు" అని వ్రాసిరి. కాని తిక్కన సోమయాజి ప్రయోగమే యున్నప్పు డింత చర్చయే దీనిగుఱించి యనావశ్యకము.

ద్వి. పొరిఁగొని పోవుచు జొందిపై నపుడు
వయిచిన చిగురాకు వడిఁ బంపితయ్య
పయిపై చి... మహిమ. 16. పుట.

అని పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రలో నీపదము వాడియున్నాఁడు.

## గ్లౌః గ్లౌ

సంస్కృతమున 'గ్లౌః' అనఁగా చంద్రుఁడు. ఇది యౌకారాంత శబ్దము. పుల్లింగము ప్రతిమాసం గ్లాయతి క్షీయతీతి గ్లౌః ఔ. అని దీని వ్యుత్పత్తి గ్లై హర్షక్షయే. ప్రతి మాసమును క్షీయించువాఁడు అని దీని యర్థము.

తెనుఁగున 'గ్లౌ' శబ్దము తత్సమమైనప్పుడు, చిన్నయసూరి బాల వ్యాకరణమున నీ శబ్దమును గూర్చి యీ క్రింది సూత్రములను గావించియున్నాఁడు.

ఇ గ్లౌ రా యుగంతంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు. బా. తత్స 44

రై గౌ శబ్దంబుల కోత్వంబు విభాషనగు 64

ఇగ్లౌరాసూత్రంబుచేతం బ్రథమైకవచన లోపంబు. రై రో, గ్లౌ గ్లో. 64

చిన్నయసూరి సూత్రము ననుసరించి సూర్యరాయ నిఘంటువు రెండవ సంపుటము 892 వ పుటలో "గ్లౌః=గ్లో. గ్లో. సు. వి. ఔ. పుం 1 కృష్ణపక్షమునందు క్షీణించువాఁడు. చంద్రుఁడు. 2 కర్పూరము" అని కలదు. శబ్దస్వరూపము ప్రదర్శితమైనదే కాని కవి ప్రయోగములు అందుఁ గన్పట్టవు. ఈ సందర్భమున ఆం. వ్యా.సం. యందిట్లు వ్రాయబడియున్నది.

"గ్లౌ-గ్లో-రై అనువాటికి సయితము కవి ప్రయోగము లభింపకున్నను నవి సాధువులనుటకు నన్నయార్యణ సూత్రములె పరమ ప్రమాణములగుచున్నవి." (పుట 607)

సంహితాకర్తలు పరిశీలింప లేదేమో కాని గ్లౌ శబ్దమున కీ క్రింది ప్రయోగములు నిర్ధారకముగాఁ గన్పట్టుచున్నవి.

1. కాశీఖండము.

రగడ: కంఠేకాల కిరీట విటంక
గ్లౌరుచిముకుళిత జలమణి కర్ణిక. 6-124

2. పాండురంగ మాహాత్మ్యము

ఘనసారబింబక గ్లౌబింబ 4-288

3. విజయవిలాసము

"గ్లానొందమెన్" 1-141

4. కవిజనోజ్జీవని-(ఇది పుదుక్కోటరాజు రఘునాథ తొండమాన్ రచియించినది. సమాపాస్యపూరణ గ్రంథము) యతివంచనకిచ్చిన సమస్య. "గ్లావిమలాత్మ వేంకటనగాన్యథా". ఇచట 'గ్లా' రూపమునకేయతి. కవి సీసపద్య పాదమును కందపద్యములో నిట్లిమిడ్చి యున్నాఁడు.

5. దిగ్లలలనా కబరీభర
ప్రగ్లాలితకీర్తిజాల సద్గుణశీలా
నిగ్లపిత రక్షమార్తాం
డ గ్లావిమలాత్మ వేంకటనగాన్యథా.

6. అహోబలపతి

"గ్లా యుదయించెన్ బ్రమోదకరుఁడైమింటన్" అహో. 323 పు

7. కావ్యాలంకార చూడామణి

క. గోవులు పిడుకంగ గ్లానికులన్నృపతులు గ
ర్వానిష్కృతి... 9-37

అని గ్లా శబ్దమును వాడియున్నాఁడు. దీనినిగూర్చి ఆ. వ్యా. సం. స.609 పుటలో నిట్లు గలదు.

"గ్లా శబ్దమునకును, గ్లౌ శబ్దమునకును, 'ముజ్ఞు' లోపించుటంజేసి యవి దుమంతములుగా నేరవు కావున నే వానికి నిగాగము రాఁజాలదు. 'గ్లాచేత, గ్లౌచేతను' అను రీతి నే వాని రూపము లుండవలయును." అని వ్రాసి పై విన్నకోట పెద్దన పద్యము నుదాహరించి... "గ్లానికుల..." అనునది ప్రామాదిక మనక తీరకున్నది" యనిరి. కాని తెలుగుభాషా సంప్రదాయము ననుసరించి యిది సరియైనది.

## దంష్ట్రి

"కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు. (తత్స 56) కంధరము. కంధర. విధాశబ్దమునకుఁ గ్లీబ తుల్యత్వంబు నిత్యంబు. విధము. కంధరా-నాసికా - భిక్షా - దంష్ట్రా - గ్రీవా - పాదుకోల్కా ప్రభృతులు కంధరాదులు-" అని చిన్నయసూరి సూత్రించి యున్నాఁడు.

పై గ్రంథమున 612 వ పుటలో దంష్ట్రాశబ్దమునుగూర్చి యిట్లు వ్రాయఁబడినది:

"దంష్ట్రాశబ్దంబును బుంలింగంబు గాను గానంబడియెడి (ప్రౌఢ. శబ్ద. 24 సూ) అని ప్రౌఢవ్యాకర్త వ్రాసెనే కాని యందులకుఁదగిన ప్రమాణమ్మును జూపలేదు." సంహితాకర్తయుఁ బ్రయోగములను జూపలేదు. దంష్ట్రాశబ్ద మాకారాంత స్త్రీ లింగము. అయినను ప్రయోగములు "దంష్ట్రము" అనురీతిని కన్పట్టుచున్నవి.

1. ప్రాతిగా నాదివరాహ దంష్ట్రంబు
ఖ్యాత మీశ్వరుచేతఁగాద యున్నదియు.
బసవ పురాణము - 6-888 పం.

2. ధరణి మదము లేని కరులనుబోలె దం
ష్ట్రములు లేని పన్నగములు బోలె.
సకలనీతి సమ్మతము. 1-50 ప.

## దృష్టి - దృష్ట్లి

శివభక్తి జనులమీఁదివ దృష్ట్లి గాఁగ
సవినయ సంభ్రమాసక్తి మ్రొక్కుచును.
(బస. 2-79 పం.)

బాలవ్యాకరణమున ఆచ్ఛిక పరిచ్ఛేదము 12 వ సూత్రమున "బహువచనము పరంబగునపుడు 'డ-ల-ట-ర' ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు....................తత్సమంబులం గోటి పిప్పలి శబ్దంబుల కీకార్యంబు చూపట్టెడు. కోట్లు=కోటులు, పిప్పళ్ళు=పిప్పలులు" ఈ సూత్రముక్రింద వ్యాఖ్యానమున నిట్లు గలదు:

"నేఁటి ముద్రణ సంస్కర్తలు కొందఱు భారతమున "దృష్ట్లి" అను శబ్దమును ప్రక్షిప్తము చేయుచున్నారు. 'దృష్టి-సం. వి ఇ. పు. బ. దృష్టులు దృష్టి......క.......రా - గమ్మున వనోర్వవ్య స్నేహమ్ములు పెడి దృష్ట్లినిల్పి రయ్యవతిపయిన్" ఆది. 8. ఆ. 106 (సూ. రా. ని). ఇట సుందోపసుందు లను సోదరులు చూచుటలో బహువచనమావశ్యకమని ప్రక్షిప్త పాఠకారుల యాశయమై యుండును. ఇట్లే మఱొకచోటను గలదు. ఉ. అజ్ఞలు కొందఱప్పు డపహాసము చేయుచు గూఢరూప రేఖాజ్ఞత లేమిఁ దద్వికృతకాయము మీఁదను దృష్ట్లినిల్పఁగా!... (విరా. 4-74 వావిళ్ల ముద్రణము). ఇట్టిచోటులందెల్ల బహుత్వము నందును జాత్యేక వచన ప్రయోగములు నిర్దుష్టములుటంజేసి "దృష్టినిల్పిరి", "దృష్టినిల్పఁగా" అను రీతిని పైస్థలద్వయమునందును గవి ప్రయుక్తపాఠములై

యుండునని గ్రహింపనగును. "దృష్టి-కోట్లు-పిప్పళ్లు" అను రూపములను నిర్వహింపఁజాలు కవిప్రయుక్తము లని విశ్వసింపఁదగిన ప్రామాణిక ప్రయోగములు లేమిం జేసి యవి యుపేక్ష్యము లనఁదగును." పుట. 739

మొదట "దృష్టు" అను రూపమునకుఁ గవి ప్రయోగములను జూపెదను.

నన్నెచోడని కుమారసంభవము—

గీ॥ తన్నుఁగని యనిమిషులైరొ మున్నరైరొ
నాఁగ ననిమిషదృష్టను నాకిసమితి
దగిలి కనుఁగొన...... (4-39)

పై ప్రయోగమున - "నాఁగ ననిమిషదృష్టను" అనుచో 'నాఁగ ననిమిషదృష్టుల' అన్నను సరిపోవును గాన నిది నిర్ధారక ప్రయోగము కాదని వాదింపవచ్చును. అట్లయిన నీక్రింది నిర్ధారక ప్రయోగములనుఁ జూడుఁడు. పండితారాధ్య చరిత్ర—

ద్వి. మును మజ్జనాంబువుల్ ముంచిన దృష్టు
నిను పారి తను పూఁత నిగిడిన దృష్టు
పొనరారి క్రొవ్విరుల్ పూన్చిన దృష్టు
ఘనధూప ధూమంబు గప్పిన దృష్టు
పరగంగ నారతుల్ పర్వినదృష్టు
(దీక్షా. ప్ర. 179.)

లీల జంగమ దృష్టు ప్రమదాశ్రు సమితి
పరగజంగమ దృష్టు ప్రమదాశ్రు సమితి
నెఱయు జంగమదృష్టు వఱలు లింగంబు. 194
వెలిచూచు దృష్టులో వీక్షించు మనసు. 221
తనదృష్టు నాఁటె నొచ్చునో లింగమూర్తి 226
ఉచ్చి పాఱఁగఁ జూచు నరుదృష్టు చూచి.
పురా. 332.
ఉపతాప బీజంబు లుడిదల దృష్టు. 344
మలహరుపై దృష్టు నిలిపి సమ్మతిని. 366
మఱి యట్లుగాక సమ్మగుటపై దృష్టు. 424
నాసాగ్రమున దృష్టు నలినాటుకొల్పి.
వాద. 613

ఇంకను మహిమ, పర్వత ప్రకరణమున పా. 58, 220, 329, 405 పుటలలో ప్రయోగములు గలవు. పై యుదాహృతులలో నొక్క స్థలమందైన "దృష్టు" అనునది "దృష్టులు"గా మార్చుటకు వీలులేదు. మఱియు:

కరము నైవేద్యముల్ గప్పిన దృష్టు
లెసగుఁ దాంబూలాదు లింపైన దృష్టు
లసమ పుష్పాంజలు లసరారు దృష్టు-
—
గా............ దీక్షా. 179.

అని "దృష్టులు" అను రూపముగూడ ప్రయోగించుట చేత దృష్టి శబ్దమునకు బహువచనమున దృష్టులు - దృష్టు—అను రెండు రూపములు గలవని నిర్ధారితమగుచున్నది. ప్రచురముగా "దృష్టు" అను రూపమే వాడుకలో నుండుటచే, నన్నయ, తిక్కన ప్రయోగములలో, "దృష్టు" అని యుండుట ప్రాచీన మహాకవి.సమ్మతమేనని గ్రహింపవలెను. పై ప్రయోగములన్నియు, సంహితాకర్త మహాకవిగాఁ బరిగణించిన పాల్కురికి సోమనాథుని గ్రంథమునుండి గ్రహించినవిగాన విశ్వసనీయమనుటలో విప్రతిపత్తిలేదు.

ఈ దృష్టను గూర్చిన చర్చయంతయు సంహితాకర్త—నన్నయ యాంధ్రశబ్ద చింతామణి రచించెనని చూపుటకు, పట్టుదలతో పరిశ్రమచేసిన పాక్షికదృష్టిచే

చేర్పడినదిగాని, ప్రాచీన కవిప్రయోగదృష్టితో పరిశీలించిన నిట్టి వాదమంతయు ననావశ్యకము. (చూడుఁడు పుట 733, 738 ఆంధ్రశబ్ద చింతామణి. అజంత పరిచ్ఛేదకారిక, 18 వికృతివివేకము అజం. 57 కా, అహోబలపతివ్యాఖ్య. దీనిపై వ్యాఖ్య 193విషయము.)

## కోట్లు

'కోట్లు' శబ్దముపై ఆ. వ్యా. సం. స. వ్యాఖ్యలో (739 పుట.) "కాని యిట్టి కవిప్రయోగ మగపడు:

క. సురపిల్ల కోట్లం బూర్వా
పరపక్ష దినముల......(శాంతి 2 ఆ. 25 ప).

ఇట్టి సంస్కృత సమాస గతి స్థలములం దహోబలపతి తన మార్గమును విడిచికొని సంస్కృత సమంబులం దీ విధికిఁ బ్రవృత్తి నంగీకరింపక తీరదుగదా! చ. తన చతురంగసేనలు శతంబులు వేలును గోట్లుమన్— (హ. హరి 6-8.). దీనిలో 'కోటులు' నిల్చునను శ్రుతి లేదు." అని కలదు.

ఈ క్రింది పండితారాధ్య చరిత్రప్రయోగముల ననుసరించి, 'కోట్లు' అను ప్రయోగము, ప్రామాణికమా, కాదో విచారింపుఁడు.

ద్వి. ఈ విధంబున నిర్వదెనిమిది గోట్లు
జీవాధికారముల్ దెల్లమిచ్చితివి. పర్వ. 271
ఎలమి నిర్వదివేలు వేణ్ణూరు గోట్లు
భుక్తిప్రదస్థానములు నూఱు గోట్లు
ముక్తిప్రదస్థానములు వేయు గోట్లు. పర్వ. 487
ఎంతయు నటువోక యీశ! ప్రాణేశ
"క్రుతి విశ్వతశ్చక్షురుత" యంచు నిన్నుఁ
దతిఁజూపఁ గన్నులు దశకోటి కోట్లు
రతి, 'విశ్వతోముఖ ఇతి' యంచు నిన్ను
నుతియించి జిహ్వలు శతకోటికోట్లు
... ... ...
ఇల 'జనయాన్ దేవ ఏకో' యనంగఁ
దలఁప మనోముఖంబుల నంత కోట్లు
గా.................... దీక్షా. 185

పాల్కురికి సోమనప్రయోగములననుసరించియే తిక్కన, నాచన సోమన యీ ప్రయోగమునుచేసి యున్నారు. "మానుము సంభవంబుగల మానవకోట్లకు" (భాగ. 1) అని పోతనయు, "ఇట్లు కడలేక బ్రహ్మాండ కోట్లు మెఱయు" (విష్ణుపురాణము-1-158) అని వెన్నెలకంటి సూరనయు 'కోట్లు' అను శబ్దమును ప్రయోగించియున్నారు. 'కోటానుగోట్లు' అను వానికిని ప్రయోగములు గలవు.

## పిప్పళ్ళు

ఈ శబ్దమునకు విశ్వసనీయమగు కవిప్రయోగ మీ క్రింది వైద్యగ్రంథమునఁ గానవచ్చుచున్నది.

సీ. గంధకంబును జాజికాయ సూతంబును
పిప్పళ్లు వేలగు తిప్పసత్తు.

(చి-కి-అనఁగా చికిత్సాసార సంగ్రహము)

సంహితాసర్వస్వకర్త దృష్టిలో నిది మహాకవి ప్రయోగము కాకపోవచ్చును. కాని మహాప్రామాణికుఁడగు చిన్నయసూరి దృష్టిలో నిది విశ్వసనీయమును, ప్రామాణికము నగు ప్రయోగము. ఏలయన చిన్నయసూరి దీనిని తన నిఘంటువున నిచ్చియున్నాఁడు. సూర్యరాయ నిఘంటువున 3 వ సంపుటము 819 పుటలో 'తిప్పసత్తు' అను పదముక్రింద పై ప్రయోగ మీయఁబడినది. అందు చికి. (చి. ని) అని కలదు. చి. ని. అనఁగా చిన్నయసూరి నిఘంటువు. సూరియు పై ప్రయోగము మనసు నందిడికొనియే యీసూత్రము గావించియుండును. చిన్నయసూరి బాలవ్యాకరణమున నిచ్చిన యుదాహరణము లన్నింటికి కవిప్రయోగములు గలవు. కవిప్రయోగారూఢముగాని పదమును చిన్నయసూరి యుదాహరింపలేదని నిశ్శంకముగా జెప్పవచ్చును. పై సర్వస్వ గ్రంథమున కొన్ని సూత్రముల వ్యాఖ్యా సందర్భమున, సంహితాకర్త ప్రయోగము లేవని చూపిన వాని కన్నింటికిఁ బ్రయోగము లున్నవి.

## 'లోపు' — ఉల్లోపు

"అందుల వారనునట్టి ప్రాచీన రూపములందు వలెనే లోపు శబ్దముపై 'ఉల' చేరి పలుకుబడిలో నుకార మకారములై వికృతినంది ప్రత్యయత్వమునందిన శబ్ద మిదియని తోఁచెడి.—(బా. నా. పే. 286—పు) ఈ వ్రాఁత పొరపాటు. 'లోపు' శబ్ద మే కోశమునందును లేదు. అందుల శబ్దమున 'ఉల' చేరెననుట సరికాదు. అందు శబ్దముమీఁది విభక్తులకు లట్టురాగా 'అందులకు' మున్నగునవి సిద్ధించును. వెలుపల మున్నగువానిలో వలెనే లోపల శబ్దములోనిది పలశబ్దము." ఆ వ్యా. సం. స. ద్వితీయ సంపుటము పుట 1089. 40 వ విషయము.

లోపు శబ్దము కోశముల కెక్కక పోయినను, ప్రాచీనుఁడగు నన్నెచోడ మహాకవి కుమార సంభవములో నిట్లు ప్రయోగించియున్నాఁడు.

క. సుర గరు డోరగ విద్యా
  ధరపుర వర సతులతోడ దనుజేశ్వరు కిం
  కరులు రమింతురు దోషా
  చరులకు వెలిలోపు గలదె చతురానడా !

ఇచట బ్రహ్మతో దేవతలు తారకాసురుని సేవకులు సేయు దుండగములు చెప్పునపుడు, ఆ కింకరులకు వెలిలోపు, అనగా బాహ్యాభ్యంతరములు అను విచక్షణలేదు అని చెప్పుచున్నారు. ఇచట వెలి బాహ్యము. లోపు అభ్యంతరము–అని అర్థము. వెలిని బాహ్యమున నున్న సతులు, అభ్యంతరము- లోపలనుండు సతులు. అనియు నర్థము. లోపుశబ్దము లోపల యను నర్థమున వాడుక చేయబడినది. గృహనిర్మాణ సందర్భమున 'లోపలి'కు "ఉల్లోపు" అని వినబడును. పై పద్యమున 'వెలి' శబ్దమునకు వెలుపల అనియే యర్థము.

## 'ఈ వు త న్'

"ఇట్లే ఈవుతన్ - అననది యిచ్చుధాతువునకు నాశీరర్థక లూడ్రూపముగఁ జేర్కొనబడుచున్నది. ఈవుత-గ్రు.=ఇచ్చుధాతువుయొక్క ఆశీరర్థక రూపము. ఇచ్చుతన్ అనుదానికి రూపాంతరము. చ...సరస్వతీశ్వరుఁ డుదారత మాకు జిరాయువీవుతన్. ఉ.రా. 1-8 (నూ.రా.ని.) ఇందు 'ఇచ్చుతన్' అనియే కవిప్రయుక్తమేమో? ఈవుతన్ అనుచోటి వుకారమును నిర్వహించు ప్రాసాదిఘటిత ప్రాచీనమహాకవి ప్రయోగము లభింపలేదు. 'ఈవి' శబ్దయోగము అను కృదంత రూపము గన్పట్టుచున్నది". ఆం. వా. సం.స. ద్వితీయ సంపుటము. పుట 1246.

కాని "ఈవుతము" అను రూపము క్రీ. శ. 1235 నాటికే గన్పట్టుచున్నది. క్రీ. శ. 1235 నాటి రేచర్ల కాటని యనుమకొండ శాసనమున నీ రూపము ప్రయోగింపఁబడినది.

క. ఉరగేంద్ర దిగ్గజముల కుం
  భరమెూత్సాహముగ నాతపత్రము వోలె
  న్ధర రెూత్తిన కిరివరుండను
  హరి గాటయ కీవుతము దయామతి శుభముల్ !

ఈ పద్యమున "ఈవుతము" ప్రాసఘటితము కాదందురేని యీ క్రింది పద్యము చూడుఁడు. ఇది పై పద్యము తరువాతిది.

క. దేవాదిదేవు డమిత
  స్థావరజంగమమయుండు సర్వేశుండు గౌ
  రీవరుం డనవరతంబును
  నీవుతం గాటయకు దయ నభీష్టఫలంబుల్.

శిలాశాసనము లందిలి వ్రాఁత మార్చరానిది. అందును నిది పద్యమయ శాసనము. కావున ఈవుతన్ అనురూపము ప్రాసస్థానమున నున్నప్పుడు ప్రామాణికమే-3.

3 తెనుఁగు కవుల చరిత్ర. మద్రాసు విశ్వవిద్యాలయ ప్రకటితము, ద్వితీయ ముద్రణము.

'ఈవుతన్' అను క్రియారూపమునకు ప్రయోగములు ప్రాచీనుఁడగు నన్నెచోడుని కుమారసంభవము నందే ప్రారంభమున నే కానఁబడుచున్నవి.

చ. హరివికచామలాంబుజ స
      హస్రము.........న
  యిష్టగుపురంజూచి నవ్వుపర
      మేశ్వరుఁ డీవుత మాకభీష్టముల్ 1-3

చ. అనుపమ దివ్యమూర్తి...
      త్రిలోచనాదిలో
  చనములు దానరైన రవి
      చారు నిజప్రభ మాకు నీవుతన్. 1-6

క. హరుఁ డాదిగ...
  మరుఁ డీవుత మఖిలవశ్యమతి... 1-9

చ. నగజాత మత్కృతినిఁ
  జేకొని తత్పృథగర్వ మీవుతన్. 1-10

లభ్యమైన తాళపత్ర ప్రతులయందు, ముద్రిత ప్రతులయం దీరూప మిట్లే యున్నది. మార్పులేదు.

# ఉక్కు పంజరాలు

## రమణశ్రీ

**పాత్రలు:** కళ్యాణినాయుడు, నారాయణదాసు, కిశోర్, వెంకటాయుడు, రాజయ్య, శ్రావణి, పోలీసులు ఇన్‌స్పెక్టర్, పెద్దమనుషులు—

* * (శ్రావణ నాట్యకళా మందిరం... నలువైపుల కుడ్యాలపై చిత్రకళాంజలి. ప్రకృతిదృశ్యాల పరిమళాలతో ఆహ్లాదకరమైన వాతావరణం... సముఖంగా, శకుంతలా దుష్యంతుల ప్రణయఘట్టం...సూర్యోదయ కిరణాల మేల్కొన్న స్వేచ్ఛాశకుంతాల ప్రకృతిచిత్రం ...సభాగారాంతరానికి శిరోమాణిక్యంగా నటరాజవిగ్రహం. ప్రేక్షకలోకాన్ని తన్మయించే, రంగు రంగుల ఊహల్లో దాగిన భావ స్ఫూర్తి...కళాశ్రీ ఆనందబాష్పాలు నిత్యంవర్షించే, ఆ మందిరంలో... నాట్యసభా సంచాలకుడు నారాయణదాసు, మరో ఇద్దరు పెద్దలు మాట్లాడుకొంటున్నారు సోపానాల మీద ఆసీనులై.)

నారా: కళాకాంత ఆనందబాష్పాలు ఎప్పుడూ యీ మందిరంలో రాల్తుంటవలసిందే! మా నృత్యకళ చూశారూ! డబ్బుకోసం ఆశించదు. ఎంతసేపూ కళారాధన! నృత్య సంగీత విన్యాసం... మా శిష్యపరంపర. ఈ శ్రావణమందిరానికి, జీవితాలు సమర్పణచేశారంటే నమ్మండి!

1-వ పెద్ద: అయ్యో! ఎంతమాట ... చెయ్యకపోతే, ఎలా చెప్పండి! పెళ్ళి పెడాకులూ వచ్చిన మాలాంటివాళ్ళం ఏం చెయ్యాలి? మీ నాట్యకళకి, కళ కళలాడుతూ ప్రోత్సాహమివ్వడం తప్ప......

2 వ పెద్ద: మీరుతప్పక ప్రదర్శనం ఇచ్చితీరాలి! ఎన్నాళ్ళైనా సరే! మీ శ్రావణమందిరం పేరువింటే సరికి, పాలుతాగే పాపకూడా అభినయిస్తూ గంతులేస్తుంది.

నారా: నిజం......నాట్యం, నృత్తం, అభినయం, హస్తముద్రలు అన్నింటికీ మన ఆంధ్రదేశం సాంప్రదాయికంగా భారతావనికే ఒరవడి దిద్దిందనుకోండి! ముఖ్యంగా మా ప్రదర్శనలో— 'జాలరులు,' 'నృత్యనాగిని,' 'శ్రావణ జ్యోత్స్న'...ఒకటేమిటి? ఎన్నిరకాల నాట్య ప్రదర్శనాలో ?

1 వ పెద్ద: ఇంతదూరం ఎందుకొచ్చాం? మీ కీర్తి వినే! నాట్యాచార్య నారాయణదాసుగారంటే, కొంపమీది కోతి దిగొస్తుంది. పెళ్ళి ముహూర్తం ఈ వారంలోనే......మీరు ఊఁ అనండి! మీలాంటి కళాకారుల్ని సన్మానించడం మా కనీసధర్మం — మీరడిగినంతా యిస్తాం......

నారా: ఇప్పుడు నాట్యతారలుగా, ఆకాశపథంలో ఎగిరిపోయి, చమక్ చమక్‌న మెరుస్తోన్న వాళ్ళంతా, మా నాట్యకర్మాగారంలో తయారయినవాళ్ళే! మా నర్తకీ నర్తకులందరికీ, ఏమూల కదిలినా, ఏ ప్రక్కకొరిగినా నాట్యంగా రూపొందించి, చెలామణీచేయించగలశక్తివుంది!

2 వ: అందుకే మిమ్మల్నింతదూరం వెదుక్కుంటూ రావడం. మా వూళ్ళో కల్యాణినాయుడుగారు మిమ్మల్ని గురించి, ఎంతో యిదిగా చెప్పారు. మీరు మొదట ఒప్పుకోరని, తర్వాత వారిపేరుదాహరించమని, 'ధనలక్ష్మి'తో సహా రమ్మని... మరీ మరీ చెప్పారు!

నారా: కళ్యాణీనాయుడుగారే!...ఇంకేం? చెప్పారు గారు! ధనలక్ష్మితో సహా... నాట్యప్రదర్శనకి రమ్మన్నారూ?

1 వ: ఔనండి! మీకూ ఆయనకీ ఉండేపరిచయం, ఈనాటిది కాదనీ, జన్మ జన్మాల ఋణానుబంధమనీ...ఇంకా ఏవేవో. మిమ్మల్ని పొగుడుతూ చెప్పుకొచ్చారు.

నారా: (తెగబడుతూ, తబ్బిబ్బవుతూ) ఆహాఁ ఎంత మాట! మా ధనలక్ష్మికి నిరంతర ప్రోత్సాహం ఆయనదేకదూ? క్షమించాలి! (లోపలికి చూసి) శ్రావణీ! శ్రావణీ! రెండు కాఫీలు తీసుకురా అమ్మా!

1 వ: అబ్బెబ్బె! ఇప్పుడెందుకండి! హోటల్లో తాగేసివచ్చాం. మీకెందుకు శ్రమ...

నారా: మీరు మోసుకొచ్చిన సందేశం, ఏమంత సామాన్యమైందా? మా నాట్య కర్మాగారానికి, ఆయన భరోసా, పునాదుల్నించీ పెరిగింది!

2 వ: అంతమంది మీ నాట్య కర్మాగారంలో పని చేస్తుంటారుగదా! అందరికీ, అభినయం, నాట్యం...వస్తాయా?

నారా: ఏడిశారు! మాకర్మాగారంలో యంత్రాలు తుపెవ డింతప్పు, పాడడం ఆడడం చేతగావని మరీ మరీ అచ్చుశుద్ధి చెపుతాను. ఒక్కోసారి అచ్చు సరిగ్గా పడకపోతే, తగలబెట్టేస్తాం...

1 వ: అచ్చు సరిగ్గా పడకపోవడం ఏమిటండీ నా మొహం! ఇదేమన్నా అచ్చాఫీసా?

నారా: రంగులుకూడా సరిగ్గా కలవకపోతే, అంతా అలుక్కుపోయి, అసహ్యంగా తయారవుతుంది.
(శ్రావణి, కాఫీలతో వస్తూ యీ మాటలువింది. కనూ ముక్కూ తీరుగల ముఖం...వెంటనే ఆకర్షించే వయస్సు)

శ్రావ: ఏమిటి నాన్నా! నువ్వు మాట్లాడేస్తున్నది? అవతల వచ్చిన పెద్దమనుషులకి తగిన సమాధానంచెప్పి పంపించెయ్!

నారా: దేన్నిగురించి మాట్లాడాను! రంగులగురించా? అయ్యో! నా పరాకు తగలబెట్టా! కళ్యాణి నాయుడుగారిని, గురించి జ్ఞాపకంవచ్చి, ఏదో మాట్లాడేశాను. క్షమించండి!

2 వ: మాకేదో సమాధానంచెప్పి పంపించెయ్యండి!

నారా: ముందు కాఫీలు తీసుకోండి! చల్లారిపోతయ్!

2 వ: మీకు బజానా ఏమైనా ఇమ్మంటారా?

నారా: చూడండి! ఈ నూరురూపాయలనోటుకి చిల్లర నోట్లుంటే యివ్వండి!

1 వ: ఓహ్! దానికేం భాగ్యం! (నోటు తీసుకొని) సరికొత్త నోటు! నెంబరేం తేడారాదు గదా?

నారా: ఇంకానయం! స్టేట్ బ్యాంక్‌లో 10 వేల రూపాయల చెక్కిప్పుడే మార్చి తెస్తేను... ఆ కాషియర్ అన్నీ పెద్ద నోట్లే ఇచ్చేశాడు.

1 వ: (చిల్లర నోట్ల కట్టలు పైకి తీసి) ఇదిగో! మీ నోటుకి ఇవి రెడ్వాన్సు కిందుంచండి!

2 వ: ఇక బయల్దేరండి! వస్తామండి! గొప్పగా నాట్యం చేసే, ఆ ధనలక్ష్మితో సహా వేంచేయండి! కళ్యాణీనాయుడుగారు మిమ్మల్ని మరీ మరీ అడిగారు.

నారా: శ్రావణీ! ఈ డబ్బు లోపలుంచు. సరే మీరు వెళ్ళండి!
(పెద్ద మనుషులు వెళ్ళిపోతున్నారు. కిశోర్ లోపల్నించి ప్రవేశం...లోపలికి పోతోన్న శ్రావణి కిశోర్‌ని చూసి ఆగింది. యువరక్తంలో స్వేచ్ఛకోసం అతని కనురెప్పలు టప టప లాడుతున్నాయి. ఏదో మహోపానం అనుభవిస్తు అతని ప్రతిభని, ముఖంలో విషాదచ్ఛాయ కప్పివేస్తోంది)

కిశో: దాసుగారూ! ఇవాళేం చెయ్యమంటారు? 'ధనలక్ష్మి'కి రంగుల్లేవు. ఎవరికీ రాత్రి సరిగ్గా నిద్రల్లేవు. కరెంటు 'డిమ్' గా వుంది. వళ్ళు బద్ధకం విరుస్తోంది...

నారా: ఇంకా నయం! ఒక క్షణం ముందొచ్చావు కావు...ఆ పెద్ద మనుషుల కళ్ళ పడితే, యింకేమన్నా వుందా? బద్ధకం గిద్ధకం వదుల్చుకొని, రంగులు కలుపుకొని, సాగించండి 'హస్తముద్రణం'.........కళ్యాణి నాయుడు దగ్గర్నుంచి, నాట్య సంకేతంకూడా వచ్చింది. 'ధనలక్ష్మి' మువ్వలు కట్టుకుని, ప్రదర్శనానికి వెళ్ళేవరకూ నృత్యం చేయవలసిందే.

శ్రావ: పాపం కిశోర్ నిన్నల్లా 'రూప' ముద్రల్తో చే ఉక్కిరిబిక్కిరయ్యాడు. ఒక్కక్షణం స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకోనీకపోతే ఏమైపోవాలి!

నారా : శ్రావణీ! కిశోర్‌ని వెనకేసుకురావడం ఏం బాగోలేదు. అతను మన బానిస... రెక్కలు తెగిన పక్షి... హుం లోపలికి వెళ్లండి. ఎవరేనా వస్తారు.

శ్రావ : మనిషంత మనిషివి, ఎన్నాళ్లని, ఉక్కుపంజరంలో దాస్తాం?

నారా : ముందు నువ్వు లోపలికివెళ్లు శ్రావణీ!

(ఇద్దరూ లోపలికి వెళ్లారు. నారాయణదాసు అటూ ఇటూ పచార్లు చేస్తూంటే బయట్నుంచి రాజయ్య వస్తాడు. నమ్మినబంటు. విశ్వాస పాత్రమైన హృదయం. కాపలా కాసికాసి వడిలిపోయిన శరీరం...ముంచుకొస్తూన్న ముసలితనం...)

రాజ : బాబూ! ఆడెవడో ఇనప్పిండంలా వున్నాడు. కదల్లంటే కదల్డు ... పేనం యిసిగెత్తి యిలా సెప్ప నాకొచ్చాను.

నారా : ఎవరువాడు? ఏపనిమీదొచ్చాడంటావ్?

రాజ : సెప్పమంటే సెప్పడండి! అంతాఅయ్యగారితో మాటాడాల! అయ్యగారితోటె సెప్పాల! అంటడేగాని, ఎందుకొచ్చిందీ యిప్పి సెప్పడండి. ఏం సెప్పమంటారు?

నారా : యువకుడా? ముసలోడా?

రాజ : నా అంటి ముసలోడేనండి! పాపం బెంగెట్టుకు పోయున్నాడేమో, పోయినోళ్లకోసం దిగాలు దిగాలు మంటున్నాడు...

నారా : సరే రమ్మను...ఎందుకో, ఏమిటో అర్థంగాని మనుష్యులంతా వచ్చి మీదపడతారు. పేరు 'నాట్య కళామందిరం' లోపలేం వేషాలేస్తున్నామో, ఏ నాటక మాడుతున్నామో చూద్దామని కొచ్చి, వెర్రివెర్రి వేషాలేస్తారు! అలాంటి వాళ్ళంతా కళాప్రియులట, కళాప్రియులు...

(రాజయ్యవెళ్లి వెంకట్రాయుడుతో ప్రవేశం. వెంకట్రాయుడు జీవితంలో పండినమనిషి... ఏదో బెంగతో క్రుంగిపోతున్నాడు. దేవుడి మీద భారంవేసిన వ్యక్తిలా కనిపిస్తాడు.)

(నటరాజ విగ్రహంముందు మోకరిల్లుతూ) హేనటరాజస్వామీ! జగన్నాటక సూత్రధారీ! నా మొరాలించి, పాలించు!

నారా : ఇదేమైనా దేవుడి గుడనుకున్నావుటయ్యా మొక్కులు తీర్చుకోడానికి...ఎవరునువ్వు? ఎందుకిలా వచ్చావు? నాతో ఏమిటవసరం?

వెంక : రాయుడిగుండెల్లో రాజుకొంటోన్న బాధ— నాలుగేళ్లనించి, నలిపి నారతీస్తున్న బాధ... ఇక భరించలేను. ఈ నటరాజస్వామి ముందు కరిగినీరై పోతాను...నటరాజయ్యా! నా కుర్రాణ్ణెక్కడ దాచావయ్యా?

నారా : మే మేం ఆర్చేవాళ్ళమనా, తీర్చేవాళ్ళమనా? నీదగ్గర ఏమేనా చిల్లర నోట్లుంటే పడెయ్!

వెంక : రూపాయి చిల్లరుం దివ్వనా? అంతకంటె ఎక్కువ వెలావుంటుం దీ రాయుడిబతుక్కి! నా కొడుకే, నా దగ్గరుంటే, నీకెన్ని చిల్లర నోట్లు కావల్సినా తెప్పించి ఇచ్చేవాణ్ణి... బంగారంలాంటి నా తండ్రి, బొంగరం తిరిగి పోతున్నా డెక్కడో?

నారా : ఏమై పోయాడు?

వెంక : ఏమై పోయాడు? ఎక్కడున్నాడు? అది తెలిస్తే ఇంతదూర మెందుకు? నేను చచ్చేచివరి క్షణంవరకూ నా కొడుకోసం ఊపిరి పీలుస్తాను. విడుస్తాను. వాడికోసం ప్రాణాలర్పిస్తాను...పోరాడుతాను...వాడి అమాయిక ముఖం చూసి ఎన్నాళ్ళయింది?! ఎన్నేళ్ళయింది?...

నారా : ఆత్మహత్య చేసుకొని చచ్చిపోతూ డేమో పాపం!

వెంక : హర హర హరా! ఎంతమాట నీనోటవిన్నాను? ఆమా టెందుకొచ్చింది, నీ పాడునోట... వాడేం అప్రయోజకుడనా? చావడానికి! చక్కగా చిత్రాలు వేస్తాడు...శిల్పాలు చేస్తాడు. సీనరీలు రాస్తాడు...ఒక టేమిటి? చిత్ర విచిత్రమైన వ్యక్తి! ఏదేనా చూశాడో, మనసులో అచ్చుగుద్దుకొంటాడు. మాయచేసి, మనిషిని మోసగించే మీటలుచేసి రహస్య మార్గాలు సృష్టిస్తాడు. ఇలాంటి కళామందిరాలు వేనకువేలు సృష్టించి పారేస్తాడు. అలాంటి నా కొడుకేడీ? ఇప్పు డెక్కడుంటున్నాడో?

నారా : (వెటకారంగా) నరకద్వారం చెంత కాపలా కాచుకూర్చున్నాడు. వెళ్ళిమాడు. లేకపోతే ఏమిటీ గోడు! కాస్త తీరుబడిగావుంటే చాలు. ఎవడో ఒకడు డొస్తాడు సొంతగోడు గొణకడానికి...అంతకంటె బతుకు తెరువు లేదు. వళ్ళొంచి పనిచెయ్యరు.

వెంక : ఓహ్! నే నడుక్కోడానికి రాలేదు. నీ దయాదాక్షిణ్యాలు నా కక్కరలేదు...

నారా : కిందటి సంవత్సరం ఇలాగే పెళ్ళాం ప్రసవించలేక చచ్చిపోయిందని కాగితం రాయించుకొని దహనఖర్చుకు సొమ్మడుక్కుని వచ్చాడు. అదేకాగితం పట్టుకుని, అదేమనిషి మళ్ళీ మొన్న సిద్ధమయ్యాడు. చూశావా? అడుక్కోడంలో దగా...బతకడంలో దగా.

వెంక : నా కుర్రాడు చావడు. చావలేదు. సజీవంగానే వుంటూ దొక్కడుతున్నా. వాడు వెన్న ముద్ద...ఆ వెన్నముద్దని కరిగించి, వెన్న కాచిన నెయ్యి అమ్ముకుంటున్నా రెవరో...వాణ్ణి ఉచ్చుల్లో ఇరికించి, అనేకతెరలో నొక్కిపట్టి ఇనప చెప్పులకింద కాళ్ళతో తొక్కిపెట్టి వాడిచేత వెట్టిచాకిరీ చేయించుకొంటున్నారు. లేకపోతే, నాబాబు ఇంతకాలం తామసించడు.

నారా : ఏందా నీపోది... నీ కొడుకు ఖూనీచేసి, ఏ జైల్లోనో ఖైదీగా మగ్గుతుంటే, ఏమిటి నువ్వు చేసేది ? ఎవర్నేమంటావ్ ?

వెంక : హరహరహరా ! ఎంతమాట ! దేవుడులేడూ ? నీనోట ఎలాంటిమాట విన్నాను ! నిన్ను గురించి, ఇవ్వాళెంతమాట వినిపించిందిరా నాతండ్రి ! నాబాబు ప్రాణాలుపోయినా అలా చేయడు. ఖూనీ చేయాల్సిన అవసరం ఏమిటి నాతండ్రికి ! ఎక్కడున్నా స్వేచ్ఛగా స్వతంత్రంగా బతుకుతాడు. వాడు బొమ్మలు వేస్తే కొమ్మమీది కోతి దిగొస్తుంది.

నారా : కోతి బొమ్మలవీ వేసీ, కోతి మెచ్చిన్నమాట నీ కొడుకు—ఆ కోతికోసం తిరుగుతూ పనికపోతే, సన్యాసం పుచ్చుకుని, ఏ మంచుకొండలకో తపస్సుకు పోరాదూ ?

వెంక : వాడు కనిపిస్తే అంతేచాలు. నువ్వు చెప్పినట్టు, సన్యాసం పుచ్చుకుపోతాను.

నారా : ఐతే, పేపర్లో వేయించక పోయావూ ?

వెంక : వేయించక పోవడమేమిటయ్యా ! ఇదిగో ! ఈ కాగితం. (నారాయణదాసు కిచ్చాడు)

నారా : 'ఈ పై ఫోటోలో అబ్బాయిపేరు కిశోర్, వయస్సు పద్దెనిమిదేళ్ళు. మణికట్టుమీద గచ్చకాయంత మచ్చ. తల్లిదండ్రులమీద అలిగి వెళ్లిపోయాడు. ఆచూకి తెల్పినవారికి 116 రూ. బహుమానం...' ఐతే యింకేం ! ఆ మాట పదహార్లు, గద్దలా తన్నుకుపోవడానికి, ఏకాకి పిల్లల్నో నూరాలే ! వాళ్ళకోసం ఎదురుచూస్తూ గుమ్మం ముందు కూచో !

వెంక : కూచుని, కూచుని విసుగెత్తిపోయాను. చివరికిలా, ప్రపంచంమీద తిరగబడ్డాను. వెదికి, వెదికి వేసారాను.

నారా : మీ యిద్దరిమీదా అలిగి పారిపోయాడంటావా ?

వెంక : తల్లి సవితి తల్లి !. ఇక వేరే కారణం చెప్పాలా ?

నారా : మీ కుర్రాడి జీవితంతో క్రూరంగా ఆడుకోవటం ప్రారంభించింది కాబోలు ! 'సవితి తల్లి' పాత్ర నిర్వహిస్తూ... నిక్షేపంలా నువ్వేం జేం చేశావూ ? ఇప్పుడెక్కడని వెదుకుతావు ? నిరాశ చేసుకో ! నిలువునా నీరైపో ! ఫో !

వెంక : నీ కాళ్లట్టుకొంటాను నీ చేతులు పట్టుకొంటాను. నా కొడుకుజాడ చెప్పు. ఆ మాట పదహార్లూ నువ్వే పుచ్చుకో ! నీమాటల్నిబట్టి నీకు తెలుసు నా కొడుకు ఆచూకీ—హే!జగన్నాటక సూత్రధారీ ! నటరాజస్వామి ! ఈయనచేత నిజం చెప్పించు తండ్రీ !

నారా : చాల్చాల్లేవయ్యా ! శిలలచేతకూడా మాట్లాడించేలా వున్నావు ! ఇక్కడెవరూ లేరు. ముందు దయచెయ్యి. మర్యాదగా పోకపోయ్యావో, రాజయ్యచేత గెంటిస్తాను.

వెంక : గెంటిస్తావు...ఎన్నాళ్లని, ఎంతమందిని గెంటిస్తావు...నీ అధికారం వున్నంతవరకూ...నీ యాజమాన్యం సాగేటంతవరకూ......(బతిమిలాడుతూ) ఎందుకయ్యా రెచ్చగొట్టడం? ఆ మాటపదహార్లూ నువ్వే పుచ్చుకో! నా కుర్రాణ్ణి నా కప్పగించు.

నారా: ఏం కల గనలేదుగదా?...(కోపంగా) పిచ్చెక్కిందా ముసలయ్యా! ఎవడో, దిక్కుమాలిన వెధవ తప్పిపోయాట్ట! తిన్నగా మా యింట్లో దాచుక్కూచున్నామని వచ్చాడు...రాజయ్యా! చూస్తావేం?

రాజ: నిజమయ్యా! వెంకట్రాయుడూ! దాసుగారికి మా చెడ్డ కోపం గుంది...కోపంవచ్చిందంటే మడిసి గాదు. ఊఁ నడు...

వెంక: పోతా! పొమ్మన్నారు కదూ! మీ తిరస్కారమే మాకు కావల్సింది...అంతా మీ నాటకం తెలుస్తోందయ్యా! తెలుస్తోంది. ఒరే అబ్బాయ్ కిశోర్...కిశోర్...(రాజయ్య అవతలికి లాక్కుపోతున్నాడు వెంకట్రాయుణ్ణి...)

నారా: హమ్మయ్యా! ముసలాడు కనిపెట్టేసి నట్టున్నాడు. గొప్పచిక్కే వచ్చింది. (కంగారుగా అటూ యిటూ తిరుగుతూ) ఏమిటిదారి? వాణ్ణెలా వదిలించుకోడం? హాయ్ భగవాన్! నటరాజ స్వామీ! నీ భక్తుణ్ని విముక్తుణ్ని చెయ్య.
(కిశోర్ లోపల్నుంచి వస్తూ)

కిశో: ఏమండీ! అంత ఆవేశంతో పిలిచారు? ఏం ప్రమాదం లేదుగదా!

నారా: ప్రమాదమా? మరీ ప్రమాదమా? ఎవర్రా నిన్ను పిలుస్తే? ఓహ్! (తీవ్రంగా) మమ్మల్ని బతకనిస్తావా లేదా? ఆ ముసలా డెవరంట? నీకెన్ని సార్లు చెప్పినా బుద్ధిలేదు? ఎలా వచ్చాడు వాడు?

కిశో: నాకోసం...ఎవరూ?...ఎవరూ వస్తే? నన్ను గురించి ఈ ప్రపంచంలో ఎవరికీ అక్కర్లేదు... నాకు ఎవర్నైనా రప్పించుకొనే స్వాతంత్ర్యం కూడానా? నేను కుమిలికుమిలి, 'సేమా' లో మరణించాల్సిందేగా?

నారా: మళ్ళీ ఆ ముసలాడొచ్చాడో, వాడికీ 'సేమా' గతి పట్టించేస్తాను...నీరూ నిప్పు లేకుండా తన్నుకు చచ్చేలా.

కిశో: మళ్ళీ నాకెందుకా కొత్తిపాపం! నాకోసం వాణ్నెందుకు 'సేమా' పాలు చెయ్యడం.
(లోపల్నుంచి శ్రావణి వస్తూ)

శ్రావ: సగం సగం పనిచేసి ఇలా వచ్చేశావేం? కిశోర్! నీకు రోజురోజుకి మతిభ్రమిస్తోంది.

నారా: వంట్లో మాంద్యం ప్రబలిపోయి, కళ్లు మీదికొచ్చి, ఆత్మాభిమానం చచ్చి, ఇష్టంవచ్చినట్టె తిరుగుతున్నాడు. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం కావాలట...వెళ్ళు బయటికి వెళ్లు!..పోలీసులు వారంటుతో, బేడీల్తో సిద్ధమౌతారు.

శ్రావ: అవన్నీ ఇప్పుడెందుకు నాన్నా?

నారా: వాడు చేసినపనికి! ఆ ముసలాణ్ణెవణ్ణో మన మీద కుసికొల్పాడు. వాడొచ్చి ఇక్కడ ప్రాణాయామం పట్టుక్కూచున్నాడు. 'నా కొడుకు నిస్తావా? చస్తావా?' అని...

కిశో: నాతండ్రి...నా కన్నతండ్రి వొచ్చాడా? నిజంగా...

నారా: ఆఁ మెడబట్టి గెంటించేశాను! నీకోసం... వాడల్లరిచేశాడో పోలీసులొస్తారు. నిన్నూ తేసి పట్టుకుపోతారు.

కిశో: (దుఃఖంతో) నాన్నా! నాకోసం వెదుక్కుంటూ వచ్చావా? ని మొహంచూసి ఎన్నేళ్లయిందో?...

శ్రావ: కిశోర్ దుఃఖించి ఏమిటి ప్రయోజనం? లోపలికి వెళ్ళు. నాన్న సంగతి నీకు తెలిసిందేగా? అందరిమీదా అలాగే ఎగురుతాడు.

కిశో: దాసుగారూ! ఒక్కసారి మా నాన్నని చూపించండి. నన్నీ బంధాల్నుంచి, విముక్తిచేయండి. మీరహస్యాలు కడుపులో పెట్టి కాల్చుకొంటాను. ఎంతసేపూ ఆ నల్ల నిశాపిరి, చిక్కని చీకటి, ఆ పాడు యంత్రాలతో నిరంతరపోరాటం. సేమాలో బతుకు. నాకిది యావజ్జీవఖైదు కాకపోతే ఏమిటి దాసుగారూ! అక్కడ జైలుతప్పి, మీ గుప్పిట్లో పడ్డాను. నాశరీరంలో ప్రతిరక్తబిందువు పిండేసి ఎన్నాళ్ళిలా తాగుతారు? నన్ను బయటికి పోనీయండి, ఏమైతే అదౌతుంది. నాకదైతే సుఖం...ఎంతకాలం ప్రభుత్వాన్ని, చట్టాల్ని మోసం చెయ్యగలం?

నారా: అబ్బో! ఉపన్యాసమిస్తున్నా వుపన్యాసం? తిన్నగా "సేమా" లోకిపోయి శ్రావణి చెప్పింది పూర్తిచెయ్య!

కిశో: దాసుగారూ, మీకాళ్ళుపట్టుకు బతిమిలాడుకుంటున్నాను. నాకిప్పుడు రెక్కలు విప్పు

కున్న స్వేచ్ఛ కావాలి. ఉదయాస్తమానాల బంగారు సూర్యకాంతుల్ని చూసి ఎన్నేళ్ళయిందో? సముద్రపుటొడ్డుని కూచుని, తరంగాల ఘోష విని ఎన్నాళ్ళయిందో? గాలివాన, తుపానూ అన్నీ కన్మరుగైపోయాయి. స్నేహమంటే యేమిటో మరిచిపోయాను. ఆనందమంటే ఏమిటో గుండెల్లో అణగారిపోయింది. ఎన్ని రకరకాల మనస్సులతో, మాటలతో రాపిడ్ని పొందేదో నా హృదయం? అదును చెడి పదును చెడి మొద్దెక్కిపోయాను... శ్రావణీ! శ్రావణీ! నువ్వైనా చెప్పు. నా కాళ్ళు బంధబారిపోయాయి. కళ్ళు కాయలైపోయాయి. ఎందుకు నన్నిలా జలగల్లా పీడించుకుతింటారు?

శ్రావణి : నాన్నా... ఏమిటి కిశోర్ గొడవ?

నారా : అమ్మాయ్! నువ్వేం మెత్తబడకు! ఎత్తు మీద ఎత్తేస్తున్నాడు. నాటకంలో పాత్రలా పిలిపించాడు. మన కనుగప్పి తెప్పించుకోవాలని అఘోరిస్తున్నాడు. వీడి కేమాత్రమైనా విశ్వాస ముందా? కన్నకడుపులా రహస్యం దాచి, పోలీసులు కంటపడకుండా కాపాడాం! నేను తలుచుకొంటే... ఒక్కక్షణం చాలు! ఉరికంబ మెక్కించడానికి... కిశోర్! నీ కిదే హెచ్చరిక. నీవు నా బందీవి. బానిసవి... నీ రహస్యంతో, నీ గుండెలు నాగుప్పిట్లో వున్నయ్! జాగ్రత్త! నా రహస్యాలన్నావో? — నిన్నూ దహించిపారేస్తయ్! హుఁ అంతా లోపలికి నడవండి...

(నిష్క్రమణం... తెర)

## 2

(కిందటి కళామందిరమే. ఎవరూ లేరు. నటరాజ విగ్రహంలో గంభీరత శూన్యాన్ని చూరలాడుతోంది... అడుగుల్లో అడుగులు వేసుకుంటూ వెంకటాయుడు ప్రవేశం.)

వెంక : హారే! ఎవరూ లేరేం! బంట్రోతు వెధవ కూడా! హే నటరాజస్వామీ! ఈనాటికి కరుణించావు గదయ్యా!

(హాల్లోంచి లోపలికి వెళ్ళడానికి ప్రయత్నిస్తుంటే రాజయ్య జోరుగా ప్రవేశం)

రాజ : ఎవడ్రాఅది? దొంగలాగొచ్చావు? ఈ రాజయ్యగాడి బడితెబాజా రుచిసూస్తావా?

వెంక : (ఉలిక్కిపడి) రాజయ్యా! నేను...

రాజ : (ఎగాదిగా చూసి) హారి నువ్వా? ముసల్లాయడూ? మళ్ళీ మెడబెట్టి గెంటించుకోనా కొచ్చావూ? ఏటలా దిక్కులుసూస్తా యెదుకుతున్నావ్?

వెంక : నా కడుపుకోత... నా కొడుకోసం... నా కిశోర్... వాడి సవితల్లి రాచి రంపాన పెట్టేది. క్షణం శాంతిలేదు. వాడి బతుకే అంత కాబోలు... ఇల్లు విడిచిపోయాడు. దానిమాట లొక్కక్షణం పడలేకపొయ్యాను. వాడి జాతకంలో ఏం రాసుందో? ఏం అఘాయిత్యం తలపెట్టాడో? నాలుగేళ్ళయింది... ఈ పాటికి పెళ్ళిచేసి, హాయిగా కాపురం చేయింతును...

రాజ : ఐతే, మారుటి తల్లి బతికుండగా కాపురం సెయ్యనిస్తదా? నీ సేదస్తంగాని... కోడలిపిల్లని గూడా గొలుక్కు తినేస్తది...

వెంక : అదింకా ఎక్కడ బతికుందీ? ఏ నాడో మంచమెక్కింది!? దేవుడు లేడూ? నా కొడుకు ఉసురుపోసుకుని, రోగాలూ రొచ్చులుపాలై, చివరికి కన్నుమరుగైపోయింది. చావు బతుకుల మధ్య అల్లాడిపోతూ, 'కిశోర్'ని తలుచుకు తలుచుకు తల్లడిల్లిపోయింది. చివరి రోజుల్లోకి గాని తెలిసిరాందే వాడి గొప్ప. ఆ దీపం ఆరిపోగానే, బెంగపడి చీకట్లోపడి తిరిగాను. ఊళ్ళమీదపడి తీర్థయాత్రల పేరు చెప్పి, వెదికిన చోటే వెదికాను... ఎక్కడ శిల్పం బయలుపడ్డా, ఎక్కడ చిత్రం కనిపించినా, 'కిశోర్' కోసం భ్రమించిపోయాను. చివరికీవూరొచ్చాను. మీ పూలతోటలో ఆ పాలరాతి విగ్రహం నన్నాకట్టి పిలిచింది - 'ఇదిగో! నీ కిశోర్ ఇందులో వుంటాడు చూడు' అంది! ఆ నటరాజ విగ్రహం చూడు రాజయ్యా! ఎంత గంభీరంగావుందో! ఆ చూపుల్లో నా కొడుకు పిలుపులు ఎలుగెత్తి వినిపిస్తున్నయ్! వాడెక్కడున్నా శిల్పం, చిత్రం బయలుపరిచేస్తుందనుకో!

రాజ : అంత గొప్పోడన్నమాట! ఐతే, నీ కొడుగ్గా ఉండాల్సినోడు గాదు... ఏ మారాజా కొడుగ్గానో బుట్టి, కలకటేరుపని సెయ్యాల్సినోడు.

వెంక : లోప లెవరూ లేరా ? అంతా బిక్కు బిక్కు మంటోందే.

రాజ : 'పెదర్సనాలిచ్చినా కళ్ళారందరూ ... మా దాసుబాబుకి నమ్మిన బంటుని... నేనా కిపో (నాలిక్కరుచుకొని) కిపో కిపోమని ఊసూరున వడున్నా. లోపలికి సీమతలకాయ గూడా దూర్చి వొద్దన్నాడు. నువ్వేటి ? యేమనులా దూసుకొచ్చేశావ్ !

(లోపల్నుంచి కేక...రాజయ్యా ! రాజయ్యా! అని.)

వెంక : ఎవరిదా గొంతు ? లోపలెవరూ లేరని అబద్ధాలు కూస్తావేం ?

రాజ : (గాభరాగా) అబ్బే ! ఏం లేదు. లోపలెవరూ లేందే ! అదా ! సిలకగొంతు...సిలకని పెంతన్నాం...కాడ నమ్మసిలక (లోని కుద్దేశించి) పంజరంలో సిలకా ! నోరుత్తకు! అక్కడే వడుండు. బయట కొచ్చావో సచ్చావన్న మాట !...

వెంక : పంజరంలో చిలక బాగా మాట్లాడుతోందే? ఎక్కణ్నుంచి కొట్టుకొచ్చారు ?

రాజ : సానా రోజుల్నుంచి పెంతన్నాం...ఓ రోజు రాతిరేల ఎగిరెగిరి, రెక్కలు టపటప గొట్టు కుంటూ...పూల్తోటలో వాలింది...నే నొడిసి పట్టుకొని, దాసుబాబు కొప్పగించీసేను. ఇప్పు డేటో ఎగిరిపోతా నంటంది ... దాసుబాబు సెప్పినా, సేవనమ్మ సెప్పినా యినకుంటే యిన కుద్ది.

వెంక : ఒక ప్రాణజీవం తీసుకెళ్ళి రెక్కలు విరిచికట్టి వుక్కు పంజరంలో బంధించి—దాన్ని నలిపే స్తున్నారు. పాపం ! ఆ పాపమంతా రాజయ్యా నీదే !...

రాజ : ఆ పాపం నాకే సుట్టుకొందిలే ! రొండవజల్మ... దాసు గారికి వొళ్ళూ కళ్ళూ అంతా అమ్మేసు కొన్నాను...బానిసబతుకు.

వెంక: ఆ చిలకని, పంజరంలోంచి ఎగరేసి పారెయ్యి కూడదూ? ఆపాపం పోతుంది—అది నిన్ను తలుచుకొంటూ అలా అలా రెక్కలు విప్పుకొని ఆకాశంలోకి ఎగిరిపోతుంది.

రాజ: అబ్బో! ఇంకేటన్నా వుందా? దాసు బాబుకి సిర్రెక్కి యీపు సీరేస్తాడు. ఎగరేసినా రెగర్నదులే సిలక! దానికి రెక్కల్లేవు గందా? బయటికి తొంగి సూసిందో, డేగలు తన్నుకు పోతయ్!

వెంక: అది కాదుకాని రాజయ్యా! మీ దాసుకింత ఐశ్వర్యం ఎలావచ్చింది? కళా మందిరం నించి, కాసీ వచ్చేలా కనిపించదే?

రాజ: వస్తే రాకపోవడమేంటి? పెదర్శనానికి, 500రూ తక్కువిచ్చుకోడు గందా? ఇంకా యేటో యేపారంలు సేస్తాడు...అయ్యన్నీ మనకెందు కేటి?

వెంక: అబ్బే తెలియక అడుగుతున్నా...

(లోపల్నుంచి గంట గణగణ మోగింది. రాజయ్య కంగారుపడి పోతున్నాడు...)

వెంక: ఏటా మోగడం?

రాజ: అబ్బే గడియారం అలారం, ఏటి అదెంపే, సూస్తన్నావు? యీ ధంపు తిరుగు...

(మెల్లగా లోపలిద్వారం వైపు జరుగుతూ, గొళ్ళెం వెయ్యబోయే లోపులోనే, కిశోర్ ప్రవేశం. స్వేచ్ఛకోసం అతని హృదయం రెక్కలు తొడుక్కుంది. కళ్ళు కలల్తో విలవిల లాడుతున్నాయి. రాజయ్య కంపరమెత్తుతూ పొమ్మని...సైగచేశాడు. కిశోర్ని దాచడానికి అతని ప్రయత్నాలన్నీ విఫలమైనయ్ పైగా.)

కిశో: రాజయ్యా! నన్నొకసారి బయటికి వెళ్ళనీ— ఒక్కసారి పూలతోటలో హాయిగా...

రాజ: ఫో! సిలకా పంజరంలోకి పో. దాసుబాబుతో చెప్పానా! పీక కోసేస్తాడు.

కిశో: కోస్తే కోయనియ్! ఏమైనా చెయనియ్...నేను వెళ్ళక తప్పదు. ఎవరు చూసినా, ఏం పర్వాలేదు (సంభాషణ విని, వెనుదిరిగిచూసి)

వెంక: హాయ్! రాజయ్యా ఎవరిది...?

రాజ: సిల కెగిరొచ్చేసింది. పంజిరింనించి...

వెంక: (కిశోర్ వైపు పరవశంతో చూస్తూ) హానట రాజహంసా! ఇన్నాళ్ళకి దీనుడిమీద దయ గలిగిందా? అడ్డుతొలగు రాజయ్యా!

(కిశోర్ ఒక్క వూపున, రాజయ్యని నెట్టుకొని, దూసుకొన్నాడు. కిశోర్ ని వెంకట్రాయడు, వెంకట్రాయణ్ణి కిశోర్ ఒకళ్ళ నొకళ్లను ఏదో అపూర్వ మానభావంతో, కొట్టుకుంటున్న కళ్ళతో)

వెంక : బాబూ! నీవు నావాడవేనా? నా కిశోర్ వేనా! ఏమిటిదంతా ... ఇక్కడెందుకిలా కుమిలిపోతున్నావు?

కిశో : నా భావం చక్కగా గ్రహించారు ... నేనెవర్ని? బానిసని ... నా పేరు మీకెలా తెలుసు?

వెంక : నాయనా! నీ చేతిమీద కాలిన మచ్చ...ఏదీ?

కిశో : నా పిన్ని పెట్టిన వాత జీవితాంతం మానదు. ఇన్ని తెలిసినట్టున్నారు. మీరెవరూ?

వెంక : (ఏడుస్తుట్టుగా) నాయనా? నన్ను గుర్తుపట్ట లేవూ? నీ తండ్రిని ... వెంట్రాయణ్ణి ... నా కన్న తండ్రిగుర్తించలేనంతగామారిపోయాను...

కిశో : (స్తబ్దుడై జ్ఞప్తిలో ఏదో మెరుస్తూ) నాన్నా! నీవా! ఎంతగా మారిపోయావు? నీ కడుపున చిచ్చుపెట్టి ఈ ఉచ్చుల్లో చిక్కుకున్నాను... పిన్నెక్కడుంది?

వెంక : ఇంకెక్కడి పిన్నిరా తండ్రీ! దానిదారదే నాడో చూసుకొంది. నీ కోసం వెదికి వెదికి కళ్లు కాయలు కాచేలా ఎదురు చూసి చూసి... ఈ రోజు ... ఈక్షణం ... నిన్ను చూసుకొంటున్నాను. ఎన్ని బాధలు పడ్డావో? ఎక్కడెక్కడ తిరిగావో?

కిశో : (రాజయ్యవైపు తిరిగి)రాజయ్యా! మమ్మల్నిద్దరినీ, అలా ఓసారి తోటలోకి పోనీయ్! మనసులు విప్పి మాటాడుకొంటాం. ఈ మాత్రం సాయం చెయ్యి—జీవితాంతం నీకు ఋణపడి వుంటాం—

వెంక : రాజయ్యా! నీ చేతులు పట్టుకొంటాను. ఈ పిణ్ణోడిలెయ్! నీకూ కొడుకుతీపి తెలిసేవుంటుంది. జన్మజన్మాలకీ నీ కడుపున పుడతాను.

రాజ : ఓరయ్యో! అల్లగై పోతది. నే నొదల్ను... ఇంకానయం ఎవరి కంటన్నాబడితే, ఏటన్నా వుందా? దాసుబా బీలోపులో వచ్చేస్తే ఏటవుద్దో తెలుసా?

వెంక : రా రా కిశోర్! వీడితో ఎందుకు? ఎలా అడ్డొస్తాడో చూస్తాగా?

కిశో : నీకు తెలీయదు నాన్నా! మవ్వూరుకో! దాసుతో చెప్పేశాంటే, నేను పడేపాట్లు లెక్కుండవు... (రాజయ్యతో ప్రాధేయపడుతూ) రాజయ్యా! నా అజ్ఞాతవాసం నీకు తెలుసు. నా కష్టాలన్నీ తెలుసు. ఇంత చక్కని మహూర్తంలో నిన్ను జపించుకొంటాను. నన్నొదిలిపెట్టు! దాసుతో చెప్పకు...

రాజ : (కరిగిపోయి) ఇన్నాళ్ళకి కలుసుకొన్న తండిరీ కొడుకులుని, ఎడబాపులు సేస్తే నాకేటొస్తది? యెల్లండి బాబూ! యెల్లండి! మనసు విప్పి మాటాకుండి రండి! దాసుబాబొచ్చే తలికే, అంతా ఐపోవాల. నేపోతే, నామీద దిరుసుకు పడతడు.

(కిశోర్, వెంకట్రాయడు బయటికి వెళ్ళారు.)

తెర.

## 3

(బయట ఆవరణలో అందంగా పెంచిన పూల తోట...కిశోర్ వెంకట్రాయడు ఒకళ్లనొకళ్ళు కౌగలించుకొని, ఆనందబాష్పాలు రాలుస్తూ పరస్పరం అర్థం చేసుకొనడానికి ప్రయత్నిస్తూ చెట్ల గుబురులనున్న కూచున్నారు.)

కిశో : ఇంకేవుంది? అంతా సర్వనాశనం...

వెంక: తర్వాత ఏవయిందిరా నాయనా? ఈ దాసుగాడి వలలో ఎలా పడిపోయావురా తండ్రీ!

కిశో : నేనారాత్రి హోటల్లో గదిలో నిద్రపోతున్నాను. తెల్లవారేసరికి, పోలీసులు ప్రత్యక్షమయ్యారు. నా దగ్గరే కత్తి దొరికిందట! వెంటనే లాక్కుపోయారు. ఆ స్త్రీని హాస్పిటల్లో చేర్చారు. తర్వాత ఆవిడేవయిందో నాకు తెలియదు.

వెంక: నాయనా! నీవుగాని ఆ హత్య చేయలేదు గదా!

కిశో : నాన్నా! నన్ను నమ్మవా? కత్తిచూస్తేనే గజగజలాడి పోతానే! ఎవరికేనా చిన్న దెబ్బ తగిలి రక్తం కారితేనే, తల్లడిలి పోతానే! అలాం

టిది...ఓ స్త్రీని హత్య చేయడం... నేను హత్య చేశానంటే ఎవరూ నమ్మలేదు. ఎన్ని కడవల పచ్చిరక్తం తాగితే, నేను హత్య చేయగలను నాన్నా!

వెంక: బాబూ! నువ్వు చెయ్యవు...నువ్వు చేయలేవు ...నీ నెత్తిమీద ఎంత అపనింద గద్దలా వాలింది! ఆ ఖూనీచేసిన దుర్మార్గుడు చితిమీద వ్రేలిపోతాడురా!

కిశో: ఆ హంతకుడు నా గదిలోంచి తప్పించుకు పోయేటప్పుడు కత్తి నాదగ్గర పారేసిపోయాడు. అది నా పీకలు చుట్టుకొంది. జైల్లో చీకటి కొట్లో పారేశారు. పశువుని బాదినట్టు బాదారు. చంపానని అబద్ధమాడమని, ఆక్రోశించారు. నాకిప్పుడు తలుచుకొంటే కళ్లు గనుక్కొస్తోంది. నేను చంపంది ఎలాచెప్పను? ఆ రాత్రే జైలరు పొరపాటున తాళం వెయ్యడం మానేశాడు. నటరాజస్వామి నామీద ఒక చూపు విసిరాడు. అప్పుడే, ఒక తీర్థంగుంపు పోలీసు స్టేషనుమీదుగా జరుగుతోంది. అందులో కలిసిపోయాను.

వెంక: (మౌనంగా వింటూ) తర్వాత ఏమయిందిరా నాయనా! ఎక్కడెక్కడ తిరిగావు? ఈ దాసు గాడెక్కడ దాపురించాడు?

కిశో: తిన్నగా యింటికి పారిపోయొచ్చేద్దామనుకొన్నాను. ఎక్కడెక్కడో నక్కి అర్ధరాత్రి ఈ పూలతోటలో నక్కాను. దాసు పన్నిన వలలో చిక్కుకున్నాను. నాలాంటి కళాకారుడి కోసమే ఇంతకాలం ఎదురుచూశాట్ట! ఐతే నేనొచ్చింది మరోరకం జైల్లోకని తెలియడానికెంతో కాలం పట్టలేదు. నారహస్యం ఆయన దాచడానికి, ఆయన రహస్యం నేను దాచడానికి...అంగీకారం కుదిరింది. ఈ క్షణం వరకూ నాకళనూ నా జీవిత సర్వస్వాన్ని ప్రక్కదారుల పట్టించాడు. ప్రపంచాన్ని బ్రహ్మాండంగా మోసగించడానికి కుమ్మం ముందు నటరాజ విగ్రహాన్ని పాతుకొన్నాడు. నా రక్తనాళాల్లో స్వేచ్ఛనీ మనస్సునీ అరికట్టి సూదులు నుచ్చాడు. నన్నొక క్షణం బయటికి పోక నివ్వడు. కళామందిరంలో ప్రతీ సౌందర్యాణువులో నా ఘోష వినిపించాను. నాన్నా నా చిత్రాలన్నీ చూశావా? ఈ తోటలో పాలరాతి విగ్రహం...

వెంక: చూశాన్రా తండ్రీ! చూశాను. ఈ పాలరాతి విగ్రహమే, నీ ఉనికికి దారి తీసింది.

కిశో: ఇప్పుడు దాసుకూతురు శ్రావణి నన్ను ప్రేమిస్తున్నదట? స్వాతంత్ర్యంలేని నా బతుకున ప్రేమకు తావేది? నాన్నా! ఎండపొడగాని, వెన్నెల నీడగాని, నా శరీరం మీద పడదేం? దానెలా వప్పుకొంటాను మా ప్రేమని! ప్రేమ హక్కు నాకీ జన్మలో లేదని, ప్రేమించవద్దని, ఖండితంగా చెప్పేశాను...పరిసరాలమీద ప్రసరించడంకంటె, ప్రణయానికి వేరేదారి లేదనుకొంటాను.

వెంక: దాసుకీ నీకూ మధ్య వున్న రహస్యపు తెర తొలగించరా! తండ్రీ! నిన్ను రక్షించుకొంటాను.

కిశో: ఆ నటరాజస్వామి దిగొచ్చినా, నన్ను రక్షించలేడు. ఎందుకింకా ఆశపెడతావు? ఆరహస్యం నన్ను దహించి పారేస్తుంది.—

వెంక: నువ్వెందుకు నిర్బంధంలో వున్నావో నాకర్థం గాదురా! ఆ దాసు నిన్నే అనేక తెరలో నొక్కిపట్టాడో తెలియటం లేదురా! నీ రహస్యం నేనూ నీకు బరువుగాకండా మోస్తాను. అదేదో చెప్పు...

కిశో: ఎలా చెప్పనెలా చెప్పను? బయటికి చెప్పేస్తే ఇంకేమున్నా వుందీ? ఈ కళామందిరానికే ద్రోహం చేసినట్టు.

వెంక: దేవుడి పేర నాట్యం పేర మీ దాసు ఆడుతోన్న నాటక మేమిటి? అంతమాత్రాన, రహస్యం బయలుపరిచినా పాపం లేదు!

కిశో: ఎన్ని ప్రమాణికాలు...ఎన్ని ఒట్లు వేశానో? ఆఖరికి నీమీదకూడా...

వెంక: ఐనా ఫరవా లేదు. లేకపోతే నువ్వీచీకటింట్లో, చితికిపోవలసిందే!

కిశో: 'స్వేచ్ఛ స్వేచ్ఛ' అని ఉబ్బితలూగుతానేగాని బయటికొచ్చి నేనేం జీవించగలను? పోలీసుల భయం నన్నెప్పుడూ వెన్నాడుతూనే వుంటుంది. వేటకుక్కలు నన్ను తరిమి తరిమి కొట్టడాని

ఎప్పుడూ వేచివుంటయ్! ముందు శాపం... వెనక పాపం...ఎక్కడికీ పోలేను...

వెం : ఐతే చెప్పవన్న మాట! కన్నతండ్రికి చెప్ప కూడని రహస్యమేమిటి? బాగా ఆలోచించుకో!

కిశో : నన్నిబ్బంది పెట్టకు! నేను చెప్పలేను.

వెంక : (కోపంతో) చెప్పకపోతే చావు. పునాదుల్తో సహా కదిలించేస్తాను! ఒక్క పోలీసు రిపోర్టిచ్చానూ అంటే, నిన్నూ నీ మందిరాన్నీ దాసునీ సమూలమట్టంగా చుట్టు ముట్టి వీా అంతు తేల్చేస్తారు...

(రాజయ్య పరుగెత్తుకుంటూ వచ్చి)

రాజ : వాళ్ళొచ్చేస్తున్నారు! త్వరగా తెములుదురండి! (వెళ్ళాడు)

కిశో : నాన్నా! అంతపని చెయ్యకు. ఇంత మందిని, జైల్లో త్రోయించి, నువ్వేం బావుకోలేవు—

వెంక : ఒక్క చిన్న రహస్యం చెప్పడానికి, నివ్వింత రాద్ధాంతం చేసేస్తున్నావ్? ఆ దాసుగాడు నీకేదో మాయమందు పెట్టాడురా!

కిశో : నాన్నా! నా పరిస్థితుల బలవంతం నన్నిలా కట్టిపడేసింది గానీ ... ఐనా విను ... (చెవులో చెప్పాడు రహస్యం) ఎక్కడా పొక్కనివ్వకు. పొక్కనిచ్చావో, ఇక చచ్చినట్టే!

వెంక : హరి పిడుగా! ఇంత నాటక మాడుతున్నావురా వాకొడుకు నష్టంపెట్టుకొని ... దాసూ! నీ ఆట కట్టిస్తా...నీ అంతు తేలుస్తా!...

కిశో : నాన్నా! ఈ రహస్యంలో నేనూ ఉన్నానని మరిచిపోకు...నువ్వెవరికీ ద్రోహం తలపెట్టకు.

వెంక : ఎంత ద్రోహం! ప్రజాద్రోహం! ప్రభుత్వ విద్రోహం! కిశోర్! ఈ వలనించి నిన్ను విముక్తుణ్ణి చేస్తా...

(కిశోర్ లోపలికి, వెంకట్రాయుడు వెలుపలకి వెళ్ళిపోతున్నారు.) తెర.

## 4

(నటరాజ విగ్రహం ముందునుంచి, కిశోర్ ఏదో ఆలోచిస్తున్నాడు ... అతని పెదవుల్లో మౌనం...అతని కళ్ళల్లో మౌనం ... అతన్ని మౌనంలోంచి పిలుస్తూ శ్రావణి ప్రవేశం...)

శ్రావ : ఏమిటంత మహాదీర్ఘంగా ఆలోచిస్తున్నావ్ కిశోర్?

కిశో : (తేరుకుని) ఏమిటి? అప్పుడే వచ్చేశారా? ప్రదర్శనం నించి...

శ్రావ : హాఁ ఎప్పుడూ అంత ఘనంగా జరగలేదు ప్రదర్శనం. ఇక ఏనాడూ అంత గొప్పగా నాట్యం జరగదు మన కళామందిరం ద్వారా...

కిశో : అలాగా! అంత గొప్పగా జరిగిందా?

శ్రావ : మన 'ధనలక్ష్మి' సంకేతమా! నీకళాముద్రలూ, రూపముద్రలూ చూసి ఆశ్చర్యపోయాడు కళ్యాణి నాయుడు...వీసమెత్తు తేడా కూడా కనిపించకుండా ధనలక్ష్మి 'ఘులంఘుల' నృత్యం చేస్తుంటే మన వ్యాపారానికేం లోటు కిశోర్! అదంతా నీ ప్రభావం...

కిశో : ఏం చేస్తే, ఏం లాభం! అలమటించే దొకరూ, అనుభవించేది మరొకరూ...ఇదీ ప్రపంచం శ్రావణీ!

శ్రావ : కిశోర్! ఏమిటా అన్యాపదేశం! నీ యిష్టం వచ్చినట్టు మాట్లాడితే నేను సహించను.

కిశో : ఆ దాసుగారి కూతురివి నువ్వేలా సహిస్తావు... నువ్వొక ఆట......నీ తండ్రొక ఆట...ఆడుతున్నారు నాతో...

శ్రావ : ఇది నీ అంకితం నువ్వు కోనితెచ్చుకొన్న తిద్దినం...

కిశో : నేనేం నేరం చేశానని...అందరూ చిలకల్ని గోరింకల్ని పంజరాల్లో బంధించి, పెంచుతారు, మీరు మనుషులుమనుషుల్ని ఉక్కుపంజరాల్లో బంధించి పెంచుతున్నారు! మీరూ అసలైన మనుషులంటే...

శ్రావ : నువ్విలా వక్రంగా మాట్లాడితే, నేనేం చెయ్యను కిశోర్! నా న్నేం చేయగలరు? ఎవరేం చేయగలరు? ఏనాటి కర్మో ఈనాడనుభవిస్తున్నావ్!

కిశో : నన్నెవరూ ఏం చేయనక్కర్లేదు. నా దారిని నన్ను పోనివ్వండి! మారువేషంలో బతుకుతాను. మనిషిని పూర్తిగా మారిపోతాను...ప్రకృతి సౌందర్యంలోలీనమైపోయి, అందనిఆకాశాన్ని, అందాల తారాచంద్రుల్ని, చీకటి చీరలు

విప్పుకొని, వెలుతురు ధారలు చుట్టుకొనే ఉషఃకాంతుల్నీ, సంధ్యా సుందరుల అరుణాధరాల్ని పీల్చి చుంబించేనిశాచరుల్నీ చూస్తూ, జీవితం మలయమారుతంలా వీచుకొంటాను.....

శ్రావ: నీ స్వేచ్ఛ నెవరూ అరికట్టలేరు కిశోర్! నీ హక్కుల్నెవరూ త్రోసిరాజనలేరు, ఆ ప్రవాహం ఎప్పుడో కట్టలు త్రెంచుకుంటుంది. నిజంగా నిన్ను చూస్తే...జాలేస్తోంది కిశోర్! ఐతే, నేను నీకేం సహాయం చెయలేను! నిన్ను నా హృదయ దేవాలయంలో నిలుపుకొన్నాను.

కిశో: (శ్రావణి కళ్ళలోకి చూస్తూ) నువ్వేం చేయలేవు! నన్నో యంత్రంగా మార్చి, నాజీవితంతో ఆడుకొంటావ్. నీకో హృదయమూ– అందులో దేవాలయము కూడా వున్నయ్యా? పురుషుల్నాకర్షించుకొంటూ తిరిగే సీతాకోక-చిలుకవి ...గొంగళిపురుగులా పుట్టావు! ఈనాడు సీతాకోక-చిలుకలా ఎగురుతున్నావు! ఈ డబ్బంతా మీ కెలా వస్తోంది? ఎవడి దీ భిక్ష? చివరి కెవరికి పడుతుందో శిక్ష!

శ్రావ: ఎవరికి పడుతుంది శిక్ష? నీకే! పాపభీతి కూడా ప్రదర్శిస్తున్నావ్! పాపం! నువ్వే లేకపోతే ఈ పాపం మేం చేయక పోయ్యేవాళ్ళమేమో! అచ్చులు చెపిచ్చావు. రంగులు తయారుచేశావు!

కిశో: ఔను! నా గుండెని అచ్చు వ్రాసి యిచ్చాను. నా మనసులో ఊహలు రంగులు వ్రాసిఇచ్చాను. అవే మీరు మార్చుకొని, మేడలు కట్టుకొన్నారు. బంగారు గోడలు కట్టుకొన్నారు.

శ్రావ: ఎందుకీ ఆవేశం! కిశోర్! (గోముగా) నా మాట విను. మనిద్దరం ఒకటైతే, మనల్నెవరూ గెలవలేరు.

కిశో: పిచ్చిదానా! నా పేరు అంటరాని వస్తువు. నా రోగం గుర్వినిరోగం...నా జాతకం మహా పాతకం...నాకు ప్రేమ లేదు; పెన్నిధి లేదు. నన్నెవరూ సమర్థించేవారు లేరు! కోరికతో తలనొక్కుంటానంటావేం?

శ్రావ: నాకా భయం లేదు కిశోర్! నీవు హుషార్‌గా వుండు. నన్ను బాహాటంగా ప్రేమించు. మా నాన్నతో సంగతి నేను చూసుకొంటాను. నిన్ను లోకం గర్హించదు. నిన్ను హంతక కిశోర్‌గా లోకం గుర్తించదు. నీ శీలానికి గీటురాయిగా మన వివాహం జరిగిందంటే, ఆనంద స్వర్గాలు చేరుగా మన నటరాజస్వామి ముందు మోకరిల్లుతాయ్!

కిశో: నీ ఊహలకి చక్కనిరంగు లేసి, గాలిలోకి వదులు శ్రావణీ! అవి ఆకాశంలో గాలిపటాల్లా ఎగురుతుంటయ్! వాటిని దారాలతో తేలిగ్గా ఆడించొచ్చు! మగతనంలో ఏ 'అణుతణం' పగిలి ఏ విలయం సృష్టిస్తుందో ఊహించలేవు గాని, స్వర్గానికి నిచ్చెనలు వేస్తున్నావు!

శ్రావ: ఐతే, నేనంటే నీ కిష్టంలేదా? నా మనస్సు నీకర్థంకాలేదా? ఏం? నే నేం అందంగా లేనా?

కిశో: అందం......నా భావ సౌందర్యంలో నీ దెన్నో వంతు? నా ఊహావిశ్వంలో నీ నువ్వన్నో కణం? 'ఇష్టం'తో నిమిత్తముంటే, నే నీ ఉక్కు పంజరంలో చిక్కుకొనక నే పోదును!

శ్రావ: నీమీద, నీ శిల్పాలమీద, నీ చిత్రకళమీద ఏ కేవో మనసులు పోతూను......నా ఆశలు భగ్నంచేస్తే నేను బతకలేను!

కిశో: నా స్వాతంత్ర్య సమస్య తొలుత నివారింపబడాలి! నా హక్కులు నాకు సంక్రమించాలి! నామీదిఅపనిందలు తొలగిపోవాలి! అనాడే, నేను మానవుణ్ణి. అప్పుడే నే నెవర్నైనా ప్రేమించడానికి హక్కుంది. నా యీ దానిసత్వంలో పెళ్ళినిగురించి ఆలోచించే అధికారమే లేదు శ్రావణీ!

శ్రావ: శభాష్! కిశోర్! నీవు మహా శిల్పివి—కళావేత్తవి...నీవు చీకటిలోనే చిక్కి చిలికిపోతున్నా, నీ జిజ్ఞాస ఎంత బలీయమైంది? నీ సౌందర్య తృష్ణకి హద్దులేదా?

కిశో: చక్షువు నిర్ణయించేదే సౌందర్యంకాదు శ్రావణీ! దాని వెనక ఇంద్రియాల కందని, అంతరంగ సౌందర్యం ఒకటున్నదని, నీవు మర్చిపోతున్నావు...అదికూడా పరిణతి నందినపుడే నా కళ సార్థకమౌతుంది—

(నారాయణదాసు ప్రవేశం బయట్నుంచి)

శ్రావణి: నాన్నా యింతసేపూ నీ దెక్కడున్నావ్!

నారా: అబ్బే! అలా పూలతోటలో హాయిగా స్వేచ్ఛగా గాలి పీల్చుకుంటూ తిరుగుతున్నాను. అలా ఏకాంతంగా కూచుని, ఆకాశంవైపు చూసుకొంటూఆలోచించడంలో ఎంత ఆనందం వుంది శ్రావణీ! (కిశోర్ వైపు చూసి) ఏమిటి? చర్చలూ సంప్రదింపులూ మంచి ఉన్నత స్థాయిలో కొనసాగుతున్నయ్. (ఒకళ్ల మొఖా లొకళ్లు చూసుకొంటున్నారు.)

శ్రావ: అబ్బె! ఏమీలేదు.

కశో: అబద్ధం...ఏమీ లేకపోవడమేమిటి? అంతా మాగురించే!

నారా: ఔను. ఉత్తమ కళారాధకుడి కెపుడూ అపూర్వ ప్రశంసలే! మన రూపాయెక్కడి కెళ్ళినా కంచుఘంటలా మోగుతుంది!

శ్రావ: ఆ మ్రోగడం వెనకాల మన గుండెల అదురు కూడా వుందని తెలుసుకో నాన్నా!

నారా: గుండె లదరడంకూడానా? గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించబోయిందట......ఈ దాసుకి కొడుకు దాసోహమంటుంది—ఈ వ్యాపారంలో కొన్ని లక్షలు మార్చాను. నన్నెవ్వ రాక్షేపించేది పిచ్చి పిల్లా!

శ్రావ: ఔను. ఒకణ్ణి బానిసగామార్చి ఆ రక్తంతో ముంచుకొని, కొన్ని లక్షలు మార్చాం. ఈ శ్రమంతా ఎవరిది? అతణ్ణి నీ స్వార్థాని కుపయోగించుకొనికూడా గుర్తించలేకపోయావు!

నారా: కిశోర్! ఇందాకణ్ణుంచి శ్రావణకి నూరి పోస్తున్నదంతా యిదా? నల్లనివన్నీ నీళ్లు తెల్లనివన్నీ పాలు అని నమ్మే అమాయకులుని మోసగించి బుట్టలో వేసుకొందామని చూస్తున్నావా? అదెన్నటికీ సాగదు!

శ్రావణి: పాపం కిశోర్ కేం తెలియదు నాన్నా!

నారా: (నిరసనగా) 'కిశోర్' ఎవడురా వాడు! నా బానిసీడు! నా చెప్పుకింది నాపుసపడు. పూత్కరించాడో కసిక్కిన నొక్కి పారేస్తాను. 'కిశోర్' మన వ్యాపార మహాప్రభంజనంలో గడ్డిపోచ. వాడి దేవుంది ఈ నాటకంలో పాత్ర? ఒట్టి గాజుపాత్ర! వెయ్యి జార్చానో ముక్కలు ముక్కలై పగిలిపోతుంది—ఏనాటికీ అతికదు శ్రావణీ!

శ్రావణి: నువ్వెన్ని చెప్పు! కిశోర్ని నేను ప్రేమిస్తున్నాను. అతని నీడగా జీవిస్తాను! మేమిద్దరం ఒకరైతేనే నీవూ సుఖిస్తావు! రా! కిశోర్!...

(కిశోర్ శ్రావణి లోపలకి వెళుతున్నారు.)

నారా: హుఁ ప్రేమిస్తుందట! ప్రేమ...

(తెర)

## 5

(హాల్లో నారాయణదాసు, డ్రాయరు ముందు కూచుని, ఫైల్సూ ఎక్కవుంట్లు చూసుకుంటున్నాడు. హఠాత్తుగా కళ్యాణి నాయుడు ప్రవేశం.)

నారా: రండి! రండి! నాయుడుగారూ!...ఊరక రారు మహాత్ములు...ఏదో విశేషం వుంది. మళ్ళీ మన వ్యాపారానికి సావకాశమేమైనా చిక్కిందా?

కళ్యాణి: దాసుగారూ! మీరింకా దొడ్డిదారి నే వున్నారు. అవతల కొంపలంటుకు పోతుంటే.. ఈ ప్రకటన చూడండి!

నారా: (ప్రకటన అందుకొని) హాఁ! పికిలిపిట్ట కూతల్ని రాంబందులు లెక్క చేస్తాయటండీ! ఇలాంటి ప్రకటనలు చాలా చూశాం! అంత మాత్రంచేత మన ఉద్యమం మానుకుంటామా?

కళ్యా: నామాట వినండి! మీదగ్గరుండే నోటుకాగితాలన్నీ తగలబెట్టండి. మచ్చుకైనా లేకుండా అచ్చులు మటుమాయం చేయండి! ఊఁ ఇప్పుడే బయల్దేరండి!

నారా: కావాలంటే మీదగ్గరుండేవన్నీ కాల్చుకోండంతేగానీ...మమ్మల్నీ ప్రపంచంలో ఎవరూ అనుమానించలేరు...నాట్య కళారాధకులం... మా నటరాజస్వామి అండ ఎప్పుడూ మాకుండనే వుంది!

కళ్యా: మీ మూర్ఖత్వానికి ఏం చెయ్యాలో అర్థం కావడం లేదు. మీ హస్తముద్రలూ, రూప ముద్రలు అన్నీ మీకిచ్చేస్తాను. నా సొమ్ము నాకు పారెయ్యండి.

నారా: (భద్రుడలేచి) నాయుడుగారూ! ఏమిటిదంతా ఏదో ప్రకటన చూపించి మమ్మల్ని బెదిరిస్తున్నారా? మారకం జరిగిన తర్వాత మళ్ళీ ఈ జన్మలో పుచ్చుకోవడమనేది జరగదు...

కళ్యా: దాసూ! రాబోయే తుఫాను ప్రళయ రూపంలో ప్రత్యక్షమౌతుందని గుర్తించలేక పోతున్నావు...

నారా: ఏం నాయుడూ జోస్యం చెప్పడం నేర్చుకుంటున్నావా?

(శ్రావణి లోపల్నుంచి కంగారుగా ప్రవేశం)

శ్రావ: నాన్నా! ఏమిటిదంతా...? నాయుడుగారూ! ఇప్పుడేం వొచ్చిపడింది...?

(ఎవరూ మాట్లాడరు. డ్రాయరుమీదున్న ప్రకటన తీసి కొన్ని పదాలు తగ్గించి, చదువుతోంది.)

శ్రావ: 'మహాజనులారా!...—దలాయిణీ ఎక్కువగా సాగుతోంది. మా డిపార్టుమెంటువారు—తయారు చేసేవారిపై నిఘా వేసి వుంచారు. ఈ లోపున ప్రజలంతా సహకరించాలి! ఎక్కడున్నా సరే, చట్ట వ్యతిరేకుల్ని, ప్రభుత్వ వంచకుల్ని ప్రజాకంటకుల్ని వేటాడి తీరుతాం—మీ కనుమానంగా, ఎక్కడైనా ఏది దొరికినా సరే, కనిపించినా సరే, వెంటనే, మా డిపార్టుమెంటుకు కప్పగించండి! మాతో సహకరించేవారికి తగువిధంగా బహూకరిస్తాం.' ఇట్లు—పోలీసు కమీషనరు......

నాన్నా! అవతల కొంప అంటుకుపోతుంటే, నీళ్లు నవుల్తూ కూచున్నావా? నాయుడుగారూ! మీరైనా చెప్పండి!

కళ్యా: ఎంత చెప్పినా, ఆయన తలకెక్కడం లేందే ఏంచెయ్యమంటావ్ తల్లీ! వినాశకాలంలో విపరీతబుద్ధులని ఊరికే అన్నారా?

(లోపలగోడ కూలుతోన్న చప్పుడు కిశోర్ లోపల్నుంచి కంగారుగా వస్తూ)

కిశో: ఐపోయింది...అంతా సర్వనాశనం ఐపోయింది. 'నేమా'లో ఉన్నదంతా పడి కూలుతోంది. కూలుతోందేమిటి? కూలిపోయింది. నేను ఇవతల ద్వారం దగ్గరుండబట్టి సరిపోయింది. లేకపోతే నేనూ అందులో కూరుకుపోవాల్సిందే!

శ్రావ: } హా! ఎంత ప్రమాదం తప్పింది! పోతే
కళ్యా: } పోయిందిలే, కనీ బిరగడైంది!

నారా: హా! సర్వనాశనమైపోయింది... వేలు విలువ చేసే, నా యంత్రాలు, నా 'నేమా'—'నేల మాళిగ' కూలిపోయింది. నటరాజస్వామీ? ఏమిటీ అగ్నిపరీక్ష? రండి! పదండి! చూదాం!

(హఠాత్తుగా ఇనస్పెక్టరు, వెంకట్రాయుడు, ఇద్దరు పోలీసులు ప్రవేశం)

ఇన: ఆగండి! ఒక్క అడుగు ముందుకు వేశారా? (పిస్టలు చేతిలో ఆడిస్తూ) ఇందులో కిశోర్ ఎవరు?

వెంక: వాడేనండి! వాడే...నా బంగారు తండ్రి!

ఇన: కిశోర్! నిన్ని నారాయణదాసు నిర్బంధించారా?

కిశో: (దాసు ముఖం చూస్తూ) హూఁ!

ఇన: దాసుగారూ! మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాను. (పోలీసులనుద్దేశించి) మీరు లోపలికెళ్లి తనిఖీ చేయండి!

(పోలీసులులోపలికి వెళ్లారు)

నారా: వాడేనండి! 'కిశోర్'. జైలునుంచి పారిపోయొచ్చిన హంతక ఖైదీ అండి!

ఇన: అదంతా మాకు తెలుసులెండి! మా పోలీసు లను

మానంమీద 'కిశోర్'ని పట్టుకొన్నారు. తర్వాత హంతకుడి అసలు స్వరూపం దొరికిపోయింది. ఆ స్త్రీ మరణ వాఙ్మూలంలో హంతకుడి జాడలు చెప్పింది- కత్తిమీద వేలి ముద్రలు గాని, రక్తపు మరకలుగాని కిశోర్‌వి కానే కావు. అతనిమీద ఆ నేరం తోలగిపోయినా, మరి కొత్త నేరంవచ్చి అతని నెత్తిమీద విరుచుకు పడుతోంది.

వెంక : ఇనస్పెక్టరు గారూ! మీరుచేసిన వాగ్దానం మరిచిపోతున్నారు.

ఇన : కిశోర్! నిన్ను అరెస్టు చేస్తున్నాను.

శ్రావ : ఇనస్పెక్టరు! నన్ను క్షమించండి! కిశోర్ వట్టి అమాయకుడు. అతనికేం తెలియదు. నేర మంతా మాది!

నారా : ఇనస్పెక్టరూ! ఏమిటీ దౌర్జన్య కాండ! మా కళానిలయాని కెందు కింత ద్రోహం తల పెట్టారు? కళారాధనే జీవిత లక్ష్యంగా, ఈ శ్రావణ కళామందిరంలో మాకు మేమై జీవితం సమర్పించుకొన్నామే! అలాంటి మమ్మల్ని మానించి...

ఇన : నారాయణ దాస్! కళ పేరిట, ప్రజలపేరిట ఈ నటరాజస్వామి చాటునకూర్చుండి దొంగనోట్లు అచ్చువేశారు. దొంగనాణాలు ముద్రించారు. ప్రభుత్వాన్నీ ప్రజల్ని భారీ ఎత్తున మోస గించారు! ఈ నాడు మీపాపం పండింది! ఏమంటారు నాయుడు గారూ!

కల్యా : అబ్బె నేనేమంటాను?... వెళ్లొస్తా నండి! మీరంతా చాలా కష్టంలో వున్నారు. పాపం! వెళ్లొస్తా.

ఇన : ఆ పాపంలో మీకూ వాటావుంది నాయుడు గారూ! మీ లెక్కాడి కడతారు! చెలామణీ చేయడంలో దాసుగారికి చేయితిరిగిం దని పించుకొన్నారు. చుట్టాలతో మీరూ 'అత్త వారిం'టికి పదండి!

కల్యా : నా కిందులో ఏం సంబంధంలేదు. నన్నెందుక్కలుపుతారు? అనవసరంగా నాతో శ్లోక్యం చేసుకొంటే, పరువునష్టం దావా వేస్తాను...

ఇన : పాత్ర్యంతో సహా మీదగ్గరున్నంచి, బయల్దేరిన దొంగనో టిదిగోండి! ఈసారి బాగా చూడండి! (నోట్లు చూపించాడు).

(పోలీసులు లోపల్నుంచి వచ్చి)

పోలీ : సార్! అంతా లోపల ఖాళీపోయింది సార్! చీమ దూరడానిక్కూడా సందు లేదండి!

ఇన : మన మొచ్చే లోపలే కాల్చి పారేశా రన్నమాట! దాసుగారి రెత్తుకు పై దొత్తులో వున్నారు... హూఁ అందరూపదండి!...తోడు దొంగలు...

నారా : ఇనస్పెక్టరు గారూ! తప్పంతా నాది... 'కిశోర్' అమాయకుడు...అతన్ని నేనే బంధించాను. అతన్ని బానిసగా చేసుకొన్నాను. నోట్లు అచ్చువేసింది నేను ... అతన్నొది లెయ్యండి!

ఇన : అదంతా కోర్టులో...పదండి!

(అంతా బయటికి నడుస్తున్నారు)

నారా : వెంకట్రాయుడు గారూ! దిక్కు మాలిన దైపోయింది శ్రావణి ... ఎలా కాపాడు కొంటారో? మీ మీదే భారం...

శ్రావ : (దుఃఖం దిగమింగుతూ) నాన్నా! నే నింకెలా జీవించను?...

వెంక : అంతా ఆ నటరాజస్వామిలీల... హే జగన్నాటక సూత్రధారీ! మా మొరాలించు... నా కొడుకుని రక్షించు...(మోకరిల్లుతాడు విగ్రహం ముందు) తెర.

# హరివంశము: సంవృతి మాధురి

శ్రీ మల్లంపల్లి శరభయ్య

భాగవత దశమస్కంధ వస్తువునకు, హరివంశ వస్తువునకు అనేక సామ్యాంశములలో భేదము కలదు. ఈ పురాణముల రచనలయందలి లక్ష్యభేదము దీనికి కారణమైయుండును. హరివంశము భారతేతిహాసమునకు అనుబంధము. లీలామానుష భావమును అవతరించిన నారాయణుని కల్యాణగుణానుకీర్తనము భాగవతమునకు ప్రవర్తకము, పరాయణమునునై యున్నది. వసుమతీ భారావతారోద్యమమునకు మానుషభూమిక కైకొనిన పరమేశ్వరునకు ఉద్దిష్ట లక్ష్య నిర్వహణమునందు భేదములేదు. భూమికా నిర్వహణ విషయమున భాగవతమునుపట్టి శ్రద్ధా శైథిల్యము గోచరించును. పుట్టినంతన చెఱసాలలోనే దేవకీ వసుదేవులకు నిజ స్వరూపము చూపెను. ఆ నడురేయి యమునోత్తరణ ఘట్టమున విభుత్వమును ప్రదర్శించెను. పూతనా శకటాసుర సంహారములలోనైన పరమేశ్వరత్వము మఱుగు పడలేదు. అవల యశోదకుఁ దన యుబుసుపోకకు విశ్వరూపము చూపిన సందర్భము లనేకములు. ఇట్లు ప్రభావ ప్రదర్శనము, పిమ్మట మాయా విస్తరణము ప్రాకృతజనులకు దాఁగిలి మూఁతగా ఖేలావిలాసము నెరపుట భాగవతములో అనుపదము గోచరించును. తక్షక శాపభయార్తివలన సప్తాహములలో ముముక్షువైన పరీక్షిజ్జనపాలునకు భగవత్కల్యాణగుణానుకీర్తన వ్యాజమున తత్త్వ నిరూపణాత్మకముగ శుకమహర్షి ఉపదేశించిన ఉపన్యాస స్వరూపము భాగవతము. అచ్చట కథ అప్రధానము. విషయము ప్రధానము. అడుగడుగున కృష్ణుడు పరమేశ్వరుడన్న భావమును పరీక్షితుని గాని పాఠకులను గాని విస్మరింపనీయమియె దాని లక్ష్యము. అర్హుఁడైన శ్రోత. ఆశ్చర్య భూతుఁడైన వక్త. ప్రతిపదము పరమార్థ విషయములు భాగవతమునందు రాశీకరింపబడినవి. అది అధ్యాత్మనిష్ఠులకు ఉపాదేయమైనంత కావ్యనిష్ఠుల శిల్పతృష్ణకు గాదు. వస్తువు ఒక్కటి యయ్యును దశమస్కంధమున కున్నంతవ్యాప్తి హరివంశమునకు రాలేదు. దానికి వ్యాప్తి వచ్చుటకు, దీనికి రాకపోవుటకు కారణము జనుల కావ్య రసజ్ఞతా లోపమైనంత అధ్యాత్మవిషయనిష్ఠ కాదు.

భాగవతమునందు పరమ గౌరవముంచి హరివంశము కావ్యదృష్టితో అనుశీలింపదగియున్నది. దేశములో ఒక సామాన్యాభిప్రాయమున్నది: భారతము కవిత్రయమే వ్రాయవలయునని; భాగవతమును రచించిన పోతనగారే రచింపవలయునని; ఆ మహాకవుల ప్రవృత్తి వారి కావ్యవస్త్వనురూపమైనదని; విధి విధానము దానికి అనుకూలమై ఆయా గ్రంథములు ఆయా మహాకవుల చేతబడినవని. పోతనకూడ దీనిని వ్యంగ్య మర్యాదచే సూచింపకపోలేదు.

ఒనర న్నన్నయ తిక్కనాది కవులీ
యుర్విం బురాణావళుల్
తెనుఁగున్ జేయుచు మత్పురాకృత శుభా
ధిక్యంబు తా నెట్టిదో
తెనుఁగున్ జేయరు మున్ను భాగవతమున్
దీనిం దెనిగించి నా
జననమ్మున్ సఫలమ్ము జేసెద పుర
ర్జన్మంబు లేకుండగన్.

నా శుభాధిక్యము ఎట్టిదో అనుకొనుట, నాపాల బడుటలోనే భాగవతమునొక్క శుభాధిక్యమున్నదనుట. అట్లే భాగవతము జనారాధ్యమైనది. పోతనగారు భారతమును నిర్వహించు సంభవమును ఊహింపలేము గాని కవిత్రయము భాగవతమును రచించిన ఎట్టుండుననుటకు ప్రమాణముగా హరివంశమున్నది.

ఎఱ్ఱాప్రెగడ హరివంశ రచనాప్రశస్తిని తుల్య వస్తుగ్రహణముచే భాగవతకర్తయు, వస్తుభాగ గ్రహణముచే నాచనసోమనయు కబళించిరి. గోవర్ధనాద్రి ప్రత్యంత భూములయందలి కీలారములలో—పసుల త్రొక్కిడి నెగసిన పరాగములలో-కలయు మాఁగును

లేక యొనరించిన హరివంశ కావ్యేందు బింబము బ్రుంగుడువడి సమధికరమణీయముగానున్నది. యమునా తీరమునందలి ఆ పచ్చికబీళ్ళ అభోగములు, ఆ కీలారములు, కగుపుల సమృద్ధి, పర్వతోపజీవనలైన గొల్లల జీవన క్షీరమాధుర్యము, నవనీతమార్దవము, ఆహైయంగవీన మసృణగంధము—నగరోపాంతీయులకు చాల దవ్వులలో నున్నవి.

కృష్ణావతారవస్తువు కవిత్రయైక నిర్వహణ సాధ్యమైన అద్భుతోదంతము. సంవరణ వివరణాత్మకమైన కృష్ణుని మాయాఖేలనమును చిత్రించుటకు వలసిన ప్రాగల్భ్యము కవిత్రయమునకే కలదు. వివృతమైన కృష్ణుని పరమేశ్వరత్వము భాగవతమునందు ముముక్షువులకు ఆరాధ్యమగుగాక. దాని సంవృతి మాధుర్యము హరివంశమునందు కావ్యజ్ఞులకు మననస్వాదువుగ నున్నది.

ప్రళయ నిశాసముద్రభంగ విభూతి న్యగ్రోధ పలాశమునందు—ఉత్తానశాయియైన శిశువువలె శ్రావణ కృష్ణాష్టమీ నిశామధ్యమున మథురలో—కంసుని చెఱసాలలో దుఃఖసముద్రవీచియైన తల్లి యొడియందలి సద్యఃప్రసూతశిశువు కాలుకేలు అర్చుచుండగా వసుదేవుడు చూచెను. అరిష్టగృహమునందు సూర్యుడుదయించినట్లుండెను. ఆశిశువు నొయ్యనఎత్తి చేతుల నల్లన పొదివికొని వసుదేవుడు అంతఃపురము వెలువడెను. విశ్వంభరుడైన శిశువు నెత్తికొని నడచుచున్న వసుదేవుని అడుగులను నిభృతముగ నిశాగర్భక్షణములు మోపినవి. అంత రేయి రాజునకు పన్నుకట్టుటకై అపుడు రాజధానికి వచ్చియున్న నందగోపుని యింటికి నడచి వసుదేవుడు నవప్రసవయైన ఆ యశోద మాయావిమోహితయై ఒండేమియు నెఱుంగకున్న దశలో ఆమె తల్పమునందు తన శిశువుపెట్టి ఆమె కన్న కూఁతునుగొని మరలివచ్చి దేవకీతల్పమునందుంచి తానే పోయి కంసునకా ప్రసవవార్త చెప్పెను.

ఇచ్చట సంకెలలు తెగిపడలేదు. శేషాహివచ్చి చెఱసాల తలుపులు తెఱువలేదు. యమున పాయపడి త్రోవ యీలేదు. అనంత ఫణామండలచ్ఛత్రము శిశువుపై తూఁగివచ్చుటలేదు. దవ్వులనున్న ఘోషమునకు పోయి వచ్చు వ్యవధానము లేదు. మథురలోనే జరిగిన యీ శిశువ్యత్యయమునకు అమానుషఘటనలతో పని లేదు. మానుషారంభములయందు నిలీనమై దైవమెట్లు సంపన్నప్రయోజనమగునో ఈ హరివంశ సందర్భము గంభీరముగ నిరూపించుచున్నది.

దైవోపహతుడైన కంసుడు దేవకీదేవి పాదములపై పడి క్షమాపణము వేడికొనెను. అశ్రుపూర్ణనయనయై ఆమె 'ఇట్టిశోకము నా కనుభవింపను మద్గర్భంబులకిట్టి పోకలం బోవను మున్న కడగట్టిన తెఱంగు. నీ వేమి సేయుదువు' అనెను. నీవేమిసేయుదువు అనుటలో ఉదాత్తక్షమకు మిగిలి-నిర్దైవములయిన మనుష్యారంభముల అల్పత్వమును వివేచించు వివేకపరిపాకమున్నది.

నాటి వేకువ పుత్రోదయాభినందన వ్యాజమున ప్రియసఖుడగు నందగోపునింటికి వచ్చియున్న వసుదేవుని ఇంగితగోపనము, ప్రసంగచాతుర్యము అరయ తగినవి.

'నీవదృష్టవంతుడవు. అత్యద్భుత లక్షణాన్వితుడు తేజోరాశియునైన కొడుకును గన్నావు. ఈ శిశువు దోడ్కొని భార్యాసమేతముగ మీ కాపురమైన పల్లెకు పొమ్ము. ఈ రాజధానిలో నెందుకు? ఆ వ్రేపల్లెలో రోహిణికన్న నా సుతుడొకడున్నాడు. వానినిగూడ నీ బిడ్డగ జూచికొనుము. వాడు పెద్దవాడు. వీడు రెండవవాడు అను తలంపుతో వీరిని పెంపుము. అడవి అపాయములకు నెలవు. ఏమరకుండవలయును. నాదుఃఖమేమని నీతోఁ జెప్పుదును. పుట్టిపుట్టగనే దేవకికన్న పుత్రులనెల్ల పాపజాతియగు కంసుడు పొట్టఁబెట్టికొన్నాడుగదా! రోహిణి తాల్చిన ఆ గర్భమొక్కటి తప్పి బయటపడినది. వీనిని నీ వెట్లయిన ధరించి నాచే దీవన వడయుము. ఈ యఘోర శిశుఘాతినియైన పూతన అను రక్కసి కంసుని పనుపున శిశుహింసావ్యసనమే దాని పనిగా తిరుగుచున్నది. ఇప్పుడే నీవీ యూరు వదలి పోయి తెల్లవారకమునుపే పల్లెపట్టునకు జేరికొనవలయును. గూళ్ళలో పక్షులు కూయుచున్నవి. తూర్పు తెలుపారుచున్నది. నీ కీ యూఁ వచ్చినపని యైనది. ఇంక ఆలస్యమేల ? కదలిపొమ్ము.'

ఈ మాట పొందికలో మిత్రుని పుత్రోదయమును అభినందించుట, అతనియెడ తన హితైషిత్వము తెరగా—తనకొడుకును అతనికి అప్పగించకయే అప్పగించుటయు, అపాయములనుండి హెచ్చరించుటయు, ప్రయాణమునకు తొందరపెట్టుటలో రహస్య భంగభీరుత్వమును అచ్చుపడియున్నవి.

నందుడు వెట్టిగొల్ల. అతని పుత్రోదయానందము ప్రయాణమ్మును సంరంభము అమాయికమును జానపదత్వమునకు అలంకారములై మిక్కిలి స్పృహణీయముగ నున్నవి. కుదుపు లేకుండుటకై తొట్లలో పెట్టి పురిటిపాపని మోపించుకొని భార్యయు తాను మేటి గుజ్జుల పూన్చిన పాటబండి నెక్కి వెంటనే నందుడు మందకు ప్రయాణమయ్యెను.

ఆశ్రమములు ఘోషములును ఒక్క రూపు. శాంతి రసతరంగితమైన ఇచ్చటి ఘోషవర్ణనము హృదయమునకు క్షీరసముద్రావగాహ సౌఖ్యమును ఆవహించుచున్నది.

పుష్పిత ఫలితానేక తరురాజీ మండితమైన కాళిందీతీరము - తీరము ననుసరించి దీర్ఘ దీర్ఘములైన కోరడులు-కోరడులనడుమ పఱపైన పెఱడులు-పెఱడుల నడుమ వేడుక బీళ్ల పయి మంచుకురిసిన పులు మేసివచ్చి నెమరువెట్టుచు సుఖశయితలై కల్యాణదర్శనలైన కదుపుల వరుసలు-ఆ వరుసల నడుమ క్రేపులు పేరు పేరఁబిలువ పీనుపుటంబు లారవిచ్చి అంభారవానన ములతో ఉత్సవతరంగములై తల్లుల కభిముఖముగఁ గ్రేళ్లుఱుకుచున్న లేగల ఆనందసంచారములు - వెదపూవుల ఉపాంతములలో మలయుచు బలియుటంకెలతో ఒండొకటిఁ జేరనీయక కోరాడు దర్పోల్లసిత మద వృషభముల శాంత గంభీరాకృతులు-ఆవులవోళ్ల నెమరు నురువులు పాలకుండల మసలు తమ శిరీసములకు పెట్టని నగలై, ఎఱ్ఱనెలల కపిలకన్నుల వెషంగుమాపులతో గొరుబెలుఁగులతో జాత్యుచిత బహువ్యాపార నిమగ్నలైన గొల్లలు - వయోనురూపముగ గములు గములుగ యమునాజలాహరణ క్లేశదశాదర్శనీయలు కొందఱు- మృదుగీత విస్తరణైకకాలిక సంప్రవృత్త దధిమథన వ్యాపారపారీణలు కొందఱు-ఘృతతక్రవిక్రయ, గృహసమ్మార్జన, శిశుసమాశ్వాసన, బాలక ధృతిభుక్తి ప్రదానాదులైన గృహకృత్యములవలని చిడిముడిపాటు వెలయ మెలఁగుచున్న గరిష్ఠకుటుంబినులు కొందఱునైన గోపికల ఉదాత్తచేష్టితములతో సర్వప్రకార సుందరమును, వనతృణచ్ఛన్న కుటీరమును, శకటనికటార్పిత మంచకమును, తప్యమాన దుగ్ధ చూత్కార ముఖరమును, దధిబిందు సుందరవేదికమునైన ఆనందఘోషమును ప్రభాతముతో కృష్ణుఁడు ప్రవేశించెను.

ఇచ్చట వర్ణ్యములైన దేశకాలములు ఘోష ప్రభాతములు ఆధారపటముగా అమృత ప్రతిభోన్మీలితమైన ఈ వస్తుసృష్టిలో—చలువయు ప్రసన్నతయు మాధుర్యమును కాంతియు నిండి హృదయమునకు అనిర్వచనీయమైన సమరసస్థితిని గలిగించుచున్నవి.

కృష్ణశైశవ క్రీడారసాలమునకు ఎఱ్ఱాప్రెగడ ఇట్టి అమృతాలవాలమును గట్టెను. వస్తుగర్భమునందలి అమృతమును వెల్లివిరియించు దృష్టియే దృష్టి. ప్రెగ్గడ చూచువిషయములే వేఱు.

బండి దిగిన వెంటనే వృద్ధగోపికలు సపుత్రయగు యశోదకు చేసిన నవమాలికా మంగళమునకు నందుని అంతరంగము హర్షోత్తరంగమైనది. గోకులములో కృష్ణుఁడు గోపికానయన పర్వమై అత్యద్భుతమైన తన ప్రభావము అనిరూపణీయముగ పెరుగుచుండెను.

నందుని కుటీరము. కుటీరాంగణమున అతని పాటబండి. బండిక్రింద తల్పము. తల్పముపై ఉత్తానశాయియైన శిశువు. శిశువుప్రక్క నిద్రించుచున్న యశోద. అర్ధమరేయి పిల్లలను వెదకికొని చంపి తిను రాక్షసి వచ్చినది. వచ్చి అనుభావ చకితయై అంతగత నిలిచి వీఁడు లోకసామాన్య శిశువు కాఁడనుకొనెను. ఆ మూర్తి, అట్టి తేజము, ఆమహిమము, నివాతదీపకళికయై వెలుఁగుచుండఁ దనకు అద్భుత భీతి వ్యామోహ పారవశ్యమును గల్పించుచుండెగ కొంతసేపు నిదానించి చూచెను. శిశు—రాక్షసీ మధ్యమున నడచిన వృత్తమునకు నిశాగర్భమే సాక్షి. ఒక ప్రొద్దురేయికి వికృతమైన ఆర్తధ్వనిని పల్లెలోనున్న వారెల్ల మేల్కనిరి. అంతకుమున్న పిల్లని యేడ్పువిని యశోదయును లేచి ప్రక్కలో పాపనికానక నందుని పిలిచెను. అతఁడు దుదరిపడి నిద్రతెలిసి పరువెత్తికొని వచ్చెను. పల్లెలోనున్న వారెల్లరు వచ్చిరి. వచ్చినవారు చూచిన దొక్కటే వికృత దర్శనము. బండిచక్రము లంతలేసి కన్నులలో తిరుగబడి మెఱయుచున్న గ్రుడ్లతో, అతిమాత్ర దీర్ఘములైన కాలుసేతులతో, ఒసలుపగిలి, ఎముకలునలిసి, చర్మము ప్రోవైపడియున్న రాక్షసీ కళేబరము! అద్భుత భయపరవశులైనవారు రెండవ సారి చూచి కాని దానియొడిలో అవ్యాపన్నుఁడై వెలుగుచున్న కృష్ణుని చూడలేదు. భాగవతమును జదివియున్నవారి కిందలి సంవృతి మాధుర్యము తెలియగలదు. ఈ కరుణ సంభ్రమోల్బణము స్థావర జంగమాత్మకమగు సృష్టిమూలమును గదలించుచున్నది.

'అకట చేఁజెల్ల! చేఁజెల్ల! హా! కుమార!
హా! తనూభవ! హా! వత్స! యనుచు నార్తిఁ
దల్లియును దండ్రియును వచ్చి తనుజుఁ బొదివిరి
అమ్మృగేక్షణ బాష్పాకులాక్షి యగుచు'
కొడుకు నురమున కదిమికొనెను.

అచింత్య హేతువైన ఆపద కడచినపిమ్మట భర్తృత్వాధికార పురస్కృతమైన ఈ మందలింపు వినుడు. 'ఇది యేమి? ఈ రక్కసి ఎక్కడినుండి వచ్చె? ఇచ్చిలుతవానిని ఈ చందంబు సేయ నీవేల ఏమరితివి?' మనుష్యబుద్ధి పరిధికి అందక దైవికమై వచ్చిన ఆపదకు భార్య ఏమరుపాటే కారణమైనట్లు! దీనికి వినయమున్నగామై వచ్చిన సమాధానములో గృహిణీత్వ జననీత్వ భావసంపదలు తొలంకియాడుచున్నవి.

'కడుపు నిండఁగఁ జన్నిచ్చి కొడుకు నిద్ర
వోవ దీవియ ముండఁగఁ బ్రొద్దువోవు
నంతదాఁక మేల్కనియుండి యలసి-కన్ను
కింత మూసితి ఆలస్యమేది యిందు?
ఈ పాపజాతి రక్కసి
ఏపగిదిఁ గడంగి యిచటికేతెంచెనో! యీ
పాపం డిమ్మెయి నెట్లో
బ్రోపఁజేసెనో నిదేమి మాయ పుట్టెనో! ఎఱుఁగన్.
కానక కన్నపట్టి యిటు
కట్టిఁడి రక్కసవాఁత జిక్కియున్
దానొక కీఁడునొందక ము
దంబున నాకిడ చెర-నిక్కువం
బేనళి వాత్సికిం గలదె!
యిట్టి తపంబున పేర్మి—'

ఈ కడపటి చరణమునందలి ఆత్మసమాశ్వాసనము లోకములకెల్ల సమాశ్వాసనము!

'చంద్రబింబాననుఁ డింకపీఁడు
పరమాయురుపేతుఁడు! రొల్లభంగులన్'

ఆనంద వికసితాననుడై నందుడు యశోదకడనుండి తీసికొని కుమారుని తానెత్తికొని గోకరీష మిశ్రితమైన ధూపరాగముతో పాపని నొసట తిలకముంచి రక్షాసూక్త మిట్లు పఠించెను.

శ్రీనాయకుండు రక్షించు నీ ముందర
వేన్న రక్షించు నీ వెనుక దిక్కు
వరుస నీదక్షిణ వామభాగంబుల
రక్షింతు రవ్విహాహాహుహూలు
నీపిరుదు దిగువయు నీరజాహికుకు వా
సుకియు రక్షింతురు ప్రకట కరుణ
దిక్కులుగాచ్చు నీ తక్కినచోటులు
రక్షింతు రెప్పుడు నక్కజముగ
స్వస్తిగావించు నీకు వృషధ్వజుం
డనాకులైశ్వర్యశాలి పినాకపాణి
నిత్య శివలగు గోవులు నియత పుణ్య
రైన భూమియు నిను నెల్లయందుఁ బ్రోచు.

సకల దైవత రక్షకును పితృభావ శబలిత చిత్తవృత్తియైన ఆభీరగృహపతి రక్షకొదిగి యున్న మాధుర్యము చేసుని కొనియాడవచ్చును! భాగవత కర్తకు కృష్ణుని పరమేశ్వర భావమునందే నిమగ్నతయును, పారవశ్యమును. మనుష్య భూమికయందు పరమేశ్వరుడు శైశవమును ఎట్లు ప్రదర్శించునో, అజ్ఞాత తన్మహిమలైన పితృభావనిష్ఠులు అచింత్య హేతువులకు అతని అద్భుతములకు ఎట్లు కలవరమందెదరో, ఆ కలవరము వారి సంస్కృతి భావమాధుర్యమును ఎట్లు శబలితమొనర్చునో, ఈ పరిశీలనము-నిర్వహణము-పరమేశ్వరునివలె శిల్పమునం దేకాగ్రతకల ఎఱ్ఱాప్రెగడ వంటి కవులకే సాధ్యమైన విషయము. కంసుని పనుపున రేపును మాపును పల్లెలో తోచు రాక్షసోత్పాతములను నిలీన మహిముఁడైన విష్ణుశిశువు-తానెఱుగనియట్లు, తాను కానట్లు ఎంత అనాకులముగ, ఎంత నిర్లిప్తముగ కడవఁబెట్టునో ఎఱ్ఱాప్రెగడ నిర్వహణము అంత అనాకులమును అంత గంభీరమునునై జగత్పతిని పుత్రునిగాఁ బడసిన నందయశోదల సంస్కృతి జీవన మాధుర్యమును ఉపరితలమునకు వెల్లివిరియించును.

హరివంశమున పూతనా సంహారము రాత్రి వృత్తము. శకటాసురభంజనము దివావృత్తము. పూతనా ప్రయోగము ఆఱిపోయిన వెనుక కంసుడు శకటాసురుని పంపెను. వాడు వచ్చి నందునివాకిట నున్న బండి నావేశించి సమయము వార్చియుండెను. పాపని బ్రోవరసి పాన్పుపై ఆ బండిక్రిందనే నిద్రపుచ్చి యశోద తోడిసెచ్చెలులతో చేరువనున్న యమునకు జలకేళికేగెను.

రాక్షస సన్నిధానమున శిశువుఁకు మెలఁకువ వచ్చి ఒద్ద నెవ్వరులేక ఏకాంతమున తనలో తా నాడుకొనఁ జొచ్చెను.

నోరన్ జేతులు రెండు గ్రుక్కికొనుచున్
మోమెల్ల బాష్పాంజన
స్మేరంబై తిలకింప నేర్చుచుఁ బొరిన్
మీఁజేతులన్ గన్నులిం
పారం దోముచుఁ జేవఁబూని పిఱుఁదో
యట్లన్ మీఁది కల్లార్చుచున్
శ్రీ రమ్యాంఘ్రియుగంబు గింజికొనుచున్
శైల్యంబు గెట్టించుచున్.

ఈ ఖలరాక్షసుని శిక్షించుటకు కాబోలును. శ్రీ రమ్యాంఘ్రియుగమును కదల్చుచుండె నట.

రాక్షసుడి ట్లాలోచించికొనఁ దొడఁగెను—
'ఒకదిక్కు దొఱగ ల్లాఁగి పైఁ బడుదునో!
తొలఁగి కన్నులు మ్రోయ నిల చలింప
తొడరి నే పలతెంచి త్రొక్కుదునో! పలు
గాఁడి లోనైన యంగముల నొకట
ఎడలించి మీఁదట నెసఁగెదు పరపెల్లఁ
బడఁద్రోఁచి యుండెదనో! పసికూన నేమి
నెరవున వధియింప దొరకొను? నాకిది
యవసరంబని...'

వాని కలవర మెఱిఁగి లీలాశిశువు చిన్నికాలు అల్లన లీలమై చాచి తాఁచెను. బండి తలకిందై ఘంగున లెస్సలి శకలి శకలములై భూమిపైఁ జెల్లాచెదరై పడెను. ఇంతలో లేగతలఁపునఁ బారిన ధేనువువలె నెచ్చెలులను విడిచి వేగ సుస్నాతయై యశోద యమునవుండి యింటికి వచ్చెను. వాకిట అఱవఱలై పడియున్న బండి చూచి ఆమె ప్రాణము పైనఁబోయెను. పరువిడి వచ్చి కొడుకు నెత్తికొని యురమున కదిమికొని—

నిన్నిటు పాఱవైచి తెగ
నిద్దురపోయెడి పాపఁడంచు నే
మిన్నక నీళ్ల నాటయను
మిత్తికి నేటికిఁబోయితిన్ నిజం
బన్నకుమార! యింకిపుడ
యుద్ధి భవజ్జనకుండు వచ్చిన
న్నన్ని తెఱంగులన్ బఱపఁ
డింతియుఁ జూచిన నర్పు నల్కతోన్.

కొడుకునకు తప్పిపోయిన గండముకూర్చి కన్న ఆగామి భర్తృకోపమునకు ఆమె తలంకఁజొచ్చెను. ఈ బండి యిట్లగుటకేమి హేతువు! దీని నెవ్వరెఱుఁగుదురు? భర్త వచ్చి 'ఏమె ఇది!' యని అడిగిన బదులు చెప్పుట కేమిగలదు. ఆమె మనసు మనసులో లేదు. నిన్నగాక మొన్న అంత గండము తప్పిపోయినది. నేడు మరల నిది యొకటి. ఈ శిశువేమో! పూట పూట నీ గండములేమో! ఆమెకు పాలుపోక డిందుపడియుండెను. దినాంతమునకు గృహపతి కీలారములనుండి యింటికి వచ్చెను. సాము నెరసిన అతని కేశసంచయము అరణ్య సంచారముల రాలిన వనకుసుమకింజల్క పరాగ ధూసరమై మిక్కిలి మాసరమైయుండెను. గోఖురోద్ధత పరాగమున ప్రుంగుడుపడియున్న అతని మోమున చెమరు బొట్లందగించినవి. అతడు చెంగావికోక కట్టెను. లేఁజిగురుల జిగితో నది అతిస్నిగ్ధకాంతియైయుండెను. కేల కర్కశగ్రంథిలయష్టి దాల్చెను. అతని వెనుక సుందర గోపాల పరివారము కదుపులను గూర్చిన ముచ్చట లాడుచు వచ్చుచుండిరి. దూరమునుండి వాకిట అఱవఱలై పడియున్న బండినిఁ జూచినంతనే అతనిపై మిన్నువిఱిఁగిపడెను. దాని క్రింద కృష్ణుని పరుండబెట్టుట అలవాటు గదా! కుఱ్ఱవాఁ డేమయ్యెనో! ఏమియాడెనో! అని త్వరితగతి వచ్చి వాకిట నందుడు చూచిన ఆనందనర్తనమే దర్శనము.

స్తనదుగ్ధామృత మారగించుచుఁ బొరిన్
జారుస్మితోల్లాసమా
ననబింబమ్ము నలంకరింప వికస
న్నాళీకపత్రాక్షిలో
చనదీప్తుల్ జననీముఖేందువు పయిన్
సంప్రీతిఁ బర్వంగ నొ
ప్పు నిజాభీప్సిత కల్పశాఖిఁ గనియెన్
బుత్రున్ బవిత్రోదయున్.

చూచి గుండె నిమిరికొనుచు యశోదతో 'ఇది యిట్లైనదేమి నిమిత్తము? అబోతులు రేగి త్రోసి పడ నైనెనో! ఇచట పెనుగాలి వీచెనో! అయినను ఇది యింత విపర్యస్తమగుటకు వీలులేదే! అది యెట్లైనఁ గానిమ్ము. అవ్యాఘమ్మై వీడు నాకు దక్కెను. ఇంక సర్వమును అభ్యుదయము' అనెను. ఈసారి నిమిత్తాన్వేషణమునకు అతని ఆనందము ఎడమీయలేదు. గద్గదకంఠియై యశోద పతిమోము తేరకొనఁజూచి తన అపరాధ మిట్లు నివేదించెను.

'నావలన తప్పు పొలగలదు. మీరు సహింపవలయును. నే నిప్పాపని నెప్పటియట్ల యీ బండిక్రింద మంచంబున నిదురవుచ్చి యేఱు కుఱంగలికావునం గ్రమ్మఱం జనుదెంతునని జలావగాహనంబున కరిగి మగుడు నప్పటి కిది యిట్లై యున్నయది. మన భాగ్యంబునం గుమారుని కీ బారి గడచెను.'

గండము గడచిన గాఁదిలికిఁ దోడుగ అర్ధాంగీపరాధయును ఈ కులాంగనా సంప్రార్థనము బాజాలును ప్రసాదములై నందుని పితృత్వగార్హస్థ్యములను సంపన్న మొనర్చెను. ఇట్లు—ఏకసుతవిభక్తమయ్యును పరస్పరాలంబనమగు వారి ప్రేమబంధము తదేకాశ్రయ వివర్ధమానమై దినదినమునకుఁ దఱితీపులై ప్రెగ్గడ శిల్పమునందగు శాశ్వతత్వమును భజించెను.

అఱవఱలైన బండిని మఱల సుసంఘటితమొనర్చి కొనియున్న నందగోపుని ఇంకే చీఁకులును గలవరపెట్టలేదు.

# కలలో పిలుపు

శ్రీ పి. గణపతిశాస్త్రి

జాళువా తెరచాప కెరటాల జీరాడ
సాగినది సంధ్యాప్రవాళ నౌక

జలధిలో జలతారు వలలోన మీనమై
మిలమిలల మెరిసినది చంద్రవంక

తెలిమంచు తెరల కావల తరళ హాసితమై
వెలిగె ధ్రువతారకా దీపకళిక

ఎలుగెత్తి ఎవరో! అవలితీరమున నిలిచి
పిలిచిరో కలగించె నొక్క కేక!

అలక లల్లిన సోకి వలిగాలి నిట్టూర్చె!
కలకలము రేగ దిక్కుల పలకరింతలో
కలకాల మీలీల కల తలాడగ సోలి
కలవరింప నేల! లే లెమ్ము! నెచ్చెలీ!

# సాహితీ సుగతుని స్వగతం

ముప్పై ఏళ్ళనాటిమాట. నెల్లూరిలో శాకుంతల నాటకం ప్రదర్శిస్తున్నారు. శ్రీ యడవల్లి సూర్యనారాయణగారు దుష్యంతపాత్ర ధరిస్తున్నారు. శ్రీ యడవల్లివారు దుష్యంతపాత్రాభినయంలో మొదట సంస్కృత శ్లోకాలు చదివి తర్వాత తెలుగు పద్యాలు చదవడం పరిపాటిట. ఈ వార్త సంస్కృత విద్యార్థులకు కర్ణరసాయన మైంది. రంగస్థలం ప్రేక్షకులతో కిటకిటలాడుతున్నది. అతి కష్టంమీద ఆఖరు తరగతిలో చోటు సంపాదించాము.

ప్రస్తావన పూర్తయింది. "గ్రీవాభంగాభిరామం ముహు రనుపతతి స్యందనే బద్ధదృష్టిః—" అనే శ్లోకం కేదారగౌళలో పాడుతూ ప్రవేశించారు యడవల్లివారు. ఒళ్లు జలదరించిపోయింది. ఒకటి, రెండూ, మూడూ అంకాలు రసకందాయంగా సాగిపోతున్నాయి. శకుంతలను అనునయించేటప్పుడు "కిం శీతలైః క్లమవినోదిభి రార్ద్రవాతైః—" అని కన్నడలో చదివి "చల్లనివై శ్రమం బుడుపజాలిన" అని తెలుగుపద్యం అందుకున్నారు. కాళిదాసే అన్నట్టు రంగస్థలం "రాగానుబద్ధ చిత్తవృత్తిః ఆలిఖిత ఇవ" ఉన్నది.

ఎప్పుడు నాటకం భరతవాక్యం పాడారో! ఎప్పుడు ఇండ్లకు చేరుకున్నామో తెలీదు. శాకుంతలం శ్లోకాలు రకరకాల రాగాలతో చెవులలో గింగురుమంటూ, మెదడులో తిరిగిపోతున్నాయి. ఈశ్లోకం ఈ రాగంలో పాడాలని గురుపాదులెవరూ పాఠప్రవచనాలలో తెలుపలేదే! నాటకంలో పద్యాలు పాడాలా, చదువాలా?—అనే ఉద్యమ మొక్కటి ఉండనే ఉండాయే! యడవల్లివారు ఏ సంప్రదాయం ప్రకారం, ఏ నాట్యశాస్త్రానుసారం ఈ రాగాలతో శ్లోకాలు పాడారు? వ్యాఖ్యాతలుకూడా చెప్పినట్టు లేదే! ఏమో!—ఇలా ఆలోచనలు సాగిపోతున్నాయి. సందేహాలు చిలవలు పలవలుగా అల్లుకు పోతున్నాయి.

వ్యాఖ్యానాలే చూద్దాం మరోకమారు; రాగనిర్దేశం ఉందేమో! ఊ ఊఁ! సూత్రధారుని ఆదేశంతోనే కదా నటి

"ఇసి చుంబిఆఇ భమరేహిం
సుఉమార కేసరసిహాఇ,
ఓదంసఅంతి దఅమాణా
పమదాఓ సిరీస కుసుమాఇ."

అని గ్రీష్మర్తువు వర్ణిస్తూ పాడింది కోకిల కంఠమైత్రి. "అహాహా! నీగీతం బలేబాగుంది. చూడ వచ్చినవారంతా చిత్తరువులై పోయారు.

"తవాస్మి గీత రాగేణ
హారిణా ప్రసభం హృతః,
ఏష రాజేవ దుష్యంతః
సారంగేణాతి రంహసా."

అని నటికి జవాబు పడేస్తాడు సూత్రధారుడు. ఇక్కడ రాగమని, గీతమని ఉన్నాయికదా, వీటికి వ్యాఖ్యాతలు వివరణలలో రాగాల పేర్లేమైనా ఇచ్చారా అంటే...ఇసి చుంబిఆఇ అనేది 'త్రింశన్మాత్ర దలద్వయరూపో ద్విపదీనామా లయ భేదః' అని రాఘవభట్టు వ్యాఖ్య చేశాడు. గీత రాగేణ అనేదాని వ్యాఖ్యలో 'గీతే గీతౌ నిబద్ధేన రాగేణ శ్రీరాగాదినా ధాతునా. హారిణా శ్రుతిసుఖదేన, హృత్తం శిఅమ స్త్యైతిచ' అన్నాడు. రాగమంటే శ్రీరాగం మొదలయినది అని ఉదాహరించడమే కాని ఈ గీతం ఈ రాగంలో పాడాలనే నిర్దేశమేమీ లేదు. ఇక నైఘావస శ్రీనివాసాచార్యుడు "అత్ర గీతశబ్దేన రాగాద్యాశ్రయో వర్ణస్వర తాళాది నిబద్ధ సందర్భ విశేషోభిధీయతే... గీత రాగేణ గీత సంబంధ స్వరవిశేషేణానురంజకేన" అని వ్యాఖ్యానించాడే కాని రాగం ఫలానా అని చెప్పలేదు. కాటయవేముడు కూడా రాగనిర్దేశమేమీ చేయలేదు. (ఇది సారంగ రాగమన్నారు ఒక పండితులు. దాని సూచన 'తవాస్మి గీత రాగేణ...సారంగేణాతి రంహసా' అని సూత్రధార వచనంలో కలదని కూడా అన్నారు. సారంగ రాగం అపరాహ్ణరాగం గనుక ఈమాట చాల సహేతుకం.)

ఇక పంచమాంకం ప్రారంభంలో హంసపదిక పాడిన

"అహిణవ మహులోలులో తుహం
తహ పరిచుంబిఅ చూఅ మంజరీం,
కమల వసతి మెత్త నివ్వుదో
మహుఅర విహ్మరిదోసి ణం కం కహం?"

అనే గీతంలక్షణం వివరించారు వ్యాఖ్యాతలందరు. కాటయవేముడు దీనిని ధ్రువాగీతి అన్నాడు. కాని రాగ మేమిటో?

విక్రమోర్వశీయంలో ఈ గీతాలు చాలవస్తాయి. విక్రముని ఊర్వశీ విరహోన్మాదాన్ని ఈ గీతాలతో అత్యద్భుతంగా చిత్రించాడు కాళిదాసు. చతుష్పది, షట్పది, జంభాలిక, ఖంజధార, అక్షిప్తిక, చర్చరి, ఖండకం, ఖురకం, కకుభం, ఖండిక మొదలయినవి ఈ గీతాలు. వీటిలో ఒక్క ఖండికా లక్షణంలో మాత్రమే రాగ నిర్దేశం కనిపిస్తుంది.

"పర్యాయేణ శనై స్తిర్యక్
నతముక్తం భుతంశిరః,
శ్రీరాగ కుంభ తాలేన
నిబద్ధా ఖండికా మతా."

అని. తక్కినవాటికీ రాగాలు చెబితే ఎంత బాగుం డేది? రాగం అక్కరలేక పట్టినదు వే నట కుటిలిక.

"రాగేణ రహితం యత్తు
అర్థమ త్తలికాయుతం,
భావ రైశ్చ తన్నాట్యం
కుటిలీ సంజ్ఞకం మతం."

అయితే చర్చరీ గీతాలలో ఒక్కటి మాత్రం అచ్చంగా మన జాజర. చర్చరే జాజర అయిందన్నారు గదా పెద్దలు.

"వీణాగానము వెన్నెల తేట
... రాణమీరగా రమణుల పాట
పేరు చెపిన పినబ్రాహ్మణు పీట
జాణలు మెత్తురు జాజరపాట."

అనే జాజర నడకను విక్రమోర్వశీయంలోని

"మోరా పరహుఅ హంస రహంగ
అలిగఅ పవ్వఅ సరిఅ కురంగం
తుజ్ఝ కరణే రణ్ణ భమంతే
కోణహు పుచ్ఛిఅ మఇరో అంతే" 4-70

అనే చర్చరితో పోలిస్తే అచ్చంగా రెండూ నడకలో ఒక్కటే అయాయి. కాని, ఈ జాజర రాగమూ తెలీదు; ఆ చర్చరి రాగమూ తెలీదు.

ఇక నాగానందంలోని నాయిక మలయవతి పాట విందాం. ఆమె అమ్మవారి ఎదుట

"ఉత్ఫుల్ల కమలకేసర
పరాగ గౌరద్యుతే మమ హి గౌరి!
అభివాంచితం ప్రసిద్ధ్యతు
భగవతి యుష్మత్ప్రసాదేన" 1-14

అని సంస్కృతం ఆశ్రయించి వీణమీద పాడింది. దీనిని నాయకుడు జీమూత వాహనుడు చాటునుంచి విని "వ్యక్తి ర్వ్యంజన ధాతునా" అని లక్షణజ్ఞాన పురస్సరంగా వ్యాఖ్యానించి మెచ్చుకున్నాడు. రాగ మేమిటో చెప్పరాదూ? రాగం చెప్పి ఉంటే ఆ రాగం హర్షుని తర్వాత నేటివరకు ఎన్ని విధాలుగా మారి, ఎన్ని పేర్లు పెట్టుకుందో జాతకాలు కట్టే వాళ్ళమే?

ప్రియదర్శికలో ఆరణ్యక వీణ సారిస్తూ "ఘుణ బంధణ సంరుద్ధం" అని, "అహిణవరా అఖిత్తా" అనీ పాడుతుందిట (గాయంతీ వాదయతి). నాయకుడు రాగం పేర్కొనడం పరీక్షలాగ కేవలంగా ఉందను కుంటే వ్యాఖ్యాత వివరించవద్దూ!

సరే: రుద్రకవి సుగ్రీవ విజయం ఉన్నంతలో నాటక పూర్వరూపమైన సంపూర్ణ యక్షగానమన్నారు కదా? దానిలో పాటలకు రాగనిర్దేశం చేశాడా?— అంటే; త్రిపుట, జంపె, కురుచజంపె, అటతాళం, ఏకతాళం, అర్ధచంద్రికలు, ఏలలు-అనే విభజన ఉంది కాని రాగవిబోధం కలిగించలేదు. దీని కొక పండితు లన్నారు...రాగం రమణి, తాళం కొలపురుషుడు. స్వేచ్ఛగా సంచరించదలచే రాగాన్ని కట్టుదిట్టంగాకట్టి వేసేది తాళం. కనుక తాళం ప్రధానం కాని రాగం ప్రధానం కాదు. ఒక పాటను ఏ రాగంలో నన్నా పాడుకోవచ్చు, తాళం మాత్రం చాలవరకు మారదు... అన్నారు.

ఈ రాగం ఈ ఋతువులో పాడాలి, ఈ రసానికే వాడాలి, దీనికి ఇది దైవతం, ఇది దీని స్వరూపం, ఇది స్త్రీరాగం, ఇది పురుషరాగం, అని కొలదికొందులు నిర్ణయించారు సంగీత లక్షణ కర్తలు. ప్రధాన రాగాలు ముప్పైరెండు. వాటిలో ఎనిమిది బంగాళ, భూపాల, భైరవ, మాలవ, శ్రీరాగ, వసంత, సారంగ, ఫలమంజరిరాగాలు పురుషరాగా లన్నాడు "శివతత్త్వ రత్నాకర" కారుడు బసవరాజు. తక్కినవి కురంజీ, మేఘరంజనీ, మేలావరీ, మలహరీ, కర్ణాటీ

దేశాక్షి, గుండక్రియ, ధన్యాసీ మొదలయినవన్నీ శ్రీరాగాలట.

పూర్వయామంలో దేశాక్షి, భైరవ, ఫలమంజరి, భూపాలి, సాహురి, రామక్రియ మొదలయినవి; రెండవ యామంలో కురంజీ, తోడి, వరాలి, ధన్యాసి, వసంత, లలితరాగాలు; మూడో యామంలో మేఘరంజని, రామక్రియ, గుండక్రియ, మల్లారి మొదలగునవి; తురీయయామంలో కర్నాట మొదలయినవి పాడాలన్నాడు బసవరాజు. ఇవన్నీ సూర్యాంశంతో పుట్టాయిగనుక పగలే పాడాలట. వీటిని ఉదయం పాడితే "స వర స్సుఖమశ్నుతే". ఇవి "సాయంకాలే తు నిందితాః". శుద్ధనట్ట, సాలగనట్ట, శుద్ధవరాటక, వరాటక, ద్రావిడి మొదలయినవి చంద్రాంశవట. కనుక "సాయమేతే ప్రగాతవ్యాః తస్యశ్రీ రతులా భవేత్."

'రాగవిబోధ'కారుడు సోమనాథుడు మరొక అడుగు ముందుకువేసి, ఉత్తమ మధ్యమ రాగాలు నిర్ణయించి ఈ ఈ రాగం ఇప్పుడిప్పుడే పాడాలని, ఈ ఈ గడియలోనే పాడాలని అనడానికి మారు ఉదయం, పగలు, సాయంత్రం, రాత్రి అనే విభాగంలో తోసివేశాడు. ముఖారి, తోడి, వసంతవరాళి, నామవరాళి నిత్యం ఎప్పుడుపడితే అప్పుడు పాడవచ్చు. వసంతం, భైరవి, భూపాలి, గౌడి, పూర్ణశంకరాభరణం, హిందోలం, ఉషఃకాలంలో; సావేరి, భైరవరాగాలు ఉదయం; మల్లారి, నాటమల్లారి మధ్యాహ్నం; సారంగం అపరాహ్ణం; మాలవగౌడ, శ్రీరాగం, ప్రదోష సమయంలో; టక్క, రేవగుప్తి సాయంకాలం; నాదరామక్రీ, కర్నాటీ రాత్రి.

తోడిని హర్షానికి; వసంతాన్ని శృంగారానికి; భైరవాన్ని ప్రార్థనకు; శ్రీరాగం వీరరసానికి; ధన్యాసినికూడా వీరరసానికి పాడాలన్నాడు "సంగీత సమయసార" రచయిత శ్రీ పార్శ్వదేవుడు.

'సంగీత దర్పణ'కారుడైన చతుర దామోదర సూరి ఈ గడియలోనే ఇది పాడాలనే నిర్బంధం సడలించి ఫలానా సమయంనుంచి, ఫలానా సమయం తర్వాత అని మరికొంత అనుమతి యిచ్చాడు: మధుమావతి, దేశాఖ్య (దేశాక్షి), భూపాల, భైరవి, వేలావతి, మల్లారి, వల్లారి, గుర్జరి, పంచమం, ఘనశ్రీ, మేఘరాగం, భైరవ—ఇవన్నీ "ప్రాతరారభ్య నిత్యశః"; శ్రీ రాగం తృతీయ ప్రహరం తర్వాత; కామోది (కాంబోజి) ద్వితీయ ప్రహరం తర్వాత; శ్రీరాగం రాగిణులతో సహా శిశిరంలో; వసంతం వసంతంలో; భైరవం గ్రీష్మంలో; మేఘరాగం వర్షర్తువులో; పంచమరాగం రాగిణులతో సహా శరదృతువులో.

'సంగీతపారిజాతం'లో అహోబలుడు మధ్యమాది, భూపాలి, భైరవరాగాలు ఉదయం; హంస, దీపక, కాంబోధి, కంకణ, సారంగ, దేవగాంధారి రాగాలు ద్వితీయప్రహరోత్తరం; ఘంటారవ, శ్రీరాగాలు తృతీయప్రహరోత్తరం; నీలాంబరి, ముఖారి, భైరవి, లలిత, మేఘనాద, ఆనందభైరవి, సావేరిరాగాలు "సర్వదా చ సుఖప్రదాః" అన్నాడు.

పచ్చకప్పురపు తిరువేంగళనాథుడు (1540) చొక్కనాథచరిత్రలో పల్లాణుడనే పెద్ద గాణ పాండ్య భూపతి ఆస్థానానికివచ్చి 'వేళలెరింగి యాస్వరము తేర్పరచి' పాడాడట.

రాగవిషయాలను అతడు ఈవిధంగా తెలిపాడు:

శ్రీరాగ రాగమంజరియు నాటయును
భైరవి భూపాళి బంగాళి మాళి
వియును వసంతంబు వెలయంగ నెనిమి
దియు మగరాగముల్ దీనికి సతులు
మలహరి దేశాక్షి మంచికాంబోది
లలిత వరాళి నీలాంబరి తోడి
కన్నడ గౌళయు గౌళిక వెలమి
ధన్యాసి దేవగాంధారి సౌరాష్ట్రి
పారి గుండక్రియ ధిల్లాతికియును
రామప్రియయు మేఘరంజి కురంజి
సామంతయు ముఖారి శంకరాభరణ
ములు నిరువదినాల్గు ముదితరాగములు
నలరంగ బురుషుల పతివల నెరిగి
పరగమిత్రముల ముప్పదిరెంట దెలిసి
పురుష శ్రీరాగములో పొందుగా గూర్చి...

'సంగీత దర్పణ' రచయిత రాగాలకాలాదులు చెప్పినా అఖరున 'రాజాజ్ఞయా సదా గేయాః నతు కాలం విచారయేత్' అని మంచి హెచ్చరిక చేశాడు. "రాజా కాలస్య కారణం" కదా మరి? అయితే బసవరాజు మాత్రం దేవతా స్తుతిపూర్వకమైన గానానికి వేళ, ఆవేళ అనేది అవసరంలేదన్నాడు. పెండ్లి ముహూర్తాలు ఎప్పుడుబడితే అప్పుడు ఉంటాయా?

మరి రాగాల వేళ పాళా అంటూ చూచుంటే శుభ ముహూర్తాలు అనుకోరా? కనుక

"వివాహ సమయే గానం దేవతాస్తుతి పూర్వకం,
అవేలాగాన మాకర్ణ్య సదోషః పరికీర్తితః"

అన్నాడు.

అవేళ అనగానే, అవేళ పల్కిన నాటరాగ మేళం విని కటకటపడిన అల్లసానివారి ముఖం చిట్లింపు కనిపించి, మందలింపు వినిపించడం లేదూ

"వాలారుణ్ కోనగోళ్ళ నీ వలసతిణ్
వాయించుచో నాటకుణ్
మేళంబైన విపంచి నిన్న మొదలుణ్
నీ వంటమింజేసి అ
అలాపంబె అవేళ పల్కెడు ప్రభా
తాయాత వాతా హతా
లోల త్తంత్రుల మేళవింప గదవే
లోలాక్షీ దేశాక్షికిణ్."

అనే పద్యంతో మనకు! నాట సాయంకాలం పాడే రాగం. వరూధిని నాటవాయిస్తూ ప్రవరుని చూచి విస్తుపోయి అరుగు దిగి వచ్చింది; తిరస్కృతరై తిరిగి పోయి తన వీణను మేళానుగుణంగా మేరువు దిద్దుకో లేదు. తెల్లవారింది. తెల్లవారి నాట పాడరాదు. ఉదయరాగాలలో ఒక్కటి దేశాక్షి. కనుక దానికి అనుగుణంగా మేరువు సర్దమని చెలికత్తెల హెచ్చరిక. "వీణను అంతకుమునుపు చలించు మేరువుతో వాడు చుండిరి. అయా మేళమునకు అనువుగా మెట్లను సర్దుటను గురించి 'వాలారుణ్ కోనగోళ్ళ నీ వలసతిణ్ వాయింపమిణ్' అను అల్లసాని పెద్దన మనుచరిత్ర పద్యముతో స్పష్టమగును. వీణ మేరువులను ఇప్పటి వలె కదలక నిర్మించు పద్ధతి భట్టుమూర్తి, గోవింద దీక్షితులు మొదలగు విద్వాంసు లనేకులు పరిశోధన చేసి కనిపెట్టిన పెద్ద విషయము" అన్నారు. సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు శ్రీ సంధ్యావందనం శ్రీనివాస రావుగారు. కనుక మన కవిపండితులు రాగాల కాల దేశాలను సాధ్యమైనంతవరకు పాటించారనే అన వచ్చు. అవేళ, అపశ్రుతి కర్ణకఠోరములు కదా! అందు వల్లనే గిరిక

"అజాబిల్లి వెలుంగు వెల్లికల డా
యనేక రాకా నిశా
రాజశ్రీ సఖిమైన మోమున బటా
గ్రంబోత్తి రొమ్మెత్తి యా
రాజీవానన యేడ్చె గిన్నరవధూ
రాజత్కరాంభోజకాం
భోజీ మేళ విపంచికారవ సుధా
పూరంబు తోరంబుగాణ్". 4-52

కాంభోజి (కామోది) ద్వితీయ ప్రహరోత్తర గేయరాగం గనుక గిరిక వెన్నెల సెగలకు వసివాళ్వాడి (కాంభోజిలో) ఏడ్వడం సమంజసమే. కాని,

"ఈసునబుట్టి డెందమున
హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి ఏడ్చె ప్రాణవిభు
కట్టెదుటణ్ లలితాంగి పంకజ
శ్రీ సఖమైన మోముపయి
జేల చెరంగిడి బాలపల్లవ
గ్రాస కషాయకంఠ కల
కంఠ వధూకల కాకలీ ధ్వనిణ్."

అని సత్యావధూటి ఏడుపు పంచమరాగంలో అయితే, పంచమరాగం "ప్రాతరారభ్య నిత్యశః" పాడవచ్చును గనుక సమంజసమే. పద్యంలోని లలిత అనే పదం లలితరాగాన్ని సూచిస్తుందనుకున్నా మరేమీ ఆక్షేపణ ఉండదు. కల్పనలకు కల్పవృక్షమైన కృష్ణరాయలు వర్షర్తువులో మేఘరంజనరాగం పాడా లనే సంప్రదాయానికి మరింత సొగసు తెచ్చి మధురా నగరమానినులు మేఘరంజనరాగంతో మేఘాలనే ఆక ర్షిస్తారన్నాడు:

"ఆ పురసౌధవీధి నక
రాధర భూముల గర్జ మున్నుగా
నా పయికి న్వినంబడని
యట్లుగ గ్రాలు ఘనాలి దార్చి లీ
లా పరతన్ ఘటింపుదురు
లాస్యము సేయగ మేఘరంజనా
లాపము జేసి పోషిత క
లాపి కలాపి కలాప కుంతలల్." 2-14

ఇంతకూ, ఈ మేఘరంజని "సర్వదా చ శుభప్రదా".

సంగీత విద్వాంసులసంగతి ఎలాఉన్నా మన పూర్వులు- తెలుగుకవి పండితులుమాత్రం ఏరాగంలో పద్యాలు చదువాలో కొంత సూచ్యార్థ సూచనగా, కొంత స్పష్టంగా చెప్పారనే అనవచ్చు. రామాయణం కూడా గానంచేసింది అంటారుగనుక పద్యం ఏదో గతితో నడవాలికదా—రాగంలేకపోయినా తాళంతో; ఈ గతినే గమకమన్నారు. కవి కవిత్వం చెప్పవచ్చు, గ్రంథాలు వ్రాయవచ్చు. కాని శారీరంలేనిదానివల్లనో, సంగీతజ్ఞానం లేనిదానివల్లనో పద్యం రంజకంగా చదువక పోవచ్చు. కనుక కవి రచనను ప్రసన్నంగా చదివి సభాసదులను మెప్పించడాని ప్రతి రాజాస్థానాల

లోను గమకి ఉండేవాడు. గమకంలో రాగచ్ఛాయే కాని, రాగ కల్పనలతో పనిలేదు. పెదన "ఇంతలు కన్నులుండ" అనే పద్యం వ్రాసి రామలింగకవికి విని పింపగా "ఏం తాతా? ఇంతలు కన్నులుండ అంటే చింతాకంతనా" అని చిటికపట్టిచూపి వెక్కిరించాడని, పెద్దన గాభరాపడగా, తనే గమకంతో తన చేయిచాపి చేరెడు చూపించి సమర్థించాడని ఒక కట్టుకథ. తిక్కన ఉద్యోగపర్వంలో "ఉండం గవి గమకి ప్రముఖ విద్వజ్జనంబులు" (3-232) అని ప్రయోగించగా గమకి పదం అర్థంకాక 'గణక' అని పరిష్కర్తలు దిద్దివేశారని పరిశోధకు లంటారు.

తిక్కన సమకాలికుడైన శివదేవయ్య పురుషార్థసారంలో వాచకలక్షణాలు చెబుతూ,

"అర్థైక్య రసంబుల కనురూపముగ పెక్కు
రాగముల్ పణితులు బాగుపుట్ట
చదువుచున్నారు వీరల చదువు బోలు
చదువు లేదని పొగడిరి సభికవరులు"

అన్నట్టు సకలనీతి సమ్మతంలో ఉదాహృతమైంది (పుట.౩౮.). తెలుగు భారతం పురాణ పద్ధతిని చదివే తీరు చెప్పేటప్పుడు హరివంశం ఉత్తరభాగంలో

"మునుకొని పోవ కెంతయును
మట్టక నిల్వక భావముల్ రసం
బును వెలయ వ్రసల్పడక
పొందుగ వాక్యవిభాగ మొప్పగా
నెనిమిది తావకంబులను
చేర్పడి వర్ణము లుల్లసిల్లనే
ర్పనయగ వాచకుండు కడు
నింపగురీతి పఠింపగా దగున్. 10-297

అని ఉంది. ఇక్కడ తావకం, వాచకుడు అనేపదాలను బట్టి, పురుషార్థసారంలో తెలిపినవిధంగానే, రాగ యుక్తంగా పద్యం చదువాలనే అభిప్రాయం కదా!

పురాణం శ్రీరాగంలో చదువాలని తామరపల్లి తిమ్మయ్య శేషధర్మములలో ఇలా తెలిపాడు:

"పదపదంబును విభజించి తుదయు మొదలు
నేరుపడ శబ్దభావంబు లెరిగి రాగ
సమితినైనను శ్రీరాగ సరణినైన
సభ నుతింప బురాణముల్ చదువవలయు"
2-౬31.

తిమ్మయ్య 1500 ప్రాంతంవాడు. అప్పకవి ఇతని గ్రంథంనుంచి పద్యాలు ఉదాహరించాడు. శ్రీరాగం తృతీయ ప్రహరోత్తరరాగం గనుక పురాణానుకూలం కదా! ఇక సంగీత సాహిత్యకళానిధి అయిన భట్టుమూర్తి వసుచరిత్ర పద్యాలలో రాగాలపేర్లు మిడించి, ఆ పద్యాలు ఆరాగంలో పాడాలని సూచించాడు: "నానా సూన వితాన వాసనల నానందించు సారంగ మేలా నన్నేలజటంచు" అనే పద్యం సారంగరాగంలోను; "అరిగా పంచమ మేంగించి సవలా లవ్వేళ హిందోళవైఖరి" అనేపద్యం హిందోళరాగంలోను పాడాలని సూచించాడు. వసుచరిత్రను శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారు వ్యాఖ్యానించి, ఏయే పద్యం ఏయే రాగంలో చదువాలో తెలిపారట. ఈ వ్యాఖ్య విశాఖలో పరవస్తువారి గ్రంథాలయంలో ఉందట.

ఇంత చెప్పినా, ఎవరికివారు ఏదో నిర్ణయం చేసినట్టే కనిపిస్తుందికదూ? ఔను. తాళానికి తప్పని సరి నిర్ణయం ఉంది కాని, రాగానికి నిర్ణయంలేదని మొదట చెప్పిన పండితులమాటలే సత్య మనిపిస్తుంది. వావిళ్ల వారు రెండు వ్యాఖ్యానాలతో దేవనాగరిలో ముద్రించిన శాకుంతలంలో అంకాలలోని ఆయా శ్లోకాల గేయరాగాలపట్టిక ఇచ్చారు. ఆ రాగాలను ("సంస్కృతనాటక ప్రదర్శన మార్గదర్శక ప్రథమాచార్యైః శ్రీ గోమఠం శ్రీనివాసాచార్యైః శ్రీమద్భిః (రిటైర్డుజడ్జి) సి. వి. కృష్ణస్వామి అయ్యర్ మహోదయైశ్చ ఏతద్గేయరాగానుసంధాన మకారి.") శ్రీ గోమఠం శ్రీనివాసాచార్యులు, శ్రీ సి. వి. కృష్ణస్వామి అయ్యర్ గారు నిర్ణయించారట. ఈ నిర్ణయంకూడా వారి అభిరుచికార్యమే.

గ్రామైకరాత్రంగా దేశమంతా తిరిగాను. చాల వరకు ప్రతి రాష్ట్రంలోను దేశీనాటకాలు, సంస్కృత నాటకాలు, నృత్యకలాపాలు చూచాను. బెంగాలీల "ఒనాఘ్రాతం పుష్పం కిసాలోరాయి" విని చెవులు మూసుకొన్నాను. ఉత్తరప్రదేశ్ వారు చప్పయ్, చౌపాఈ బాణీలలో చదివే సంస్కృత నాటక శ్లోకాలు విని తులసీదాసుకు, ఆయన ఆరాధ్య దైవమైన జానకీ జానికి నమస్కారం పెట్టాను. శ్లోకం కంటే రాగానికే ప్రాధాన్యమిచ్చే తమిళుల తీరుకు తల ఊపడం మానుకున్నాను. ఫారసీ గజల్‌లాగ, శేర్‌లాగ చదివే పంజాబీలపద్ధతి విని పరుగుతీశాను. చిన్నవాడు విన్న యడవల్లి వారి పురుషకంఠం లోని పస వినిపించలేదు. 'కింశిలైః' అన్నప్పటి కన్నడరాగం—తుర్యయామ గేయరాగం గనుక, నాటకంలో దుష్యంతుడు శకుంతలను అనునయిస్తూ సాయంకాలం కావచ్చినట్టు, "సాయంతనే సవన కర్మణి సంప్రవృత్తే" అని స్పష్టమౌతున్నదిగనుక— ఎంత ఉచితంగా ఉంది! యడవల్లి వారు ఎంతో ఆలోచనతో కాలదేశాలను, సంగీత లక్షణాలను ఆకళించుకొనే ఆయా రాగాలలో పాడిఉంటారు. ఆయనను తీర్చిదిద్దిన గురువర్యుడు శ్రీ మల్లాది అచ్యుత రామశాస్త్రిగారిచేతి చలవ అదంతానని అంటారు.

— రామచంద్ర

# కలగూరగంప

## యుగ యుగాల ఉగాది

"జనవరితోనే కొత్తసంవత్సరం ఎందుకు ప్రారంభం కావాలి ?" అని ప్రశ్నించాడట రోమను కవి ఓవిడ్ జ్యోతిశ్శాస్త్రకారుడైన జానుస్ను. "జనవరి నాటికి సూర్యుడు మకర రాశిలో ప్రవేశిస్తాడు. అంత వరకు మంచు ముసుగులో ఉన్న ప్రకృతి ఆ ముసుగును తొలగించుకుని తొంగిచూస్తుంది. తర్వాత దానిలో రాగోదయ మౌతుంది. నూతన జీవితం జనవరినుంచి ప్రారంభమౌతుంది గనుక దానితోనే నూతన సంవత్సర ప్రారంభం" అని జానుస్ జవాబు చెప్పాడట.

రోమనులు సూర్యోపాసకులు. సెమెటిక్ జాతులన్నీ సూర్యుని ఆరాధించేవి. కనుక సూర్యోపాసకులు, సూర్య మానం అనుసరించేవారు జానుస్ జవాబుతో తనివి చెందవచ్చు. కాని, చాంద్రమానం అనుసరించేవారికి ఇది ఏలా సమాధానం ?

జానుస్ను ప్రశ్నించినట్టే మన సంవత్సరాది కూడా చైత్రమాస ప్రారంభంతోనే ఎందుకు మొదలు కావాలని ఎవరైనా ప్రశ్నించే ఉంటారు. దానికి హేమాద్రి పండితుడు

చైత్రేమాసి జగద్బ్రహ్మ ససర్జ ప్రథమేహని,
శుక్లపక్షే సమగ్రంతు తదా సూర్యోదయే సతి.

(చైత్రశుద్ధ పాడ్యమి సూర్యోదయ సమయంలో బ్రహ్మ ఈ జగత్తును సంపూర్ణంగా సృష్టించాడు.) అని సమాధానం చెప్పాడు. మానవసంఘ క్రమవికాసానికి తార్కాణ లనదగిన ఉగాదివంటి పండుగలను, పర్వాలను బ్రహ్మసృష్టితో ముడిపెట్టడమంటే సహేతుకంగా కనిపించకపోవచ్చు. కాని, హేమాద్రి వివక్షు సంఘంలో స్థిరపడిన ఆచారం తెలుపడమేనని మనం తెలుసుకోవలసి ఉంటుంది. అయితే చైత్రశుద్ధ ప్రతిపత్తే సంవత్సరాది కావడమెందుకు ?

ఆకసంలో మిలమిలలాడే చందమామ తరుగు పెరుగులతో మానజాతి కాలజ్ఞానం ప్రారంభమైంది. చంద్రమండలం కొన్నాళ్లు నిండారుతూ, తర్వాత క్రమంగా సన్నగిల్లుతూ, 28 నాళ్లలో (అభిజిన్నక్షత్రంతో సహా) మరల నిండుతనం సంతరించుకుంటూ ఉండడం చూచి పౌర్ణమినుంచి పౌర్ణమికి గల కాలాన్ని మానవుడు లెక్కకట్టి చంద్రుని పేరులో వ్యవహరించాడు. మాసః — చంద్రుడుగలది. మనకు నెలే (చంద్రుడే) నెల. ఆ నెల మనపై కురిపించేది వెన్నెల. పాశ్చాత్య భాషలలో మాసపర్యాయమైన 'మంత్' శబ్దంకూడా చంద్రగతికి సంబంధించిందే — మూన్త్ మూంత్ - మంత్. పూర్ణిమనుంచి మరొక పూర్ణిమ వరకు మొదట ఉన్న ఈనెల లెక్క అమలో మంగాను, ప్రతిలో మంగాను వృద్ధి క్షయాలను గణించడంవల్లనే కాబోలు - క్రమంగా అమ (మా రహిత - మా శూన్య) మైన నాటినుంచి మరొక అమకు వచ్చి, తొలి నెలవంక వెలసే పాడ్యమి నుంచి పాడ్యమికి అనే విధంగా రూఢమైపోయింది.

క్రమంగా మానవునిబుద్ధి వికసించింది. చంద్రుని గతిని, చంద్రమార్గంలో సన్నిహితంగాఉండే ప్రధాన నక్షత్రాలను, చంద్రుడు ఆ నక్షత్రాలను సమీపించడంతో ప్రకృతిలో, తనపరిసరాలలో కలుగుతున్న మార్పును మానవుడు పరిశీలించాడు. నక్షత్ర మండలాలకు ఏవో పేర్లు పెట్టుకొని ఆ మండలాలలో (పూర్ణిమ నాడు) చంద్రుడు ప్రవేశించినప్పుడు - చిత్తానక్షత్రాన్ని సమీపించినప్పుడు చైత్రమని, విశాఖను సమీపించినప్పుడు వైశాఖమని - అయా కాలవిభాగానికా నక్షత్రం పేరు పెట్టారు.

నెలలతో పాటే ఋతుపరిగణన జరిగిందో, అంతకు ముందే జరిగిందో చెప్పలేము. మండే ఎండలు, వెంటనే వాన, వాన వెలిసిందో లేదో మరల ఎండలు, పండిన అడవులు, ఆకూ అలమూ రాలుతూ ప్రకృతి మోడుపోవడం, ఎముకలుకొరికేచలి, పిదప గారడీలాగ రాగోదయం - ఎక్కడచూచినా కొనవచ్చే ఇంపుసొంపులు మానవుని అనాయాసంగా అభిజ్ఞునిచేసి ఉంటాయి. చూచాయగా, సహజంగా అలవడిన ఈ అభిజ్ఞతను అనుభవంతో స్ఫుటాలుచేసి, క్రమంగా కాలం

గుర్తించుకొన్నాడు. దినాలు లెక్కించుకొని నెలలు నిర్ణయించుకొన్నట్లే, ప్రకృతి విలాసాన్ని బట్టి ఋతువులు, ఋతు పర్యాయాన్ని బట్టి సంవత్సరాలు లెక్కగట్టుకున్నాడు. పంటకారుకు మరొక పంటకారుకు మధ్యన గల కాలం ఏడాదిగాను, పంటకారు సంవత్సరాదిగాను మొదట ఆచారం ఏర్పడింది.

మనదేశంలో పుష్య - మాఘ మాసాలు పంటలు పండి ప్రకృతి రసభరితంగా ఉండే కాలం, ప్రజలు తమ శ్రమ ఫలితాన్ని కన్నెదుట చూస్తూ పొంగిపోతారు. ఆటలు పాటలు, పొంగళ్లు పాయసాలు, లాటి వినోదాలకు హద్దూపద్దూ ఉండదు. తాము ఇన్ని నెలలూ కష్టించి పండించిన అన్ని ధాన్యాలను, కూరను నారను కలిపి పొంగించి, పొంగళ్లు ఆరగించి గంతులు వేస్తారు. ఇది మనకు పెద్దపండుగ; సంక్రాంతి పండుగ. ఇదే మొదట్లో మన సంవత్సరాది. దీనిని సూచించేదినం మకర సంక్రమణం. ఇది మార్గశిర-పుష్య-మాఘమాసాల మధ్యన వచ్చేది విషువత్కాలం. విషువత్కాలమంటే పగలూ రాత్రీ సరిసమానంగా ఉండే కాలం. 'సమరాత్రిందివే కాలే విషువత్' అన్నాడు అమరసింహుడు. ఈ విషువత్తులు రెండు. మకర సంక్రాంతి అలాటి విషువత్తులలో ఒకటి. ఈనాటి నుంచి ప్రకృతిలో క్రొంగ్రొత్త మార్పులు కలగడం ఆరంభమౌతుంది. జానున్ చెప్పిన జవాబును ఇక్కడ మనం స్మరిస్తే, మనకుకూడా - ప్రపంచ మంతటికీ కూడా - మకరమాసమే నూతన సంవత్సరాది కాబోలు!

ఈ విషువత్ నిర్ణయంలోను మతభేదం ఉంది. కటకంనుంచి - కటక విషువత్ నుంచి - దక్షిణాయనం, మకర విషువత్ నుంచి ఉత్తరాయణం ప్రారంభమౌతాయని నేటి సంప్రదాయం. కాని పూర్వం ఆశ్లేషార్ధం నుంచి దక్షిణాయనం, ధనిష్ఠా ప్రథమపాదం నుంచి అంటే అభిజిత్తుతో సహా లెక్కకడితే కుంభంనుంచి ఉత్తరాయణం, సింహంనుంచి దక్షిణాయనం ఉండేవని, ఇప్పుడు అవి మకర కటకాలకు మారాయని వరాహ మిహిరుడు బృహత్సంహితలో తెలిపాడు.

(ఆశ్లేషార్ధాత్ దక్షిణ
ముత్తర మయనం తథా ధనిష్ఠాద్యం,
నూనం కదాచి దాసీత్
యేనోక్తం పూర్వశాస్త్రేషు.

సాంప్రత మయనం సవితుః
కర్కటకాద్యం మృగాదిత శ్చాన్యత్,
ఉక్తా భావో వికృతిః
ప్రత్యక్ష పరీక్షణై ర్వ్యక్తిః)

మనకొక సంవత్సరమైతే దేవతలకొక దినం. వారి దినం మేషంతో ప్రారంభమౌతుంది; తులతో రాత్రి. కనుక అప్పటినుంచే ఉత్తరాయణం ప్రారంభం కావాలి. కాని, నేడు మకర కటకాలనుంచి ఉత్తర దక్షిణాయనాలు చెబుతారు - అని శ్రీపత్యాచార్యుడన్నాడు.

(దిన ప్రవృత్తి ర్మరుతా మజాదౌ
తులాధరాదౌ చ నిశాప్రవృత్తిః,
రై రుచ్యతే తా మృగ కర్కటాదౌ
అత్రోపపత్తిం ను వదే బ్రువంతి.)

మనం ఉత్తరధ్రువ ప్రాంతం నుంచి బయలు దేరామనేవాదం నిజమైతే, మేషవిషువత్తునుంచి దేవతలకు(మనకు) దినం ప్రారంభం కావడం - ఆరునెలలు చీకటి, ఆరునెలలు వెలుతురు ఉండేదినం మొదలు కావడం—నిజం. మనం ఉత్తరార్ధగోళం వారం గనుక మేషంలోనే మనకు సూర్యోదయం. అదే దిన ప్రారంభం. (మేషంలో సూర్యుడున్నప్పుడు— భూమధ్యరేఖపై ఉంటాడు గనుక మకరరాశి మన నెత్తిపై ఉంటుంది.) భూమధ్యరేఖమీద సూర్యుడుండే దినం విషువత్. కాని నాడూ నేడూ కూడా నూతన సంవత్సరాది వివిధవిధాలుగానే ఉంది. దీనికి కారణం చంద్ర సూర్య గురు బుధచారాలను ప్రజలు అనుసరించి సంవత్సరాలను పాటించడమే. సూర్యుడు తను మండుతూ ప్రపంచాన్ని మండింపజేస్తుండగా, మానవుడు తను లెక్కకట్టుకున్న ఋతుపరివర్తనానికి సంబంధం లేకపోవడం, ఋతువులు తన లెక్కలకు ముందు వెనుకలుగా రావడం చూచి, సూర్యచారాన్ని తక్కిన గ్రహాల చారాన్ని లెక్కలు కట్టసాగాడు. సూర్యుడు విషువత్తులో ప్రవేశించిన నాటినుంచి లెక్కకట్టి రాసులు వింగడించుకున్నాడు. ఈ విధంగా నభోమండలం—పండ్రెండు భాగాలయింది. ఆ రాసులతోనే మాససంకేతమూ చేసుకొన్నాడు. సూర్యుడు ఒకరాశినుంచి మరొకరాశికి ప్రవేశించడానికి దాదాపు 30,31 దినాలవుతుంది.

కాని, చంద్రుని వృద్ధిక్షయాలతో ఏర్పడిన నెలకూ, తర్వాత సూర్యమానపు నెలకూ క్రమంగా నెలవారా రావడం మొదలైంది. చంద్రమానానికి 19 సంవత్సరాలకు ఏడు అదనపు నెలలుచేర్చి రెండు మాసాలను సర్దుకోవలసి వచ్చింది. కనుకనే ప్రతి మూడోఏటా చంద్రమాన సంవత్సరంలో ఒక్క అధిక మాసం వస్తూవుంటుంది.

నిజానికి చంద్రమానమే వేదకాలంనుంచీ కూడా ఆచరణలో ఉన్నదేమో! సౌరమానం వ్యవహారంలో

ఉన్న ప్రాంతాలలోను వైదిక కర్మలకు చంద్రమానాన్ని అనుసరించడమే దీని ప్రాచీనతకు ప్రమాణం. అగ్నిపూజకులైన పార్సీలు ఎప్పుడో మననుంచి విడిపోయినవారు. వారి సంవత్సరాది నౌరోజ్. అదికూడా వసంతమాసంలో, దాదాపు మన ఉగాది దరిదాపులలోనే రావడం కూడా చంద్రమానం ప్రాచీనతకు మరొక నిదర్శనం. తెలుగు కన్నడ మహారాష్ట్ర మాలవాది ప్రాంతాలవారు చాంద్రమానాన్నే అనుసరించారు. ముస్లింలు—ఏ దేశంవారైనా—పూర్తిగా చాంద్రమానంవారే. అధికమాసాలను పరిగణించి చంద్ర సూర్యమానాలకు సామరస్యం కల్పించే సంప్రదాయం వారికి లేదు గనుక వారి పండుగలు ఒకసారి మన—చైత్రంలో, మరొకసారి వైశాఖంలో—ఇలా సంవత్సరం తిరిగేసరికి ఇట్లే ప్రతినెలకూ తిరుగుతూ ఉంటాయి. చాళుక్యుల కాలంలో మాత్రం సూర్యమానం ఆంధ్రదేశంలో అధికవ్యాప్తిలో ఉండేదట. ఇప్పుడు మనదేశంలో సౌరమానాన్ని వంగ, తమిళ, కేరళ, పంజాబు, సింధు, అస్సాంవారు అనుసరిస్తున్నారు. బార్హస్పత్య మానాన్ని మార్వాడీ, గుజరాతీలు నడుపుకుంటారు. చాంద్ర సౌరమాన సంవత్సరాదులు ఒకనెల ముందూ వెనుకలుగాను, ఒకొకప్పుడు ఒకటి రెండు రోజులు ముందు వెనుకలుగాను వస్తూఉంటాయి—చైత్ర వైశాఖమాసాలలో. బార్హస్పత్యమాన సంవత్సరం దీపావళి అమావాస్యతో ప్రారంభమౌతుంది. శరదృతువు కొన్ని పంటలకాలం గనుక బార్హస్పత్యమాన సంవత్సరాదికూడ పంటలకాలానికి సంబంధించిందే అనవచ్చు.

మేష విషువత్తే దైవతదినానికి — అంటే సంవత్సరార్ధానికి — ప్రారంభమైనప్పుడు; భాస్కరాచార్యుడు సిద్ధాంత శిరోమణిలో సూర్యుడు లంకానగరంలో వసంతఋతువు శుక్లపక్ష ప్రతిపత్తునాడు ఉదయించడంవల్ల (భూ మధ్యరేఖపై ఉండడాన్నిబట్టి) అనాడే ఉగాది అనడంవల్ల;

(లంకానగర్యా ముదయాచ్చ భానో
తస్యైవ వారే ప్రథమం బభూవ,
మధోస్సితాదే ర్దిన మాసవర్షం
యుగాదికానాం యుగప త్ప్రివృత్తిః)

సంవత్సరం వసంతఋతువుతో ప్రారంభిస్తుందని (మధుశ్చ మాధవశ్చ వాసంతికావృతూ) యజుర్వేదం ఒకవైపు ఘోషిస్తుండగాను; ధర్మసింధు, నిర్ణయసింధుకారులు ఈ ఉగాది పండుగ సంవత్సరాది పండుగ అనడం మాత్రమే కాక, నిర్ణయసింధుకారుడు శుద్ధపాడ్యమి నుంచి అమావాస్యవరకుగల కాలమే నెల (అత్ర శుక్ల ప్రతిపదాది దర్శాంత ఏవ మాసః ప్రాయేణ దాక్షిణాత్యై రాద్రియతే) అని నిర్ణయించినప్పుడూ; వివిధ విధాల సంవత్సరాదు లేమిటి?—అనే ప్రశ్న ఉదయిస్తుంది. కాని, ఋతునిర్ణయంలోను, సంవత్సరాది నిర్ణయంలోను ప్రాచీనకాలంలో వివిధాచారాలున్నాయనడమే దానికి సమాధానం. ఒకప్పుడు కార్తులను బట్టి ఋతునిర్ణయం జరిగేది. వేదాంగ జ్యోతిష కాలంలో ధనిష్ఠా కార్తెతో ప్రారంభమైన శిశిర ఋతువుతో—మాఘపూర్ణిమనుండి రెండు నెలలతో మొదటి ఋతువు—సంవత్సరం ప్రారంభమయ్యేది. ఇది ఉత్తరాయణ ప్రవేశకాలం కూడాను. ఇది పరాశరుని మతం. రామాయణంలో చైత్రం పన్నెండవ నెల. రాముడు ఋతువులన్నీ గడిచి పన్నెండవ నెల అయిన చైత్రంలో శుద్ధ నవమినాడు జన్మించినట్టు బాలకాండలో ఉంది. (తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ.) దీనినిబట్టి వైశాఖ ప్రారంభమే సంవత్సరాది రామాయణ కాలంలో. మార్గశిర పుష్య మాసాలున్న హేమంతంతో వత్సరారంభమని కాత్యుని మతం. అమరసింహుని అమరకోశం కాలవర్గలో మార్గశిర పుష్య మాసాలతోనే మొదటి ఋతువని అన్నాడు. మార్గశిర మాసానికి 'ఆగ్రహాయణికః' అనేది పర్యాయం. అగ్రంలో హాయనం కలది—అంటే సంవత్సరమంతా ముందుండేది, లేక సంవత్సరాగ్రంలో ఉండేది. అంటే మన సంవత్సరాది మార్గశిర పుష్య, మాఘ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖాలవరకు జరుగుతూ వచ్చిందని స్పష్టం. అంటే ఆశ్వయుజామావాస్య కార్తీక పూర్ణిమ, మార్గశిర పుష్యాలలో సంక్రాంతి పండుగ, మాఘ పూర్ణిమ, ఫాల్గుణపూర్ణిమ, హోలీ పండుగ, వసంతపంచమి, చైత్రశుద్ధ పాడ్యమి, వైశాఖి, వైశాఖపూర్ణిమ—ఇవన్నీ సంవత్సరాదులే. రామాయణంలో అన్నట్టు వైశాఖంలో సంవత్సరం ప్రారంభించే ఆచారం వల్లనే కాబోలు నేడు ఉత్తరాపథంలో సూర్యమాన సంవత్సరాదికి బైసాఖి (వైశాఖి) అనే వ్యవహారం ఉంది. భారతంలో చైత్ర వైశాఖ మాసాలు వసంత ఋతువనే గణన ఉంది. భవిష్య పురాణంలో యుగాదులను గూర్చిన వర్ణనకూడా సంవత్సరాది వైవిధ్యాన్ని ధ్రువపరుస్తుంది. కృతయుగం వైశాఖ తృతీయనాడు, త్రేతాయుగం కార్తీక నవమినాడు, ద్వాపరయుగం ఆశ్వయుజ త్రయోదశినాడు, కలియుగం ఫాల్గుణ పౌర్ణమినాడు పుట్టాయని కృష్ణభగవానుడు ధర్మరాజుకు చెప్పినట్టు, వీటిని యుగాదు లంటారని అన్నట్టు వుంది. (యుగాదయశ్చ కథ్యంతే తథైతా స్సర్వ సూరిభిః.) మరి ఈ దినమే ఉగాది ఎలా?

ఋతువులు కాలధర్మంతో సంబంధించినవి గనుక సాయనాలు. ఎప్పటికప్పుడు కదలిపోతుంటాయి

విషువత్తునిబట్టి. విషువత్ మారినా మనం ఇప్పటికీ చైత్ర వైశాఖమాసాలు వసంతఋతువు అంటున్నాము. రామాయణకాలంలో వైశాఖజ్యేష్ఠాలు వసంతం. భారతకాలంలో విషువత్ చలించడంవల్ల చైత్ర వైశాఖమాసాల్లో పడ్డది. అంటే భారతకాలంలో విషువత్ మృగశిరలో వచ్చి, వరాహమిహిరుని కాలానికి అశ్విన్యాదికి చలించింది. కనుకనే విష్ణుపురాణం "మేషాదౌచ మృగాదౌచ మైత్రేయ విషువః స్థితః" అని చెప్పింది. తర్వాత మారుతూ వచ్చిందనే కదా! (నేడు మాఘమాసంతోనే వసంతఋతువు ప్రారంభమౌతున్నది. చైత్ర వైశాఖాలలో ఎండలు మండిపోతున్నాయి. ధర్మసింధుకారుడు ఉగాదినాడు నింబపత్రాశనం (వేపాకులు తినడం) చేయమన్నాడు. నేడు మన ఉగాదికాలానికి వేపచిగుళ్లు ముదిరి పూతకూడ రాలిపోయి, పిందెలు పడుతున్నాయి.) వరాహమిహిరుడు క్రీస్తుశకం ఐదో శతాబ్దివాడు. తనకు కొన్ని శతాబ్దాలకు ముందే విషువత్ మృగశిరనుండి అశ్వినీనక్షత్రం ప్రథమ పాదానికి రావడం గుర్తించాడు; వేదాంగజ్యోతిష కాలంకంటె ప్రాచీనమైన బ్రాహ్మణాలకాలంలో వసంత విషుత్కాలం కృత్తికానక్షత్రంలో సంభవించడాన్ని పరిశీలించాడు. తనకాలంలో వసంత విషువత్కాలం అశ్విన్యాదిలో సంభవించడంచేత ఆనాటినుంచి ఉత్తరాయణం-దేవమానదినం—ప్రారంభం కావడం ప్రాచీన సంప్రదాయం గనుక అదే వసంతకాల ప్రారంభంగాను, ఆనాడే సంవత్సర ప్రారంభంగాను నిర్ణయించి మాస ఋతు సామరస్యం చేశాడు. వసంత విషువత్కాలం వచ్చే నెల వసంత ఋతు ప్రారంభం—అంటే చైత్రమాస ప్రారంభంగా పరిగణితమైందన్నమాట. కాని మనం—ధర్మసింధుకారుడన్నట్టు — శుక్లప్రతిపదాదినుంచి అమావాస్యతో ముగిసే కాలాన్ని నెలగా పరిగణిస్తున్నాము గనుక ఆ పాడ్యమినే సంవత్సరాదిగా పెట్టుకున్నాం. నాటినుంచి నేటివరకు చైత్రమాసంలోనే ఉగాది పండుగ అనే ఆచారం ఏర్పడింది.

వరాహమిహిరుడు, వసంత విషువత్తునుబట్టి ఋతుమాస సామరస్యం సాధించనేమో సాధించాడు. కాని, అప్పటినుంచి వసంతవిషువత్ 23 డిగ్రీలు వెనక్కు వచ్చి నేడు ఉత్తరాభాద్ర రెండవపాదంలో పడుతున్నది. అంటే రెండునెలలకు ముందే వసంత ఋతువు ప్రారంభమౌతున్నది. శింశుమారచక్రం ఏడాదికి 50 1/4 వికలలపాటు వెనక్కు తిరుగుతుంది. కనుక సూర్యచక్రం 360 డిగ్రీలు తిరగడానికి 50 వికలలు శేషం ఉండగానే విషువత్ వస్తూంది. ఇలా 72 సంవత్సరాల కొకడిగ్రీ ప్రకారం వెనక్కు వచ్చింది కనుక ఇప్పుడూ మరల సంస్కరించుకోవలసిన అవసరం ఏర్పడింది. ఇటీవల ప్రభుత్వంవారు చేసిన మార్పు—మార్చి 21 తో నవసంవత్సరం చైత్రం ఆరంభమని—కూడా ఈ దృష్టిలో సమగ్రం కాదేమో!

సంవత్సరాది పండుగమాట సరే! ఉగాది అనే మాట ఏమిటి? యుగమంటే కాలం. తదాది యుగాది. మన తోడివారైన కన్నడులు నేడూ యుగాదిఅని యకారాదిగానే దీనిని వ్యవహరిస్తారు. యకారాది పదాలు తెలుగుభాష సంప్రదాయం కాదుగనుక యుగాదిలోని యుకారం ఉకారంగా తెలుగువారి ముఖయంత్రంలో మారి, ఉగాది అయి ఉంటుంది.

"జిజ్ఞాసువు"

# పల్లవులు

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

గత సంచికలో శ్రీ తంగిరాల సుబ్బారావుగారు పల్లవుల పుట్టుపూర్వోత్తరాలు పరిశీలించి" మొట్టమొదట పల్లవులు ఉత్తరహిందూస్థానము వారే. అచ్చటనుండి క్రమముగా దక్షిణాపథానికి వచ్చారు" అని వ్రాశారు. పల్లవులు దక్షిణాపథమువారే నని వాదించేవారికి ఈ 'పల్లవ' అనే పదానికీ 'పహ్లవ' అన్న విదేశీయ జాతి పేరుకీగల సామరస్యము అడ్డు. గౌతమీపుత్రశాతకర్ణి "యవన, శక, పహ్లవాగుల"ను నిర్జించినవాడన్న శాసన వాక్యముకూడా పహ్లవులు భారతదేశములోనికి వచ్చియుండినవారనీ, వారిని గౌతమీపుత్రుడు నిర్జించినాడనీ సూచిస్తూన్నది.

పల్లవరాజు చెక్కించిన శిల్పములను పరిశీలించినప్పుడు చిత్రమైన అంశాలు కొన్ని గోచరిస్తున్నాయి. ఇవి భారతీయములు కావనే నాకనిపిస్తున్నది. వివరిస్తాను చిత్తగించండి.

(1) మహాబలిపురములోని గంగావతరణ శిల్ప చిత్రములో దిగువన ఒక జటామకుటధారి చేతిలో 'కార్నుకోపియా' అనే లేడికొమ్ము ఆకారపు పాత్ర ధరించాడు. ఇది వస్త్రము కానేకాదు. ఇల్లాంటి పాత్ర మనదేశానిది కాదు.

(2) పల్లవులు శిల్పించిన సింహపుజూలు రింగు రింగులూ - గాంధార బుద్ధుని జుట్టు రీతిగా - తీర్చి వుంటుంది. మహిషమర్దనిచిత్రములో ఆమెవాహనమూ ధర్మరాజ సింహాసనమనే బంకకు ఒక అంచునగల సింగపు జూలూ, పల్లవస్తంభాలకు దిగువనగల సింహాల జూలూ రింగు రింగులుగానే ఉంటుంది. అమరావతి శిల్పములలోని సింహాలకు కనబడేజూలు రూపమే వేరు.

పల్లవులు తీర్పించిన సింహాలన్నిటికీ అదే రకపుజూలు కనబడుతూండడమువల్ల అది ఏదో హఠాత్సంభవము కాక, కావలెనని తీర్పించినదేననీ అది వారి(విదేశీయ) శిల్పసంప్రదాయ మేననీ నాకనిపిస్తున్నది.

(3) గణేశరథము పార్శ్వముమీద ఒక శిరస్సూ దానికి కొమ్ముల కిరీటమూ వున్నవి. ఇలాటి కొమ్ములే, అర్జునరథము గర్భాలయ మధ్యములో నుండి (నరసింహ వర్మ ?) మహారాజు బస్టుకు కూడా వుండినట్లు లాంగ్ హార్స్టు 'పల్లవ ఆర్కిటెక్చర్' అన్న గ్రంథచిత్రము వల్లనూ, ఈనాటికీవున్న ఆ బొమ్మయొక్క కిరీట పార్శ్వములలోని కన్నములవల్లనూ, తెలుస్తున్నది. కొమ్ముల కిరీటము - ఒక్క మొహెంజోదారో పశుపతికి తప్ప భారతీయ శిల్పాలలో ఎక్కడా నాకు కానరాలేదు. పట్టదకల్ మల్లిఖార్జునాలయ స్తంభమునకు ఒక ద్వారపాలుడు (కాబోలు) అతికి వున్నాడు. అతని కొమ్ముల కిరీటము పల్లవ శిల్పముల అనుకరణే గాని పశ్చిమచాళుక్యుల స్వంతము కాదను కుంటాను. మహాబలిపుర గుహాలయములలోని ద్వారపాలుర కొందరికి ఇలాటి కొమ్ముల కిరీటాలున్నాయి. మొగల్రాజపురం—, ఇంద్రకీల పర్వత—, గుహాల ద్వారాలకు ప్రక్కన ద్వారపాలురకు ఇలాటి కొమ్ముల కిరీటాలు కనబడుతున్నవి. ఈ కొమ్ముల నడుమ పైకి కోసుగా పోతున్నది కిరీటము.

అయితే ఇది ఏమిటీ? అన్నది ప్రశ్న. పల్లవ రాజులు ఏనుగు తలవంటి కిరీటమును ధరిస్తూండినట్లు కంచి కైలాసనాథాలయములోని శాసనము సూచించిన భాగమును కీ. శే. వెంకయ్యగారి కుమారుడు నిరూపించినారు. 'ది కాయిన్స్ ఆఫ్ ఇండియా' అన్న సి. జె. బ్రౌను పుస్తకములో మూడో ప్లేటులో నాలుగవ నాణెముమీద ఆ ఏనుగుతల (కిరీటము) ఉన్నది. రెండో ప్లేటులోని ఆరవ నాణెము—మినాండరుది—మీద కూడా అలాటి తల ఉన్నది. ఎక్కడ చూచినానో జ్ఞాపకము చాలదుకాని అలాటి కిరీటము ధరించిన గ్రీకు రాజు బొమ్మ ఒక నాణెము ఫోటోమీద చూచినాను నేను.

పల్లవుల కాంచీపురరాజ్యకాలములో ఈ ఏనుగుతల కిరీటము, ఇటూ అటూ కొమ్ములవలె మారిన దంతములతోనూ, పొట్టి అయి పైకి పొడుచుకున్న తొండముతోనూ పల్లవ కిరీటముగా తర్జుమా అయినదా అని నా కనుమానముగా ఉన్నది. పల్లవులు 'శివపాద శేఖరులు'ట. ఈ కొమ్ములుగల కిరీటము పై బిరుదుకు శిల్పవ్యాఖ్యానము కావచ్చునుగదా? కొమ్ములు రెండూ రెండు శివపాదములూ.

చోళులు కూడా శివపాద శేఖరులే. తంజావూరు బృహదీశ్వరాలయ గోపుర ద్వారపాలుర కిరీటాల—పక్కనకాక—పై కొసను త్రిశూలము కనబడుతున్నది పల్లవ కిరీటము ఈ త్రిశూలధారి కిరీటముగా పరిణమించినదనే నా కనిపిస్తున్నది.

పల్లవులు పహ్లవులే. యవనశకాది విదేశీయ జాతులతో భారత దేశమునకు వచ్చినవారు కాబోలు! 'పల్లవభోగ్గము' అని అశోకుని నాటికే పేరుపడ్డ పల్నాడూ, శ్రీశైలారణ్యమూవంటి దుర్గమ ప్రదేశాలలో చిన్న చిన్న రాజ్యాలు ఏర్పరుచుకుని పాలిస్తూ, శైవము నవలంబించి, లింగపూజచేస్తూ, శాతవాహనుల ఒత్తిడికి శ్రీశైలారణ్యములలో నిక్కిపోయి, శాతవాహనుల ప్రభ క్షీణించిన తరువాత కంచిలో రాజ్యస్థాపన చేసుకుని విజృంభించారు. బౌద్ధులు అనూరాధపురమువంటి క్షేత్రాలలో ద్వారపాలురుగా నిలిపిన నాగులను తప్పించి గదాధరులను ద్వారపాలురుగా నిలిపినవారు పల్లవులేనని వారి శిల్పాల సాక్ష్యము.

## "సంపన్న సమాజం"

ప్రపంచంలో, అన్ని దేశాలకన్నా అమెరికా అత్యైశ్వర్యవంతమయినదని ఈ క్రింది లెక్కలను పరిశీలిస్తే తెలుస్తుంది. మొత్తపు ఉత్పత్తి శాతంలో ఇవ్వబడినది (1955 సం॥).

| | |
|---|---|
| ఉక్కు - 40% | (రష్యా 17%) |
| పెట్రోలు - 49% | (రష్యా 10%) |
| రైలుమార్గాలనిడివి - 35% | (రష్యా 10%) |
| బొగ్గు - 27% | (రష్యా 16%) |
| మోటారుకార్లు - 72% | (రష్యా 15%) |

ఇటీవల ప్రొంజాన్ కెన్నెత్ గాల్ బ్రెయిత్ 'Affluent Society' అనే పుస్తకంలో ఈ విషయాన్ని చర్చిస్తూ కొన్ని చిత్రమైన సిద్ధాంతాలను ప్రతిపాదించారు. "సంయుక్తరాష్ట్రాలలో తిండి తక్కువ అవడంవల్ల కన్నా ఎక్కువ తినడంవల్ల చాలామంది మరణిస్తున్నారు. ఒకప్పుడు జనసంఖ్య ఆహారపదార్థాలను వెంటాడుతూ ఉంటే ఇప్పుడు ఆహార పదార్థాలు జనాన్ని వెంటాడుతున్నాయి. మన కార్లకు వాడే ఉక్కులో నాలుగు అయిదు అడుగులు కేవలం అలంకారానికి తప్ప అవసరానికి మాత్రం కాదని ఎవరైనా ఒప్పుకు తీరుతారు." "...ఉత్పత్తి మన భావాలలో అతి ముఖ్యంగా ఉండిపోయింది." (ch 9, sec II.) ప్రాచీన అభిజాత్య ఆర్థిక సిద్ధాంతాలు ఏపరిస్థితులలో ప్రతిపాదింపబడ్డవో విశదీకరిస్తూ, ప్రస్తుతం

అమెరికాలోని సిద్ధాంతాలు ఈ సిద్ధాంతాలనుండి అభివృద్ధిపొందినవని గాల్‌బ్రెయిత్ అభిప్రాయపడ్డాడు. పైన ఉదాహరించిన వాక్యాలు ఉత్పత్తిని (production) అన్నిటికంటే ముఖ్యమైనదిగా పరిగణిస్తున్నారనే విషయాన్ని బయటపెడుతుంది. ఆడమ్‌స్మిత్, మాల్తూస్ మొదలయినవారి కాలంలో ప్రపంచం మొత్తంమీద దారిద్ర్యమే ఎక్కువగా ఉండటంచేత, కొందరు ఎప్పుడూ తక్కినవారికంటే సంపన్నంగా ఉండడం తప్పదనీ, జనాభా సంఖ్య పెరుగుదలని వస్తు సంపదయొక్క పెరుగుదల మించలేదనీ ఒప్పుకోవలసి వచ్చినది. ఆ తరువాత యంత్రాలవల్ల పరిస్థితులు పూర్తిగా మారిపోయినా ఈ సిద్ధాంతాల ప్రాబల్యం తగ్గలేదని గాల్‌బ్రెయిత్ చెప్తున్నాడు. అందువలన అప్పటికీ ఇప్పటికీ 'ఉత్పత్తి' అతి ముఖ్యమయినదిగా పరిగణిస్తున్నారు. ఈ ఉత్పత్తికి సంబంధించిన సిద్ధాంతాలపైన కూడా డార్విన్ సిద్ధాంతాల ప్రభావం లేకపోలేదు. అందుచేత 'పోటీ' (Competition) ఆర్థిక సిద్ధాంతాలలో అతిముఖ్యమైన స్థానం అలంకరించినది. గాల్‌బ్రెయిత్ పోటీయొక్క ప్రాముఖ్యాన్ని తీసివేయడంలేదు. ఉత్పత్తినిగురించిన పాతసిద్ధాంతాలు జీవితంలోని ప్రాథమికావసరాలు దీర్చడం కష్టమైన పరిస్థితులలో ప్రతిపాదింప బడటంవల్ల ప్రస్తుతం అమెరికాలో ఈ సిద్ధాంతాలకు ఇస్తున్న ప్రాముఖ్యం అనవసరమని అతనివాదం. ఉత్పత్తిమితిమీరిపోయిన పరిస్థితి అమెరికాలో ఏర్పడినది. అందువల్ల తయారుచేసిన వస్తువులను అమ్మటానికి ప్రకటన పద్ధతులు కూడా మితిమీరిపోయినవి. అవసరంలేని వస్తువులను కొనడంవల్ల ప్రజలకు కొత్త అవసరాలు కలుగుతాయి (పెద్దకారు కొనడంవల్ల, ఎక్కువ పెట్రోలు ఖర్చైనట్టు). ఇదే విధంగా తక్కిన అనవసరమయిన వస్తువులవల్ల ఇంకా అనవసరమయిన అవసరాలు ఏర్పడుతాయి. ఈ పరిణామక్రమానికి అంతు ఉండదు.

వీటన్నింటివల్లా మరొక పరిస్థితి ఏర్పడుతున్నదని గాల్‌బ్రెయిత్ అభిప్రాయం. కేవలం వ్యాపారంలోనే నిమగ్నులయిపోయి ప్రజలూ, సంఘమూ తమ బాధ్యతలను మరచిపోతున్నారు. "మనం వ్యక్తిగతమైన ఆస్తిని అభినందిస్తున్నాంకాని దీనిని కాపాడే రక్షకదళానికి కావలిసిన ఖర్చులకు ఇష్టపడడంలేదు." (ch 9, sec v) ఈ పరిణామంవల్ల సంఘంలోని తుల్యస్థితి తప్పిపోతున్నది.

ఈ విషయాన్నే ఇటీవల మన ప్రధాని అజాద్ స్మారకోపన్యాసంలో చూచాయగా చర్చించారు; ఉత్పత్తికి మునుపు ఉన్న ప్రాముఖ్యం లేదన్నారు; ఉత్పత్తికన్నా, ఉత్పన్నమయిన వస్తువులను ప్రజలకు న్యాయముగా పంచడమే ముఖ్యమని చెప్పారు. మనదేశంలో ఉత్పత్తి జనసంఖ్యకు పోలిస్తే చాలా తక్కువగనుక మనకు అమెరికాలో ఉండే సమస్యలు లేవు. కాని మనము సోషలిజమ్‌ను స్వీకరించినట్లు నెహ్రూ చెప్తున్నారు. సామ్రాజ్యవాదాన్ని ఖండిస్తూ జాతీయసిద్ధాంతాన్ని (స్వరాజ్య సిద్ధాంతాన్ని) నెహ్రూ పొగడారు. ఇక్కడ ఒక అనుమానం కలుగవచ్చు. H. G. wells ఈ అనుమానాన్ని స్పష్టంగా చెప్పారు. "If socialists object to a single individual claiming a mine or a great stretch of agricultural land as his own individual proparty, with a right to refuse or barter its use and profit to others, why should they permit a single nation to monopolise the mines or trade routes or natural wealth of the territories in which it lives, against the rest of mankind?" (The out line of *History* ch *37*, sec *5*.) ఈ ప్రశ్నకు సులభమయిన సమాధానం లేదు. నెహ్రూ కూడా తమ ఉపన్యాసంలో ఎక్కడా సరియైన సమాధానం ఇవ్వలేదు. పన్నులను అంగీకరించేవారు విదేశద్రవ్య సహాయం విషయమై ఎందుకు అంతబాధపడుతున్నారో అర్థంకావడం కష్టం. ఇచ్చేవారూ, పుచ్చుకునేవారూ కూడా కొంచెం హడావుడిచేసిన తర్వాతనే ద్రవ్యసహాయం జరుగుతున్నది.

# గ్రంథవిమర్శనము

## నవ్యసాహితి

[కవితా సంకలనము]

ప్రచురణ: నవ్యసాహితీ సమితి. 208, బోయిగూడ, సికింద్రాబాదు, వెల: సాదా ప్రతి 4-50 గ్రంథాలయ ప్రతి 5-50.

కవితా సంకలనాలనేక విధాలు. ప్రత్యేక జీవిత దృక్పథంకల కవుల రచనలొక సంపుటిగా ప్రకటించవచ్చును. లేక ప్రత్యేక విషయమేదయినా ప్రధానంగా స్వీకరించి ఇటువంటి సంకలన రూపొందించవచ్చును. లేక సాహిత్యంలో ఒక ప్రధాన యుగానికే ప్రాధాన్యం కలిగించవచ్చును.

కాని 'నవ్యసాహితి' సంకలనం పై మార్గాలన్నిటికీ విభిన్నమయిన పంథాలో నడిచింది. ఇటీవల హైదరాబాదులో వెలిసిన నవ్యసాహితీ సమితిసభ్యుల కవన రచనలు కొన్ని చేర్చి ఒక ప్రత్యేక గ్రంథంగా ప్రచురించడమే సంపాదకుల ప్రధాన లక్ష్యం.

శ్రీ శివశంకరస్వామి, శ్రీ నోరి నరసింహశాస్త్రి, శ్రీ నిడుదవోలు వెంకటరావు, శ్రీ దాశరథి కృష్ణమాచార్య, శ్రీ సి. నారాయణరెడ్డి మొదలయిన ప్రసిద్ధులే కాక అంతగా ప్రసిద్ధులుకాని కొంగ్రొత్తకవులెందరో ఈ సంకలనంలో కనిపిస్తున్నారు.

ప్రసిద్ధులలో శ్రీ నిడుదవోలు వెంకటరావు మొదలయినవారు కేవల సాంప్రదాయికులు. శ్రీ దాశరథి మొదలయినవారు ఆధునికులు. ఇంకా ఈ రెండు వర్గాలకు చెందని అత్యాధునికులు, వేర్వేరు వింతధోరణులవారు అనేకులున్నారు. ఈ విధంగా ఈ సంకలనం ఒక విచిత్రమయిన కలగూరగంపలా తయారయింది.

కొందరంతగా పేర్కొనదగిన కవులు కాకపోవచ్చును. కాని ఇటువంటి వారొకప్పుడొక చక్కని ఖండిక రచించవచ్చును. ఆ విధమయిన ప్రత్యేక రచనలతో పాశ్చాత్యవాఙ్మయాలలో చిరస్మరణీయులయిన వారనేకులున్నారు. ఈ సంకలన సంపాదకు లిటువంటి రచయితలకు ప్రాతినిధ్యం కల్పించదలచినప్పుడు వారి ప్రసిద్ధ రచనలే సేకరించవలసి ఉన్నది. సంపాదకులీ విషయంలో అంతగా శ్రద్ధ వహించినట్లు కనబడదు. అందుచేత ఈ సంపుటిలో చక్కని రచనలతోబాటు అతి సామాన్యమయిన ఖండికలుకూడా చేరిపోయాయి.

ఈ కవితా సంపుటిలో సాంప్రదాయికమైన వృత్తాలు, కందాలు మొదలయిన ఛందో రీతులేకాక స్వేచ్ఛా ఛందో రచనలు, వచన కవితా రచనలుకూడా చేర్చారు. ఈ ధోరణి ఖండికలలో శ్రీ కుందుర్తి రచన ప్రప్రథమంగా పేర్కొనదగినవి. వీటిలో 'యుగే యుగే' ఎన్నదగిన గమకంతో సాగిపోతుంది. ఇది ఆ రచనలో ఒక భాగం:

'చెవులెత్తి విను నరుని తలపుల అలమందలకు
చక్కిలిగింతగా
అడవి మూలమూలల త్రవ్వి రొమ్ముత్తినఅందము
పుక్కిలింతగా
వేణు వోగలూదిన భువనమోహన గీతాశీలుణ్ణి
కాను బాలుణ్ణి, గోవర్ధనగిరి ఎత్తిన గోపాలుణ్ణి
భూలోకపు రౌరవ కారవ పాలనసాగినవిశాలపరిధిలో
హాలాహల జన్మ హేతువయిన ఈ బ్రతుకు
శ్రమల వారిధిలో
కోటికోట్ల నరులకు దిన దినం పెరిగే వగే
ఈ నా అవతారానికి పరమ కారణం
శ్రద్ధగా వినుమోయి నరుడా!
నేను సంభవామి యుగే యుగే'

ఇక శ్రీ శివ శంకరస్వామి. శ్రీ నోరి నరసింహశాస్త్రి మొదలయినవారి రచనలు చాలావరకు పత్రికలలో ఇంతకు పూర్వం ప్రకటింపబడినవే.

ఈ సంపుటిలో బుచ్చిబాబు, మురయా మొట్టమొదటగా కవులుగా అవతరించారు. బుచ్చిబాబుగారి 'ఆకలిదప్పులు' ఒక వినూతన దృక్పథంతో సాగింది.

విజయవాటికపై 'అభ్యుదయము' అనే శీర్షికతో శ్రీ శివశంకరస్వామి రచించిన గీతిక సంపాదకులీసంకలనం మొట్టమొదట ప్రచురించారు. ఈ శీర్షిక దీనికెంత

వర కవ్వయిస్తుందో ఇదమిత్థంగా నిర్ణయించడం చాలా కష్టం. కాని ఇది శ్రీ స్వామిగారి ఖండికలలో ఎన్నదగిన రచన.

"స్వర్ణవాహినిలో న స్నపితమైనవిధాన
ధరణీధరాగ్రముల్ తనరారుచున్నయవి!
అమూల చూడముగ నవనీరుహ శ్రేణి
పల్లవించినరీతి భాసిల్లుచున్నయది.
కౌసుంభరాగాంశుకమ్ము తాల్చినయట్లు
జిల్గుచున్నది కృష్ణవేణీమహోజని.
దివ్యదేహాలతో తేజరిలుచున్నారు.
శాద్వలస్థలముపై సంచరించెడు జనుల్
ఉత్సాహ వివశులై ఉప్పరంబునబోవు
ఖగకులారవముల్ కర్ణోత్సవము చేయు
మందమందమ్ముగా మలసి యంగములంటె
పవనాంకురావలిల్ పారవశ్యముగొల్ప
ఇది విజయవాటికా! ఏదుఃఖములు లేక
ఆనందతుందిలంబగు స్వర్గవాటికా!
ఈ ప్రభాతము వేళ దేవై పుకముగొన్న
నవ్య సృష్టివిధాన నాకన్నులకు దోచు!"

నేటికాలంలో కవులు స్వతంత్రంగా తమ కావ్యాలు గ్రంథరూపంలో ప్రచురించుకొనే అవకాశాలు చాలా తక్కువ. ఇందుచేత కవితా సంకలనా లీలోపం చాలవరకు తీర్చగలవు. నిజానికి వేర్వేరు లక్ష్యాలతో మనకిటువంటి సంకలనాలింకా ఎక్కువగా రావలసియున్నాయి.

ఈ దృష్టితో పరిశీలిస్తే ఈ సంకలనం పాఠకులందరు పరిశీలించదగినదే. అయితే ఉత్తమ కవితా దృక్పథంతో పరీక్షిస్తే దీనిలో లోపాలెన్నో గోచరిస్తున్నాయి.

నవ్యసాహితీసమితివారికముందైనా ప్రత్యేక లక్ష్యంతో అధునాతన సారస్వతంలో ఎన్నదగిన సంకలనాలు ప్రచురించగలరని ఆశిస్తున్నాను.

'శాస్త్రి'



## ప్రపంచ కథలు

### (రెండవ భాగం)

వస్తుతః మానవ జీవితం సరళమైనది. నాగరకత బలిసిన కొలదీ మానవుడు చేతులారా తన జీవితాన్ని జటిలం చేసుకొన్నాడు. చివరికి ఆ వలలోనుంచి బయట పడలేక బాధ పడుతున్నాడు. కనుకనే తిరిగి ప్రకృతికి సన్నిహితుడు కావడానికి ప్రయత్నించడం మానవునికి పరిపాటి అయినది. ఏ అవస్థలో అయినా ఉన్నదానితో తృప్తి చెందడం అలవడలేదు.

కథకూడా జీవితం వంటిదే. జీవితంలో ముఖ్యమైన సారళ్యం కథలోనూ గోచరించదు. మానవ జీవితాన్ని అవగతం చేసుకొని, మానవుని ప్రేరేచే శక్తులను అవగాహన చేసుకొని, వాటి ప్రభావం మూలముగా సంభవించే బహిరంతర సంఘర్షణలను కథలో సరళంగా చిత్రించడం అందరికీ సాధ్యం కాదు. ఐతే ఎల్లకాలమూ నిలిచివుండే ఉత్తమమైన కథలకు ఈ సారళ్యమే గీటురాయి.

ఈ కోవకు చెందినది ఖ్వాజా అహ్మద్ అబ్బాస్ రచించిన కథ—"ఆరోహణ-అవరోహణ." ఈ సంపుటంలో టాగూర్, మపాసా, విక్టర్ హ్యూగో, ఫ్రాంకాయ్ మున్నగు మహా రచయితల కథలు ఉన్నాయి.

(ప్రపంచ కథలు. రెండవభాగం. అనువాదం — 'రవి.' ప్రకాశకులు—ప్రజా సాహిత్య పరిషత్తు, తెనాలి. మూల్యం—ఒక రూపాయి పావలా.)

'ఆరోహణ — అవరోహణ' లో ఇతివృత్తం ఇది. సర్వ సామాన్యమైన జీవితం గడపే నిర్మల్ కుమార్ అంతవరకు తనకు అందుబాటులో లేని జీవితంలో ఏదో అనిర్వచనీయమైన మహానందం ఉన్నదని ఊహించాడు. కోరుకొన్నాడు. కలలు కన్నాడు. చివరికి సెలవులలో కాశ్మీరు వెళ్ళి వచ్చాడు అనే భ్రమలో ఉన్న శిరి సాంగత్యంలో అలాంటి ఆనందం అనుభవించాడు. తిరిగి తనకు నిజమైన పరిస్థితులలో పడేసరికి ఆ ఆనందానికి అంతరాయం కలిగినది. ప్రకృతంలో పడ్డారు. ఎవరి జీవితమార్గం వారు అనుసరించడానికి నిశ్చయించుకొని విడిపోయారు. ఇది అత్యంత సరళమైన మనోజ్ఞ కథాచిత్రణం.

ఈ సంపుటిలో 11 కథలు ఉన్నవి. వాటిలో మూడు ఫ్రెంచి కథలకు అనువాదాలు. తతిమ్మావి భారతీయ భాషలలో కథలు.

అనువాదాలు అధికంగా ప్రచురితం అవుతున్న కాలమిది. దేశభాషలలో నేమి, విదేశ భాషలలో నేమి ఉన్న ఉత్తమ సాహిత్యాన్ని అనువదించి తెలుగు పాఠకులకు అందజేయడం ఎవరు చేసినా హర్షించ దగినదే. అయితే ఈ అనువాదాలన్నిటిలో సర్వసాధారణంగా కనుపించే లోపాలు కొన్ని ఉన్నవి. అనువదించడంలో తగుశ్రద్ధ చూపకపోవడం ఒకటి. సుప్రసిద్ధమైన రచనలే అయినా, సామాన్యమైనవే అయినా అనువాదాలు మూలానికి చాలా సన్నిహితంగా ఉండడం ఆవశ్యకం. స్వీయరచనలలో చూపే శ్రద్ధకన్న అనువాదాలపట్ల చూపవలసినది సహజంగానే అధికంగా ఉండాలి. మూలానికిగాని, మూలరచయితకుగాని అవంతయినా అపచారం జరుగరాదు. ఇతర భాషలలోనుంచి ఇంగ్లీషు భాషలలోనికి అనువదించే రచయితలు చూపే అత్యంతమైన శ్రద్ధ సుపరిచితమే అయినా తెలుగు అనువాదకులు ఈ విషయంలో అలసత్వం వహించడం తగదు. అనువాదాలలో భాషాదోషాలకు అచ్చుతప్పులు తోడుకావడం మరొక పెద్ద లోపం. ఇది క్షంతవ్యం కాదు.

'రవి' అనువాదం సాఫీగానే సాగినది. ఉన్న స్వల్పమైన దోషాలను మలిముద్రణంలో అయినా సరిదిద్దుకొనడానికి ప్రయత్నించడం అవసరం.

ప్రపంచ కథలలో ఉత్తమమైన తెలుగు కథలను కూడా చేర్పడానికి ప్రయత్నించడం—అందులోనూ భారతీయ భాషలలోనుంచికూడా కథలను అనువదించినప్పుడు సహజంగా ఉంటుంది.

ఈ సంపుటంలోని కథలు గురించి అంతగా చెప్ప వలసిన పనిలేదు.

కఠోరమైన కర్తవ్య నిర్వహణంలో హృదయం బండబారినది. ధర్మం పేరిట హింసాచరణం విధానమైనది. మానవత్వం లోపించినది. తెలియకుండా ప్రేమ హృదయంలో ప్రవేశించినది. చివరికి ప్రియుడే తన చేతిదెబ్బకు గాయపడినప్పుడు రాకుమారి మంద్ర ప్రేమను గుర్తించక తప్పలేదు. భిక్షువుకు సర్వస్వానికి అర్పించుకొని ధన్యురాలైనది. ఇది రవీంద్రుని 'భిక్షువు'లో ఇతివృత్తం. ఖలీల్ జిబ్రాన్ 'రచించిన - వధువు'లో విషాదం పరాకాష్ఠ నొందినది. సలీమ్ ప్రేమించాడు. ఆమెకూడా అతని ప్రేమించినది. సలీమ్‌ను ప్రేమించిన సోసన్ ఆమెను మోసం చేసినది. ఆమెకు వేరొకరితో వివాహమైనది. తీరా వివాహం అయినతరువాత ఆమె సత్యాన్ని గుర్తించినది. సలీంతో సాంగత్యాన్నే అభిలషించినది. కాని అతనికి సమ్మతం కుదుర లేదు. అవమానం సహించలేక ఆమె సలీంను పొడిచి తానుకూడా చేతులారా ప్రాణం తీసుకొన్నది. ఈ పరిణామానికి కారణమైన సోసన్ జీవితమూ నీరసమైనది.

కన్నబిడ్డలకు పట్టెడు మెతుకులు అయినా పెట్టలేని నిర్భాగ్యజీవులు తోడిజాలరి అనాథబిడ్డలకు ఆనందంతో ఆశ్రయమిచ్చిన ఉదాత్తమైన గాథ విక్టర్ హ్యూగో రచించిన 'జాలరులు'.

తక్కిన కథలుకూడా ఉత్తమమైనవి. ప్రత్యేకంగా పేర్కొనదగినది మన్మథనాథ్ గుప్త రచించిన 'ఇంటికోసం'. ప్రేమించి వివాహం చేసుకొన్నా అద్దెకొంపలో స్థలాభావం సమస్య అయినది. వృద్ధుడైన తండ్రి అయినా తలదాచుకోవాలి; కొత్త కోడలు అయినా ఇంటిలో ఉండాలి. ఇద్దరికీ ఎడం లేదు. ఈ పరిస్థితి సహించలేక ఆమె పుట్టినింటికి పారిపోయినది. వృద్ధుడైన తండ్రి పరలోకానికి పోతేగాని సమస్య పరిష్కారం కాలేదు.

అందరు చదువతగిన కథలు. పాఠకుల ఆదరాభిమానాలు పొందగలవు. —కామరాజు.

## గాథాసప్తశతి

[అనువాదకులు: కవితావతంస, కావ్యతీర్థ శ్రీగట్టి లక్ష్మీనరసింహశాస్త్రి. పుటలు: క్రౌను 216. మూల్యము: మూడురూపాయలు. ప్రాప్తిస్థానము: కూచిభొట్ల వీరరాఘవశాస్త్రి, కల్యాణీప్రెస్, తెనాలి.]

ఎంత రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా!—అన్నాడు ఎంతో ఆవేదనతో చేమకూర వేంకటపతికవి. పెరవారి రచనలలోని రామణీయకాన్ని గుర్తించి గౌరవించడమనే సహృదయత ప్రాచీనరచనలపట్ల అహమహమికతో పరుగులుతీసినంతగా సమకాలిక రచనలవైపు మొగ్గదు. కనుకనే సమకాలమువారిని మెచ్చడం సహృదయతకు పరాకాష్ఠ.

ఈ పరాకాష్ఠకు పట్టాభిషేకం తొలిసారిగా జరిగింది తెలుగునాడులోనే. హాలశాతవాహనుడు తన కాలంలో అనోట అనోట వినిపించే కమనీయ ప్రాకృత కవితలను—పూర్వంవి, సమకాలంవి—ఏర్చి గాథాసప్తశతిగా కూర్చి, ఈలాటి కూర్పులో తర్వాతివారికి తెన్నులు తీర్చాడు.

ఈ గాథాసప్తశతికి శ్రీనాథుడు 'నూనూగు మీసాల నూత్నయౌవనమున' నే అనువాదం ప్రారంభించాడు. తరంకింద శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, కొన్నిటికి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అనువాదం చేశారు. ఇది పదిహేను సంవత్సరాలక్రింద అనూదితమై మూడు సంవత్సరాలక్రింద ముద్రితమైంది.

భాషాంతరీకరణం—అనువాదం--సామాన్యమైన పనికాదు. అనువాదకుడు మూలకారునితో సమానమైన పాండితీ ప్రతిభలు కలవాడు కాకపోయినా, మూలకారుని మనసును పట్టగలిగినప్పుడే అనువాదం మూలమంత మధురమౌతుంది: అలా కానప్పుడు నా మిత్రులొకరు అన్నట్టు

"భగవద్గీతా కించి దధీతా
గంగాజలలవ కణికా పీతా"

అన్నదానికి

"భగవద్గీతలు కించి దధీతలు
గంగాజలలవ కణికలు పీతలు"

లా ఉంటుంది. మన సాహిత్యం అనువాదంతోనే ఆరంభమైంది. కాని, సిద్ధహస్తులైనవా రెందరు! శ్రీనాథునివంటివాడు ఆర్యను మత్తేభాలు చేయడంవల్ల వ్యర్థపదాలు గుప్పించాడు.

అనువాదం సాధారణంగా రెండు విధాలు. మొదటిది: మూలాన్ని యథాతథంగా అనుసరించడం, రెండవది: మూలాశ్రయమైన స్వతంత్ర రచన. ఇది ఒకొకప్పుడు మూలాతిశాయికూడా కావచ్చును. కథాప్రధానమైన పురాణేతిహాసాల తెలిగింపులో రెండవ పద్ధతి రమ్యంగా ఉంటుంది. గాథాసప్తశతివంటి రసఖండాల తెలిగింపులో మూలంలోని తీపిరేటలు తెచ్చుకోకపోతే వాటిశిల్పం మనకు భాసించదు; ఆనందమూ ఉద్బుద్ధం కాదు. కనుక మొదటిపద్ధతే ఈలాటి విషయంలో సముచితం. ఈ దృష్టితో పరిశీలించినప్పుడు, శ్రీ లక్ష్మీనరసింహశాస్త్రిగారు మూలంలోని సొగసులను కొన్నిచోట్ల అనువాదంలోకి కొనివచ్చారనడం నిస్సందేహం. కాని, పెక్కుచోట్ల శ్రీనాథునిలాగ ఆర్యను మత్తేభంమీద శార్దూలంమీద ఎక్కించడంవల్ల, చంపకాదిమాలలు వేయడంవల్ల అది మహాకాయమూ, మహాభీకరమూ, శ్రీ మథురానాథశాస్త్రి ఛాయావ్యాఖ్యలను అనుసరించడంవల్ల మూలవిరుద్ధమూ కావడం—సింహావలోకనం చేసుకునివుంటే వారికే తెలిసేది. అలాటివాటిని కొన్నిటిని పాఠకులు పరికించండి:

(1) తాలూర భమాఉల ఖుడిఅ
  కేసరో గిరిణఈఏ పూరేణ,
దర ఉడ్డఉబుడ్డ ణిబుడ్డ
  మహుఅరో హీరఇ కలంబో. 1-37

ఘన సలిల భ్రమాకులిత
  ఖండిత కేసరమై భరమ్మునన్
మునుగుచు తేలుచుక్ రసని
  ముగ్ధత మూగిన తేంట్లగుంపుతో
గునగున నృత్యమా కడిమి
  కొమ్మనదే సెలయేటి పాయ గొ
బ్బున దనలోన కీల్కొని
  పో జతవించుచు నున్నదంతయున్."

(ఇక్కడ కొండవాగులోపడింది కదంబకుసుమం కాని కొమ్మకాదు. కడిమిపూవు పడి సుడిలోచక్కర్లు కొడుతూ మునుగుతూ తేలుతూ పోతూవుంటే తుమ్మెదలు తేనెకోసం వెంటవంటాయి. పూవుఅన్నప్పుడున్న సొగసు కొమ్మఅంటే లేదు. కొమ్మ కొట్టుకుపోతూ ఉంటే కేసరాలు రాలిపడే ప్రసక్తికంటే ఆకులు యిదాయిదలై పడడమే ఉంటుంది. మథురానాథశాస్త్రికూడా ఈ సారస్యం గ్రహించక 'కదంబవృక్షః' అని వ్యాఖ్యానించాడు. శ్రీ అనంతకృష్ణశర్మగారి అనువాదం చూడండి:

కొండసెలయేటి సుడికి జిక్కి కొని కలిగి
తిరుగుచును గేసరంబులు విరిగిపోవ
కొంత మునుగుచు దేలుచు కొదమ లేటి
వెంటనంట గడిమిపూవు వెళ్లబోరె.)

(2) అసరిఅచిత్తే దిఅరే
సుద్ధిమణా పిఅఅమే విసమసీలే,
ణ కహఇ కుడుంబ విహడణ
భఏణ తణుఆఅఏ సోణ్హా. 1-59

మరది కడుం జెడుం గరవ
  మాలిన బుద్ధి మెలంగుచుంట గు
ర్తెరిగియు నింటి కోడలు వ
  చింపదు తొందరపాటు వాడుగా
గరగరయైన వాఘునకు
  గాపుర మల్లరితోడ జెంద్రవం
దర యవునన్న భీతి వీర
  తం బెద గ్రుంగుచునుండు గాని తాన్.

(వృత్తంలో నవపదలచనంవల్ల ఎన్ని పదాలు పోగు చేయవలసివచ్చిందో చూడండి. దీనికే శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి తెలుగుసేత.

తన మగండు గండ్రడ వినుకముం దరయదు
మరది యింట చెడ్డమనసువాడు
వెల్లడింప దెదియు నిల్లాలు గుణవతి
నలుగుచున్న దిల్లు నిలుపుకొరకు.

ఇదెంత సంస్కృతి సుందరమో సహృదయుల హృదయం ప్రమాణం.)

(3) దిఢమణ్ణుదూణిఆఏ వి
గహిఓ దఇఅమ్మి పేచ్ఛఇ ఇమాఏ,
ఓసరఇ బాలుఆ ము
ట్ఠివ్వ మాణో సురసురంతో. 1-74.

ఉడుగబోని కట్టలుకచే నుసుకుచు దయిత
దయితు వెసగొట్టి బిగి యెల్లదనకు దాన
రెండవలి పుడిపిట బట్టిన యిసుకవోలె
సురసురంబోవుచున్నది చూడు డిటులు.

(మూలంలో ఉన్నది పిడికిలి కాని పుడిసిలి కాదు. పిడికిలిలో పట్టుకున్న ఇసుక సులభంగా రాలిపోవడం లోని సారస్యం పుడిసిలిలో పట్టినప్పుడు లేదు. మూల విరుద్ధంకూడా.)

(4) ణ్హాణ హారిద్దా భరి అం
తరాఇ జాలాఇ జాలవలయస్స,
సోహంతి కిలించిఅకంటఏణ
కం కాహిసీ కఅత్థమ్. 1-80.

స్నానమున బసుపంటిన జాలవలను
జాలముల బాగుసేయగా సాగినావు
వెదురు పుడకతో బసతి యిచ్చ్యేళ బాలి
యెవని ధన్యుని జేయ నూహించినావో!

(ఒకయిల్లాలు స్నానం చేసి, వాకిట్లో కూచుని త చిక్కు తీసుకుంటూ దువ్వెనలోని మకిలను పుల్లతో తీసివేస్తున్న సుందరదృశ్యం. ఇది అనుదినం మనం చూచేదే. కాని నరసింహశాస్త్రిగారు ప్రాచీన వ్యాఖ్యాతలు జాలవలయమంటే దువ్వెనఅని చెప్పిన అర్థాన్ని మాని మధురానాథునిమాటల్లోపడిమూలంలోని అందాన్ని కొంత మాయంచేశారు. జాలవలయజాలం— అని దాటివేశారు. శ్రీ శర్మగారి అనువాదమిది:

పసపునీళ్లాడి దువ్వెనపండ్ల నడుమ
జిక్కుకొనియున్న మైలను జిన్నిపుల్ల
గ్రుచ్చి తీసెద వెవ్వని కోర్కి పండ
జేయనున్నావు తెల్పవే చిన్నదాన ?)

(5) తటసంఠిఅ ణీడేక్కంత
పీలుఅ రక్ఖణేక్క దిణ్ణమణా,
అగణిఅ విణిఆఅ భఆ
పూరేణసమం వహాఇ కాఈ. 2-2.

పొంగి కరుళ్ళుమించికొని
  పోవునొ, ముప్పున నందుగూలి యే
భంగము గల్గునో, యనిన
  భావనలేక, తటద్రుమాగ్రశా
ఖంగల గూట రెక్కలను
  గప్పిన పిల్లల గాచుకొంచు హో
యింగొను కాకి నేడు ప్రవ
  హించి గతించిన ఏటి నీటిలోన్.

(ఏట్లో చెట్టు కొట్టుకుపోతూ ఉంది. ఆ చెట్టు కొమ్మపైన కాకిగూడు. దానిలోని తన పిల్లలను కాపాడుదామనే ఆతరంకొద్దీ తల్లి కాకి, చెట్టు మునిగిపోతుందనే భయంకూడా లేకుండా ఏటి ప్రవాహం వెంటనే ఎగురుతూ పోతూంది.—ఇది మూలం తాత్పర్యం. అనువాదకులు 'హోయింగొను కాకి నేడు ప్రవహించి గతించినఏటి నీటిలోన్' అని అనువదించడంలో ప్రవాహం వెంబడినే పోతూ ఉంది అన్న అర్థంరాక గతించినది—మరణించిందనే అశ్లీలార్థం వస్తుంది. దీనికి శర్మగారి అనువాద మిది:

కొమ్మకొనపయి గూటిలో గూరుచున్న
తనదు పిల్లల గాపాడు పనియె తలచి
మునిగిపోవుదునను భీతి గొనక కాకి
వెసలెడని గంటె చెట్టుపై వెల్లివెంట.)

(6) ఘాలేఇ అచ్ఛభల్లం వ
ఉఅహ కుగ్గామ దేఉలద్దారే,
హేమంతఆల పహిఓ
విజ్ఝాఅంతం పలాలగ్గిం. 2-9

చేరి దరిద్ర జానపద
  సీమమునందలి గ్రామదేవతా

గారవు ద్వారమందు జలి
　　గాలికి నీల్గుచు బాటసారి చ
ల్లారిన చెత్తనిప్పు మసి
　　యారిన కుప్పను నూది నోటితో
సారెకు జీల్చసాగ బడి
　　చచ్చిన పెద్ద రొయ్యలుంగునుంబలెక్.

(చలికాలం. కుగ్రామదేవాలయంముందు గడ్డిమంట వేసుకున్నాడొక బాటసారి. గడ్డి బుసబుసమండి ఆరిపోతుంది. కాని కుప్పగా వల్లగా చారలు చారలుగా కాలిన ఆకారంతోనే ఉంటుంది. దానిని కర్రతో కలికితే లోపల ఎర్రగా నిప్పు కనిపిస్తుంది. నోటితో ఊదరు; ఊదితే కంట్లో పడుతుంది. తలపైన పడుతుంది. కర్రతో కదిలించడం పల్లెటూరి మామూలు దృశ్యం. సొగసంతా 'పలాలాగ్ని' అన్న దాంట్లోనే ఉంది. గడ్డికాలి వల్లగా ఎలుగ్గొడ్డులా—రొయ్యలా, వలుపూ-ఉంది. దీనిని అనువాదంలో "చెత్తనిప్పు మసియారిన కుప్పను" అని చెప్పడంవల్ల మూలంలోని రమణీయత పాడైపోయింది. ఈ అర్థాలన్నీ ధ్వని ప్రధానమైనవి. వ్యంగ్య మర్యాద దాటి వ్యాఖ్యానాలలోని టిక్కులన్నీ కలిపి పెద్ద వృత్తం చేసితే మూలం చచ్చి ఊరుకుంటుంది.)

(7) వహోంతీఏ ణిప్పలచ్చిఅ
ఘుణరిద్ధీహోఇ కిలిణపురిసస్స,
ణిహొ్మఅవ పంత తిప్ప
ణిఅఅచ్చాహి వ్వ పహిఅస్స.　　2-32

ఎంగిలిచేత గాకి వద
　　లింపని లోభికి బెద్దకల్మిహా
స్తంగతమౌను గాక యది
　　సర్వము వ్యర్థమె సుమ్మి, నిండువే
సంగిని మండుటెండ బడి
　　జాల తపించెడి బాటసారికిం
జెంగున వెంటవచ్చు తన
　　చిక్కని దేహపు నీడపోలికన్.

(మూలంలోని బిగిజిగి అనువాదంలో సంవృతి లేనందున పోయాయి. ఎంగిలిచేత గాకి వదలింపని, మండుటెండ బడి చాల తపించెడి, చెంగున - మొదలయిన వ్యర్థ పదాలు - ఉత్పలమాలను ఆశ్రయించడంవల్ల-తప్పనిసరి అయాయి. శ్రీప్రభాకర శాస్త్రిగారి అనువాదం ఎంత సంవృత సుందరమో చూడండి:

ఎంత వృద్ధి గాంచె పేనియు దనసొమ్ము
చేత లోభి సుఖము చెందలేడు
మండుటెండ మాడుచుండు గ్రోవరి తన
రొండిల నీడ దనుపు నొందవట్లు.)

(8) పాఅ పడిఅస్స ప ఇ ణో
పుట్ఠిం పుత్తే సమారుహా త్తమ్మి,
దఢమణ్ణు దుణ్ణిఆఏ
హి హాసో ఘరిణీఏ ణిక్కంతో.　　1-11

ప్రియాల నడుగుల పై వ్రాలి జాలివేడు
కొనెడి చెలువుని వీపుపైనను బుడుత
డెగిసి యెక్కెను పని గోన నగవు పెల
మలిగియున్న యిల్లాలిలో నిలువదయ్యె.

(ఎంత మూల విరుద్ధంగా అనువదించారు! పతికాళ్ళపై పడ్డాడు. అయినా ఇల్లాలి కోపం తగ్గలేదు. అలాటి రసక-దాయప్పట్టులో పాపడు తండ్రివీపెక్కి "గుర్రం గుర్రం" చేశాడు. దాంతో ఆ యిల్లాలికి నవ్వాగలేదు. తోసుకొని వచ్చింది - అని మూలభావము. అంటే పతి చేయలేని అలకతీర్పు సుతుడు చేశాడు. కాని నరసింహశాస్త్రిగారు 'నగవు పైతె మలిగియున్న యిల్లాలిలో నిలువదయ్యె' అని అనువదించి కవికి, సహృదయులకు అన్యాయంచేశారు. దీనికి శ్రీ ప్రభాకరశాస్త్రిగారి అనువాదం వినండి.

కాళ్ళమీదబడి మగడు వేడుకొన వీపు
గుర్రమెక్కి యాడె గుర్రవాడు
అట్టియేడ్పు నాగ్రహాను డొల్లి గిల్ల యి
ల్లాలికంత నవ్వు రాలువారె.)

(9) ఫలహీ వాహణ పుణ్ణాహ
మంగలం లంగలే కుణంతీఏ,
అస ఈ అ మణోరహ
గబ్భిణీఅ హత్థా థరహరంతి.　　2-65

దూది పొలముల క్రొత్తగా దున్నబోవు
నాడు నాగలి కుంకాళ్ళు వనువు నవుడు
కోర్కెలుబుకెత్తు నెడదతో గుచములదరు
హాలికు చెలవాగ చేతులు వడకిపోయె.

(పత్తిచేను దున్నడానికి ఏరు పూజచేసే సమయంలో, కాపు జవరాలు చెడిపెగనుక, పత్తిచేను ముందుముందు తనకు సంకేతస్థలం అవుతుందనే ఆశలు మనస్సులో ముసురుకోగా, చేతులు వణికాయి - అనేది మూల భావం. అసతి కనుకనే వణకడం. సతి అయితే భక్తితోనే ఉంటుంది. 'హాలికు చెలవాగ' అనే అనువాదంలో మూలంలోని అసతి లేదు. దానితో పూర్తిగా విరుద్ధార్థం వస్తుంది. మూలంలో కుచాలు అదరడ మేమీ లేదు. శ్రీ శర్మగారి అనువాదం:

పత్తిచేను దున్న వలసి మంచిదినాన
మడక పూజ చేయ దొడగి నపుడు
కోర్కెలాత్మ గుబులుకొన గడగడ మని
వడక దొడగె గాపు చెడిపె కేలు)

(10) ణిక్కమ్మాహిం వి ఛేత్తాహిం
పామరో ణే అ వచ్చఏ వసహిమ్,
ముఅపిఅజాఆ సుణ్ణఇఅ
గేహ దుఃఖం పరిహరంతో.　　2-69

కాలకరాళ జిహ్వ కెరగా
　　ముసురొడ్డి గతించిపోవ ని

ల్లాలటు శూన్యమైన వ్యగ్ర
హృమ్మన, కారని శోకమూపుకోగ
హాలికు డొక్కఁ పూట యయి
నన్ జన డేపనిపాటు లేకయే
చేలంటఁబట్టి నూరక చ
రించుచు నుండును గాని చేనిలోన్.

(పొలంలో పని అయిపోయింది. ఇంటికి వెళ్ళాలి. కాని, ఇల్లాలు మరణించింది. ఇల్లు బావురుమంటున్నది. కనుక కాపు ఇంటికి వెళ్ళడు; చేను కదలడు. కాని అనువాదం వ్యాఖ్యాప్రాయంగా ఉంది. 'చేలు బట్టు నూరక చరించుచు నుండును గాని చేనిలోన్' అనేది మూలంలో వ్యంగ్యం. ఆ మర్యాద అనువాదంలో వాచ్యమై మనోజ్ఞత కొరవడింది. దీనికి శ్రీ మల్లంపల్లి శరభయ్యగారి పద్యం:

సేతు బలిసి పనులు పెల్లియున్న పొలాన
కంటె కాపు మూడ డింటి మొగము
అచిర మృత కులాంగ నాత్యంత శూన్యకృ
తాలయమున బావురన్న ఎడద.)

(11) గేణ్హహ పలోఅహ ఇమం
పహసిఅవఅణా పఇస్స అప్పేఇ,
జాఆ సుఅ పఢము
బ్భిణ్ణ దంతజుఅలంకిఅం బోరం. 2-100.

ఇదిగో కైకొని చూడుడీ యిట్టలనుచు
చిన్న నగవు కెమ్మోవిపై జిందువోంద
భర్తకొసంగుచున్నది సతి ప్రథమజాత
దంతయుగళాంకితము గన్న తనయు మొగము.

(ఎంత పొరపాటయింది అనువాదంలో. పిల్లడికి పాలపండ్లొచ్చాయి. రేగుపండును కొరికాడు. అదొక అపూర్వ సంఘటనం తల్లికి. కాదూ మరి! ఆ పాలపండ్లగాట్లున్న పండును భర్తకు చూపిందట. ఎంత ముచ్చటైన విషయం. అనువాదంలో మూలంలోని బదరం సంగతి —ప్రథమోద్భిన్నదంతయుగళాంకితబదరం సంగతి— ఏదీ?)

(12) తా కింకరే ఉ జఇ తం
సీతీఅ వఇవేట్ఠ పేల్లిఅ థణీఏ,
పాఅంగుట్ఠద్ధక్కిత్తి
ణీసహంగీ అ వి ణదిట్టో. 3-21

పట్టు పరదాల గీల్కొల్పబడిన చనులు
బిగిసిపో, వరబొట్టన వ్రేళ్ళమీద
నిలచి, నిస్సహాయా మేన నిగిలి కనిన
నీవు కనిపింప నపుడామె ఏమి సేయు.

(వఇవేట్ఠ - వృతివేష్టన - మంటే శాస్త్రిగారు పొరపడ్డారు. నాయిక ఇంటి కంచెదగ్గరికి వచ్చి దానికి రొమ్ము ఆనించి, కాలెత్తి చూచిందన్న మాట. ఎంత చక్కని సంగతి? ఉత్కంఠతో చూచేటప్పుడు రొమ్ములు కంచెకు ఆనుకోగా మరింత పొంగినట్టయా యన్నమాట. అలాటి వాటిని శాస్త్రిగారు పట్టు పరదాలతో కీల్కొల్పారు.)

(13) విక్కిణఇ మాహమాసమ్మి
పామరో పాఇడిం వఇల్లేణ,
నిద్ధూమ ముమ్మర వ్విఅ
సామలీఅ థణే పడిచ్ఛంతో. 3-38

మాఘమాసాన హాలిక కుమారకుండు
కొమరుప్రాయపు ప్రియురాలి తిమురుచనుల
బిగువు కనిపెట్టి దుప్పటి వేగమమ్మి
యొక్క బలిసిన గిత్తివా యరార గొనియె.

(ప్రియురాలిపాలిండ్లు పొగలేని ముర్మురములు అనేది ముఖ్యాంశం. మాఘమాసం చలికి తాళగలవన్న మాట. అందులోను ఆమె శ్యామ కనుక కాఠిన్యం మొదలయిన గుణాలు వ్యంగ్యం. 'ప్రియురాలి తిమిగుచనుల బిగువు' లో ముర్మురాల మనోహరత లేదు. హాలికకుమారకుడు కాడు. హాలికుడే. బాగా అనుభవం కలవాడే. దీనికి శ్రీ ప్రభాకర శాస్త్రిగారి అనువాదం వినండి:

హాన్పైవెల మాఘమాసము వచ్చె ననుచు
ముద్దుగంబడి తెగనమ్మి రొక్కగొనియె
చలికి పొగలేని కుంపట్లు గలవుతనకు
చెలియ బిగిచన్నులను తృప్తి సేద్యగాడు.

శ్రీ వాగుని అనువాదం :

మాఘమాసంబు పులివలె మలయుచుండ
బచ్చడం బమ్మికొన్నాడు పణములకును
(పసరమునకు)
ముదితచన్నులు పొగలేని ముర్మురములు
చలికి నొరగోయు కేలుండు పైరికుండు.
(క్రీడా. పు. 86.)

(14) రణ్ణాఉ తణం రణ్ణాఉ
పాణిఅం సవ్వఅం సఅంగాహమ్,
తహావి మఆణం మఈణం
అ ఆమరంతాఇ పెమ్మాఇ. 3-87

ఒకచో జల్లని మంచినీరు నొకచో
నొప్పారు లేలేత ప
చ్చిక వాఞ్ఛించి స్వయమ్ముగా జతలుగా
జీవించుచుం గాన కా
నకు సంచారము సేయుగాక తమ జ
న్మం బుండునందాక బా

యక ప్రేమమ్ములు నిల్చు జింకలకు నా
యాలేఖ్యకున్ గాఢమై.

(ఎంత చిక్కగా చెప్పదగింది ఎంత పెంచారు? జింకలూ లేళ్లూ పేరా? శ్రీ శివభద్రయ్యగారి అనువాదం చూడండి:

అశ్రువులిడిన కపట యకంట కపవుల
మడియలిడిన నీరె పానమునకు
జేని బ్రతుకు దానికే కాని మృగమృగీ
ప్రణయ మాశరీరపాత బంధి.)

(15) అజ్జం మోహణసుహిఅం
ముఅ త్తి మోత్తూణ పలాఇఏ హలిఏ,
దరఫుడిఅ వేంటభారో
ణ ఆ ఇ హసిఅం వ ఫలహీఏ: 4-60

రతిసుఖ వివశ గ్రామిణసుత మృతయని
తలచి హాలిక పుత్రుడు పిక్కబలము జూప
అరలు చిట్లిన కాయల బరువుతోడ
వంగి చెంగున నవ్వెను ప్రత్తికొమ్మ.

(అయ్యో! మూలాన్ని మట్టిచేశారే. హాలికుడు దొడ్లోనో, తోటలోనో ఇంటి యజమానురాలినో, యజమానుని కూతురినో సంతోషపెట్టాడు. ఆమె పారవశ్యంలో మైమరచి సొమ్మసిల్లిపడింది. హాలికుడు ఆమె చనిపోయిందని పరుగెత్తాడు. అది చూచి సగం కాయలు పగిలిన పత్తికొమ్మ నవ్వినట్టుందట. ఏమి సొగసు! ఏమి సొగసు! అనువాదంలో ఇదేమీ లేదే! మూలంలోని 'అర్య' 'గ్రామిణసుత' అయింది. గ్రామ+ఇన సుత అని ఉద్దేశమా? ఆమె యజమాని యింటి స్త్రీ కనక నే హాలికుని భయం. పత్తికొమ్మ మందహాసం చేసింది. "వంగి చెంగున నవ్వ" లేదు. శ్రీ శర్మగారి అనువాదం చూడండి!

చొక్కి కనులు మూయ సుదతి జచ్చెనటంచు
విడిచిపారు కాపు వెసగుజూచు
పత్తికొమ్మ సగము పగిలిన కాయల
మొగమువంచి చేల నగియె బోలె.)

(16) పిక్కరి అ మణిఅ ముహా
వేవిఆఇ ధుఅవాత్తిపింజిఅవ్వాఇ,
సిక్కంతు వోడహీఓ
కుసుంభ తుంహ ప్పసాఏణ. 4-92

ఎలయుటు పీతాకారములు నాంకృతులును మొగము
మలుపులను శీతియాపుల మంజులించె
తనులు గాంచురు మీ ప్రసాదమున ముగ్ధ
కులకుమారికలు గులాబి కొమ్మలార!

(పద్యం పసందుగా ఉంది కాని—మూలంలోని "కుసుంభ" గులాబి కాదు. కుసుమపూలు. కుసుమపూలను, వాటి ఎరుపు రంగును వేలం వెర్రిగా ప్రాచీనులు — గాథాసప్తశతి గాక — వర్ణించారు. అలాటి మాటను 'గులాబి' అని అనువదించడం సాహసమేనంటాను. కుసుమపంట, కుసుమనూనే నేటికీ రాయలసీమలో ఆబాలగోపాలం ఎరుగును.

(17) నెరువన వరిచేనిలో దూరి కడుపు
నింపుకొనుచున్నది నొకుండెసుంత
6-2

(మూలంలో ఉన్నది 'జవే చరఇ'-యవాంశ్చరతి అని. యవల చేను వేరే. వరి వేరే. యవలంటే దేశవాళీ బార్లీ-జౌ. ఉత్తరాదిన పెద్దపంటల్లో ఒకటి.

(18)...ఇట్టి తెనుగు పదములు సుమారు పదునెనిమిది గాథాసప్తశతిలో కానవచ్చుచున్నవి. ప్రస్తావన పు. 9. (గాథా సప్తశతి తెనుగుగడ్డపై వెలసిన రచన. తెనుగు కవిరాజు సేకరించిన ఈ గాథలలో దేశీ పదాలు-ముఖ్యంగా తెనుగు పదాలూ, సంప్రదాయమూ జల్లిబిరియక మానవుకదా? ఇలాటివాటిని కులశాల దేవుడు మున్నగు వ్యాఖ్యాతలూ, పాదలిప్తాచార్యుడు మొదలు హేమచంద్రుని వరకుగల ప్రాకృతవైయాకరణులూ, నిఘంటుకారులూ దేశిపదాలుగా నిర్ణయించారు. అత్తి, వాలుంకి (ఒల్లెంక), పీలుఅ(పిలక), పొట్టం(పొట్ట), కిలించిఅ (కిలిచ్చల్, కించు), అద్దాఓ (అద్దం), భోండీ (పంది), సరిఅ (సేరు), తుప్ప (తోరవు), ఫలహీ (ప్రత్తి), వెంట (వెంటి) రుంప (రంప), సిప్పిర(చీపురు), తెలూర, మసిణ (మసివ), ఓస(ఓటు-అదిటు), ముఇల, పాణఉడీ(పాణసి), తీరవి (తీరదు), కుసుంభ (కుసుమ), గడిజ్జఇ (నలచు), పక్కల(మొక్కలి), చటుఅం(చటి), ఉలం (ఉబ్బు ఇల్లు, ఉల్లోపు), చోజ్జం, పుప్ఫిఅ (పిసిక), ఉప్పంగ (ఉప్పెనగ), పలాల(పులు), కవి(కై) మొదలయినవి తెలుగు పదాలుగా నిరూపిస్తున్న సర్వధారి చైత్ర భారతిలో వ్యాసం చూడగోరినాము)

ఏమైనా ఈ అనువాదం కావ్యానికి 'జీవితం వ్యంగ్య వైభవం' అన్న ఆలంకారిక నిర్వచనం విస్తరించే సాగిందని అనడం సాహసం కాదు. రా. చ.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**